ఉ॥ ఇంతి, మదీయమానధనమెల్ల హరించిన ప్రముచ్చు నిమ్మెయిం|
బంతమెలర్పవ్రాసి పటభాగనిరూపితుఁజేసివట్టి నీ|
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె! నీచరిత్రముల్|
వింతలె నాకు! నీమహితవీరకులంబు బలంబుఁ జెప్పుమా॥

చ॥ అనవుడుఁ జిత్రరేఖజలజాక్షికి నిట్లను: నీకుమారకుం|
డనఘుఁడు, యాదవాన్వయసుధాంబుధి పూర్ణసుధాకరుండు వా|
దవరిన కృష్ణపౌత్రకుఁ డుదారచరిత్రుఁడు, భూరిసింహసం|
హననుఁ డరాతిసైన్యతిమిరార్యముఁడు, పేరనిరుద్ధుఁ డంగనా॥

—భాగవతము.



# గృహలక్ష్మి

## మహాత్ముని ప్రాయోపవేశోద్దేశము, తత్ఫలితము

—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు.

[బొంబాయిరాష్ట్రము కళ్యాణినగరమునను్న ఆంధ్ర అసోసియేషనువారు జరిపిన వ్యాసరచన పోటీపరీక్షలో నీవ్యాసము ప్రథమబహుమానమును గ్రహించినది. రాష్ట్ర గౌరవము నందినందునకు శ్రీమతి వరలక్ష్మమ్మగారికి మాయభి నందనములను, ఈవ్యాసమును ప్రకటించుకొనుట కంగీకరించి పంపించినందుకు అసోసియేషనువారికి మానమస్కారములను అర్పించుచున్నాము. గృ॥సం॥]

మహోన్నతాశయపూరితులగు మహాత్ముల భావమును గ్రహింపనెంచుట అగాధసాగరముయొక్క గభీరతను కొలతబద్దతో కొలిచి గ్రహింపనెంచుట వంటిది. అందును సన్నిహితవర్తులగు మిత్రులకైన తెలియబఱుపకుండ మహాత్ముడీమాఱు గావించిన యుపవాసవ్రతముయొక్క యుద్దేశ్యమును గ్రహించుట సాధ్యమగువిషయము కాదు. అయినను దేశపరిస్థితుల నొకమాఱు పరికించితిమేని మహాత్ముని యుపవాసోద్దేశము నించుక తెలిసికొనవచ్చును.

అగస్టునెలలో మాక్డొనాల్డు ప్రధానమంత్రిగారి సాంఘికసమస్యాపరిష్కార ప్రణాలిక (కమ్యూనలు ఎవార్డు) ప్రకటితమయ్యెను. అందు అస్పృశ్యులకు సవర్ణులతో కలియుటకు వీలుగాని ప్రత్యేకపు ఏర్పాటు లుండెను. భారతీయులలోగల అస్పృశ్యతాదిమహాదోషముల నివారించి భారతీయులనెల్లర నొక్కజాతిగా జేయ మహాకృషి చేయుచున్న మహాత్మున కీసాంఘిక పరిష్కారము దుస్సహమనిపించెను. ఏది యయుక్తమని భావించునో దానికి వెంటనే ప్రతీకారముచేయుట కలవాటుపడినమహాత్ము

డీ విభేదమును రూపుమాపుటకై ప్రాయోపవేశము నుండెను. 'దొరతనమువారును దేశీయులును దీనిని తృప్తికరముగా పరిష్కరించిన దప్ప లేకున్న నేను నిరాహారినై అస్పృశ్యులకొఱకు ప్రాణమర్పింతు'నని మహాత్ముడు పూనిన మహావ్రతమును గని యావత్ప్రపంచము సంక్షోభమునొందెను. మహాత్ముని ప్రాణమును గాపాడుటయే ముఖ్యోద్దేశముగా బెట్టుకొని యవర్ణసవర్ణనాయకు లెల్లరును సమావేశమై యొక యొడంబడిక చేసికొనిరి. దీనిని ప్రధానమంత్రిగూడ ఆమోదించెను. అపదతీరెను. మహాత్ముడాహారమును స్వీకరించెను. కాని యీ యేర్పాటువలన హరిజనోద్యమము బాగుగా సాగకున్న మరల నుపవాసముందునని యానాడే చెప్పెను.

మహాత్ముడు త్రికరణశుద్ధి గలవాడు. కాన నితరులయందుగూడ ఆయన త్రికరణశుద్ధినే పరిశీలించును. పైపై చేతలాయన చేయడు. ఇతరులు చేసినను మెచ్చడు. తన ఉపవాసానంతరము హరిజనులయెడ దేశీయులవర్తన మెట్లున్నదో నింకు ఆరునెలలు పరికించెను. తాత్కాలికోద్వేగముతో ప్రారంభింపబడిన హరిజనోద్ధరణోద్యమము నిదాఘనదివలె సన్నగిలిపోవుచుండెను. సనాతనుల తిరుగుబాటు నానాటికి ప్రబలముగుచుండెను. రాష్ట్రీయశాసనసభలో ప్రవేశపెట్టుటకు ప్రయత్నింపబడిన హరిజనదేవాలయప్రవేశబిల్లులు దేశసమస్యయని త్రోసివేయబడెను. సామ్రాజ్యసభయందుగూడ నీబిల్లులు ఆలోచనకురాకుండ కృత్రిమముగా అణచివేయబడెను. దొరతనమువారుగూడ నిందుకే సహాయపడిరి. పూనా ఒడంబడిక చేసికొనుటకు ప్రధాననాయకులు గానున్న డాక్టరు అంబేద్కరువంటివారు ఈ యొడంబడికయందు మార్పులుగలిగించుటకు ప్రన్నాగములు పన్నసాగిరి. ఇక తనవారని నమ్మియున్న అనుచరులయందును, నాశ్రమవాసులయందును, దేశీయనాయకులయందునుగూడ హరిజనులయెడ చిత్తశుద్ధిలేమిని మహాత్ముడు గ్రహించెను. కేవలము తనయందలి అభిమానముచేత హరిజనోద్యమమునందు అభిమానమున్నట్లు దేశమునందు నటనసాగుచున్నదేగాని నిజమైన పరివర్తనము కల్గుటలేదని మహాత్ముడు తెలిసికొనెను. దీనికంతయు కారణమేమి? మహాత్ముడు నిరంతరము ఆత్మపరిశీలనము గావించుకొను మహాసాధకుడు. ఈ ఆత్మశోధనచే మహాత్ముడీతప్పిదమంతయు తనదే యనుకొనెను. "నేను కోరినది మీరిచ్చినసరి, లేకున్న ఆహారము పుచ్చుకొనక చచ్చెద"నని వ్రతము పూనుట ఒకవిధముగా ప్రజలను, ప్రభుత్వమువారిని బెదరించుటవంటిదనియు, ఆగ్రహమును ప్రకటించుటవంటిదనియు, ఆత్మవిశ్వాసములేక తాను చేసినపనికి తగిన ఫలితమే దేశమునందు గంటిననియు, ప్రజలయందును, ప్రభుత్వమువారియందును తాను గాంచిన యుదాసీనతకు కారణము భగవంతునియందు పరిపూర్ణవిశ్వాసము లేక స్వాహంకారతతో తాను చేసిన ప్రాయోపవేశమే కారణమనియు, మహాత్ముడు పూర్తిగా నమ్మెను. ప్రతి చిన్న లోపమునకును ప్రాయశ్చిత్తమును విధించు

కొనుమహాత్మ డీపెద్దతప్పిదమునకు నిష్కృతి విధించుకొనక యెట్లుండును? పరులకొఱకు తానే హింసకొడబడెడి జీసస్ మహాశయుని వంటి మహాత్యాగి గదా మహాత్ముడు! ఎప్పుడు తనయందును పరులయందునుగూడ లోపము కనిపెట్టెనో, అప్పుడే మహాత్ముడు మరల నుపవాసదీక్షను బూనెను.

అనుచరులకైన చెప్పలేదు. ఆత్మబంధువులకైన నెఱుకపఱుపలేదు. దొరతనము వారికైన తెలియజేయలేదు. తనకు దాను మనస్సునందు దృఢనిశ్చయము చేసికొనిన వెనుకనే యెల్లరకు దెలియబఱచెను. ఈ మూడు వారముల యేకవింశత్యుపవాసమునకు నెట్టి పరిహారములును లేవు, మినహాయింపులును లేవు. ఈవిధముగా జేసిన నిట్లు మానుదునను దౌర్బల్యసూచకములగు క్షుద్రమార్గములు గూడ లేవు. పరులతో దీనికి సంబంధమే లేదు. "హరిజనోద్ధరణమున నాసేవ యగత్యముగుచో భగవంతుడు నన్నీ దీర్ఘోపవాసమునుండి రక్షించును. లేకున్న తన సన్నిధికిఁ గొనిపోవును" అను పరిపూర్ణభక్తి విశ్వాసములతో నీ యుద్దండవ్రతమును బూనెను. ఎప్పటివలెనే బంధులు, మిత్రులు, పరిచితులు, అపరిచితులు, దేశీయులు, విదేశీయులుగూడ మహాత్ముని యీదీక్షను మాన్పించుటకు మహాయత్నము చేసిరి. కాని మహాత్ముడు హిమాచలమువలె నచలుడై తన యుపవాసవ్రతము ననుష్ఠించుటకే దృఢసంకల్పుడయ్యెను.

మేనెల 8వ తేదీ వైశాఖ శుద్ధత్రయోదశి భారతీయుల కమూల్యమైనది. ఆనాడు నృసింహజయంతి. మొఱకుడైన తండ్రి పెట్టిన బాధలెల్ల ప్రతీకారములేక సహించిన పరమభాగవతశేఖరుఁడగు ప్రహ్లాదుఁడు భగవదనుగ్రహమునఁబడసిన దివ్యదిన మది. అట్టి శుభదినమున అపరప్రహ్లాదుఁడగు మహాత్మాగాంధీ యిరువదియొక్క దినముల దీర్ఘోపవాసవ్రతమునకు బూనెను. ఈ యుగ్రతపముయొక్క పర్యవసానమునకు వెఱచి ప్రభుత్వమువారు మహాత్ముని బంధవిముక్తుని గావించిరి. మహాత్ముడు పర్ణకుటి జేరి తన యుపవాసమును నిర్విఘ్నముగా నెఱవేర్చెను. ధర్మదీక్షయందు మహాత్మునకు ప్రాణము తృణము. కాని దేశీయులకు మహాత్మునిజీవ మమూల్యధనము. కాన మహాత్ముడు కోరకున్నను ప్రఖ్యాతవైద్యవర్యులెల్లరు గుమిగూడి ముయ్యేఁడుదినములు మహాత్మ నేమరక సేవించిరి. మృత్యుగహ్వరమునుండి బయలుపడినట్లుమహాత్ముడు, కఠోరవ్రతమునుండి బయటపడినాడు. రాహువిముక్తచంద్రమండలముభాతి మహాత్ముని మూర్తి,మరల భాసమానమై యెల్లరనాకర్షించుచున్నది.

అయిన నిక నీ యుపవాసవ్రతఫలిత మేమి యనునది కట్టకడపటి విచారణీయాంశము. దీని కెంతదూరమో విచారింప నక్కరలేదు. అనుదినమును హరిజనోద్ధరణ విషయికవృత్తాంతములతో పుటలు నింపుకొనివచ్చుచున్న పత్రికలే సాక్షి. మహాత్ముడుపవాసదీక్ష పూనినది మొదలు మందగమనమున నున్న హరిజనోద్యమమున కెంత తేజము ఎంత వేగము ఎంత గౌరవ మేర్పడినది!!మానవసేవావ్రతులగు మహాత్ము

రెండలు ననముగట్టి మహోద్యమమున ప్రవేశించినారు! ఏమి త్యాగము! ఏమి దీక్ష! ఏమి కార్యతత్పరత! హరిజనుల నిమిత్తమై ఎన్ని పాఠశాలలు! ఎన్ని వసతిగృహములు! ఎన్ని ఆశ్రమములు! ఎన్ని గ్రంథాలయములు! ఎన్ని పఠనమందిరములు! ఎన్ని వైద్యాలయములు! ఎన్ని ఊరేగింపులు! ఎన్ని ఉత్సవములు, ఎన్ని అన్నదానములు! ఎన్ని వస్త్రదానములు! ఎన్ని ప్రాచీనదేవాలయములలో ప్రవేశములు! నూత్న దేవాలయ నిర్మాణములు! ఎన్ని భజనమందిరములు! అహో! విద్యుద్వేగము వచ్చినది గదా హరిజనోద్యమమునకు ఈమూలు! పురపాలకసంఘములు తాలూకాబోర్డులు డిస్ట్రిక్టుబోర్డులుగూడ నీ మహోద్యమమునకు చేయూతనిచ్చుట విశేషవిషయము.

అహో! ఏమి మహాత్ముని ఆత్మవైభవము! తపోఫలము! త్యాగశక్తి! పురబాహ్యమున నుండెడి పంచమపల్లెలు పావనక్షేత్రములైనవి. అనాదరింపబడెడి చండాలురు హరిజనులైనారు! అణచివేయబడిన అవర్ణులహక్కులు అగ్రస్థాన మలంకరించినవి! 'పొమ్ము! దూరముగా బొమ్ము! మాటవినిన మైలపడుదుము. సమీపించిన సచేలస్నానము చేయవలయును. స్పృశించిన ప్రాయశ్చిత్తము చేసికొనవలయు'నని కంపరముతో కళవళముతో కన్నెఱ్ఱచేసెడి అగ్రవర్ణులు అనుతప్తహృదయులై 'రమ్ము సోదరా రమ్ము. నిన్ను నివారించినపాపము పరిహారమగునట్లు నిన్ను గ్రుచ్చి కౌగలించుకొనెద' మని పరమాదరంబున ఆహ్వానించుచున్నారు. ఏనాడును హరిజనులు అడుగుపెట్టియుండని హైందవదేవాలయములు తమకు దామే ఉద్ఘాటితములై అవర్ణుల నాహ్వానించుచున్నవి. ఈ అపూర్వసంఘటనమంతయు నేమి? మహాత్ముని ప్రాయోపవేశఫలితము.



## పాకీవాఁడు

గీ॥ నెయ్యుఁడా! నీవు తాకరాని నరుఁడంచు
శుచిమెలుంగనివాండవంచు జనవితతి
నల్క హేతువేమొకో? ప్రతిపదమునందు
శుద్ధినినువెంబడింప, మా సుఖముఁగోరి
యనిలభూములఁ గడుమనోహరములు
సల్పి మమ్మనారతము వనప్రవాస [గనో
విముఖులుగఁజేయుచున్నీవు వెలయుచుం
తల్లిబిడ్డకుఁబోల్కి నూత్న బలమీయు[డ?
సర్వదానీవుమాకర్థి సాయపడుదు
వినుగుమనుజునకెవ్వఁడుఁ బాస్యగదనెను
నీతినుద్ధరించుటకు యత్నింతువెపుడు

శ్రీమతి పింజమూరి వేంకటరత్నమ్మగారు

నీపవిత్రసేవాస్రవంతి బహుళఫలిన
వస్తునివహంబు దవ్వుగాఁ బరివహించి
తానుమాత్రముశుద్ధమై తనరునెపుడు
భూమికి విషప్రళయబాధ పొరయకుండ
మనుమహేశుఁడావిషవహ్నిఁ బుచ్చుకొనియె
అట్టిదివ్యశాంతముతోనె యనుదినంబుఁ
బుడమి నీవురక్షింతువు మురికినుండి
రమ్మమిత్రమా! రమ్మునాప్రళయహర్త!
మనుజునకుఁగల్గు దుర్యశోమలపదార్థ
మంతయు వహించుచున్ మానవాళిసేవ
సలుపుధైర్యసంపద మాకొసంగుమయ్య!

# దేవా దీనమందారమా!

శ్రీ చిలుకలపల్లి సాక్షిగోపాలస్వామిగారు

హితమౌ శాస్త్రములెల్లబల్కునవి నే నెక్కాంతచారిత్రమా
గతిగాఁజూచితి; పెద్దలెల్లరు సదేగా జెప్పఁగావింటి స
మ్మతమంచాత్మకుఁదోఁచె; నింకదలఁపమా మానంగ నెవ్వేళ; నా
పతినే దైవముగాఁగ నెంచెదను దేవా దీనమందారమా॥ ౧.

చతురంభోధిపరీతభూతల మహాచక్రంబు నందున్న సు
వ్రతచారిత్రలు కాంతలెల్లరు సదా వాంఛించి మేలైన స
ద్గతినిన్ జెందిరి నాథుపాదముల నెక్కాలంబునన్నమ్మి; నా
పతినే దైవముగా గణించెదను దేవా దీనమందారమా॥ ౨.

చతురత్వంబు ఘటిల్లుగాక! విలసత్ శ్రావ్యంబుతో కంఠమున్
హితమున్ బూనునుగాక! భూషణములెన్నే నుంచునుగాక! సం
స్కృతవిద్యం గొనుఁగాక! భర్తృపదరాజీవారతిం బోలునే?
పతినే దైవముగాఁగ నెంచెదను దేవా దీనమందారమా॥ ౩.

సుతులేలన్ హితమేల? వాక్యముల సంశోభారతింకేల? సు
వ్రతముల్ సేయఁగనేల? గ్రంథములపై భావంబదేలన్ సదా
పతియే దైవమటంచు నెంచఁగల సౌభాగ్యంబుచేజిక్కు; నా
పతినే దైవముగాఁగ నెంచెదను దేవా దీనమందారమా॥ ౪.

హితమౌ శ్రీ "గృహలక్ష్మి" యీపెయని యెన్నే రీతులన్ బంధువుల్
హితులున్, పండితులున్, మహాకవులుమానీశుల్, సదార్యుల్, సదా
మతిమంతుల్ దలపోసి చూచెదరు సామ్రాజ్ఞీవిధంబట్లు; నా
పతినే దైవముగా గణించెదను దేవా దీనమందారమా॥ ౫.

పతిపాదంబులనమ్మి భామలకు సౌభాగ్యంబునుం గీర్తియున్
గతియుం గల్గును; కానివారలకికన్ గావావిధుల్; మున్ను సు
వ్రతచారిత్రలు బోవు మార్గములనే బాదంబులన్నిల్పి నా
పతినే దైవముగా గణించెదను దేవా దీనమందారమా॥ ౬.

# "కః పన్థా"

పసుమర్తి కృష్ణమూర్తిగారు

దేశమునందుఁ బ్రస్తుతపరిస్థితులఁగూర్చి సమాలోచన సేయునపుడీ ప్రశ్న - కఃపన్థా యను యక్షప్రశ్న - కలుగుట సామాన్యము. ఏతావత్తు రాజకీయ విషయములతో మనకంతగాఁ బ్రసక్తి లేదు; కాని సాంఘిక విషయమమాత్రము మనకుఁ బ్రాణప్రదము. ఇఁక సాంఘిక విషయమనగానే మాటి కనుబడిపోల్లు స్త్రీవ్యక్తిపరమే యైయుండునుగదా! అందువలన మనప్రశ్న "కః పన్థా" యనునట్టిది స్త్రీవిషయము లనే యుత్పన్నమగుచున్నదని చెప్పనక్కరయే లేదు. మరియు నిది సామాన్యమగు ప్రశ్నయును గాదు. సకల ధర్మాధర్మవేదియగు ధర్మరాజొక్కఁడే దీనికిఁదగిన యుత్తరము నీయఁజాలినాఁడు గాని వాని కెక్కోదరులే యైనను భీమాదులకుఁ జేతగాలేదు. అలాగుననే నేఁడు, పలుపురు పలుతెన్నుల కీడ్చుచున్న యీ స్త్రీసంఘమున "కేదిదారి?" యను ప్రశ్న పుట్టుచున్నది. దీనికిఁ బ్రత్యుత్తరమిచ్చుట అంతసులభమైనదని తలఁచుట పొరపాటు! స్త్రీసమాజ మేమాత్రము తప్పుదారిబడినను లోకము నరకకూపమగుట స్వతస్సిద్ధము.

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ|
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః|
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః|
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః|
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన|
నరకేనియతంవాసో భవతీత్యనుశుశ్రుమ|"

అని యర్జునునివంటి నిరుపమానక్షత్రియవీరుడు, గోడుపెట్టి యుద్ధమాడుటా లేక పీడుటా యనుసందిగ్ధావస్థలోఁబడి తన్ను తోఁచకొన్నను, నిజమే!! స్త్రీల మానమర్యాదలఁ గాపాడుటకే కదా రామాయణ మహాభారతయుద్ధములు సేయబడినవి! ఆ పురాణ స్త్రీలు వర్ణనాతీతములగు కష్టముల నుడిచి గడించుకొన్న గొప్పతనమే భారతీయుల కిప్పటికిని మూలధనము!

అట్టి మూలధనమునకిప్పుడు ముప్పువచ్చుచున్నది. పెండ్లామును మార్చి మోటారుకై సికిలు సంపాదించిన వానిజాతిని మెచ్చుకొనుచున్నారు మనయువతులు కొందరు! మరియు సాధుత్వమును చట్టుబండల పాలు సేసి, మార్దవమును మంటఁగలిపి, విచక్షణలేక వీధిని బడుమని యూడువారిని లాగుచున్నారు మరికొందరు. ఇట్టి విపరీతములను జూచియే యనవచ్చు - మొన్న బొంబాయిలో స్త్రీసంఘమున మాట్లాడుచు శ్రీమతి సుబ్బరాయన్ సతిగా రిట్లుపదేశించినారు:—

"Indian women, if they wanted to take up public duties, should show healthy discrimination between Idealism and Sentimentalism. I warn Indian women against the danger of being carried away by the western methods of social life and urge you to follow the country's traditions. It is only by the happy blending of the past with the present that we can successfully work for the regeneration of our Motherland. Reform is necessary for the progress, but it should not be understood as the introduction of habits and customs which are totally opposed in spirit as well as in form to our own ancient civilisation.

I suggest a thorough overhauling of the present educational system and urge inclusion of subjects......... which would enable women to be efficient in regard to the management of our homes."

దీని యర్థమేమి? ప్రజాహితైకతత్పరలై స్త్రీజనము లున్నతవిద్యాభ్యాస మొనర్పవచ్చును, కాని, చిత్తోద్రేకమునొందక సర్వథా భావౌన్నత్యము కలిగియుండుట లెస్స: పాశ్చాత్యసాంఘికాచారప్రవాహమునఁబడి కొట్టుకొనిపోక పూర్వసాంఘికమర్యాదల ననుసరింపవలయును. అనఁగాఁ దమ వివేకముఁ జూపి పూర్వప్రస్తుత నాగరకతలను అవసరములగుమార్పులతో నవలంబింపవలయును. పూర్వపు ధార్ద సాచారములకు సంస్కరణము కావలయునుగాని సంస్కరణముపేర వాటిని రూపుమాపి విదేశాచారములను దెచ్చిపెట్టుటకాదు. మనయాచారములకును నాగర

కతలకును గల యసలుతత్త్వములయందే గొప్పవిరోధమున్నది. విదేశీయాచారములు మనయం దిముడవు సరియేకదా మీదు మిక్కిలి వ్యగ్రతఁ గాన్పించును. అసలా విద్యావిధానమే మనకు సరిపడదు. అది పూర్తిగా మార్పఁబడవలెననియే పలువురు పెద్దల యభిప్రాయము.

దీనినిఁబట్టి తేలుచున్న పర్యవసానమేమి యనఁగా "కః పన్థాః" యనుప్రశ్నకు ధర్మరాజు చెప్పిన ప్రత్యుత్తరమే! "మహాజనో యేన గతస్స పన్థాః" "పెద్దలు నడచినదే మనకును దారి" యని.

ఇచట మరలనొక ప్రశ్న "పెద్దలేదారినిఁ బోయిరి?" యని. దీనికొక దృష్టాంతరముం జెప్పి సమాధాన మీయవచ్చును. ఒక్క తీవ్రదృష్టిమాత్రముచేతనే పదితలలవానిని భస్మీభూతునిగాఁ జేయఁజాలు వీరపతివ్రతయయ్యు, లంకలోనుండి పడరాని యిడుములఁబడి చివరకుఁ బురుషకారమును దత్పరమార్థమును శ్రీరామునకే దక్కించి తనకు సాజమగు గొప్పతనము నిరూపింపఁజేసినది కదా సీత!

అర్థాత్తు ప్రాజ్ఞ కీమతియగు యువతి, విద్యావతియై, గుణవతియై, యథాయోగ్యమగు స్థానమున నుండి పురుషుని నడిపించవలయును. ఈయర్థమును సంభావించియే 'దేశముక్తి స్త్రీలహస్తగతమైయున్నది' యని పెద్దలు పలుకుచున్నారు. ఈతత్త్వార్థము నెరుఁగక "మేమును మీతో సమానులమే" యని కొందరువిదలు ఉద్రేకముతోఁ బలుకుచున్నారు. ఇది దురాపాయను ముప్పావులా కిచ్చివేసుకొనుట. ఇక నుద్యోగములఁ జేయుదుమని మరికొందరు. ఔను, చేయవచ్చును; కాని, యింటనుండి, భర్తకుఁ బ్రాణధనాధికయై బిడ్డలకు దేవతయై, దాసదాసీజనులకు నిరతవంద్యయై, కులగౌరవము నిలువబెట్టుకొనుట గొప్పతనమా లేక యేవందరూపాయలకో తలవమ్ముకొంట గొప్పతనమా? తల్లిదండ్రులు పెంచుటను, దరువాత భర్తయును వెనుకఁ దనపుత్రులు నన్నదమ్ములును పెద్దలగువారును ఆఁడుదానినిమన్నించి పోషింపవలసియున్నదేకాని యామె స్వతంత్రించి యేవృత్తినో పూని పొట్టపోసికొనరాదు సుమా యను మహదాశయముతోనే మన పెద్దలు మరియాద గడించిరి. కాఁబట్టి యాపద్ధతియే మనకును మంచిది.

—o—

## కాలమహిమ

యలవర్తి సీతారామస్వామిగారు

సీ॥ ధవళసుస్నిగ్ధరత్నప్రభాభాసురోన్నతదివ్యహర్మ్యావళి క్షితినిఁగూల్చి
ప్రథితకీర్తిస్ఫూర్తిపరిపూర్ణతాయుతమానవాధీశులన్ మన్నొనర్చి
ప్రత్యగ్రసాలాగ్రపరిఫుల్లమంజులమంజరీపుంజంబు మాడ్చివేసి
సంతతాశ్రాంతనితాంతహర్షాంబుధీమగ్నమర్త్యతతికి మన్యువొసఁగి

దుఃఖవారాశిభంగాలఁ దూలిపోవు
దీనులకు భూరిసౌఖ్యంబు దీక్షనిచ్చి
జగతి నెన్నెన్నొ మార్పులన్ సతతముఁ జేయు
కాలమా! నీమహిమ నెన్నఁగలమె మేము.

# మెఱుపు

శ్రీ కుటుంబరాయశర్మగారు

(కవితావిహారము)

ఓసీ! సౌదామనీ!

నీవు క్షణప్రభవు. నిన్ను నేననుసరింపను. ఇట్లే నిలచిపోదును. ఇప్పుడు నా కీజగత్సర్వస్వము నంధకారసమన్వితము. సూర్యరశ్మియనిన ననిష్టములేదు; కాని, అంధతమస్సునకే యలవడితిని. నన్నిక మెఱపించి మరపించకుము.

నిరంకుశాంధకారప్రభుత్వము గలరాత్రియో లేక కాంతివంతమగు పగలో నాకు కావలెను. నీవు నన్ను మెఱపించు టనవసరము.

జగత్తు సదసన్మిశ్రమము. మంచియందు చెడ్డయు, చెడ్డయందు మంచియు నిమిడియున్నవి. అట్లే తమస్సునందు వెలుఁగుకూడఁగలదు. ఆచీకటివెలుఁగు నలవరచుకొంటినిగదా! అదియనిన నాకు చాలయిష్టము. నన్నిక మెఱపించవు గాతమని బ్రతిమాలుదును.

నీవు నామమాత్రపుసిరివి. ఇప్పుడు నీకు అలవడినచో నేమగుదును? నీవు నాచీకటి నన్నావరింపదా? నీవు నాకు శాశ్వతవుగావు. సుఖపడి కష్టపడలేను. నన్ను మెఱపించు వైయర్థ్యమునఁబోకుము.

నీవు చంచలవు నిన్ను అలవరించుకొంటినా వంచితుఁడనైనట్లే! నా యీచీకటివెలుఁగున కప్పుడు దవీయసుఁడనగుదును. కేవలనిరంతరనీరంధ్రనిబిడాంధకారావృతుఁడనై వధింపఁబడుదును. అది తలఁచుకొన్న నే నాకనుగ్రుడ్లు బరువెక్కుచున్నవి. నాడీగమనము మందగిల్లుచున్నది. ధాతువులు చెదరిపోవుచున్నవి. నన్నిక మెఱపించిన నిన్ను శపింతునుకూడ నేమో!

రాత్రుల చీకటిని సూర్యభగవానుఁడైనను పోగొట్టఁజాలఁడు. చంద్రుఁడే పారఁదోలవలెను? నీకునుఁ గాంతివిలాసముండుఁగాక; నిన్నుఁబడసి నాకు కార్యములేదు. అంధకారమో లేక తిన్నని వెలుఁగో నాకుకావలెను. సుఖమైనను దుఃఖమైనను నాకు శాశ్వతమైనదే కావలెను. నీవువలదు.

వృథాశత్రువుగాకుము!!

# అస్రఫ్‌కు సింహం అని పేరెట్టింది లలిత

సత్తిరాజుకృష్ణరావుగారు B. A.

హైదరాబాదు వచ్చి మూడేళ్లైనది. కాని లలితకు గంటయిల్లు నాకు వాంపల్లిస్టేషను తప్ప వేరు తెలియవు. పగలల్లా కొట్టుకు కొట్టుకు, పాంథుల విషమప్రశ్నలకు ప్రత్యుత్తరముల నియ్యలేక విసిగి యింటికి వచ్చేసరికి నా సర్వశక్తులు ఉడుగును. ఆమెకు యింట్లో ఆపనీ ఈపనీతో సరిపోతుంది. కోతికి కొబ్బరికాయ దొరికినట్లు సింహం పుట్టిన రెండేళ్లనుంచీ వినకొల్ల వాడితోటే కాలక్షేపం లలితకు

ఇట్లు కడుపులో నీళ్లు కదలకుండా రోజులు పుచ్చే మా ప్రాణాన్కి ఏ ఆత్మో ఒక అవాంతరం తెచ్చిపెట్టింది. 'పబ్లిక్ గార్డెను' అంటే నందనవనమే నని లలితతో చెప్పా రెవరో. ఈ ఉపమాన ఉపమేయముల రెంటి సౌఖ్యములనూ ఎరుగకున్ననూ, రెంటినీ వాంఛింపకున్ననూ, తనబిడ్డకన్న ఎక్కువ అందమగు బిడ్డలు లేరన్న గర్వముతోనున్న లలితకు వాడితో ఈ 'నందనవనం'లో కివిగ నూరేగి రావాలని గట్టికోరిక కలిగింది. అప్పటివరకూ మా సింహానికి చొక్కా అవసరం లేకపోయింది. కాని రానున్న 'నందనవన' యాత్రకై తన పాతచీర కట్టుకోంగులో నొకమూరెడు చించి చిన్నచొక్కా కుట్టింది. ఆనాడు రాత్రి భోజనం చేయుచుండగా "ఇదిగో అంటే ఆరునెల్లు మీతో. ప్రాణావసరమైన పన్లకే ఆల్లా అయితే అచ్చటా ముచ్చటా ఆసలే లేవు. ఈ కొంపఘటం యిల్లా వెళ్లిపోవలసిదే" అంటూ ఉపోద్ఘాతం మొదలెట్టింది లలిత. "ఓహో! ప్రాణం విసిగించక ఏమిటో చెప్పుదూ" అన్నాను ఆవకాయా అన్నంలో అభికాంం మరచినందున కలిగిన కారపుమంటతో. (తన 'ప్లాను' కొనసాగించే ప్రయత్నంలో ఉన్న మా ఆవిడ ఎన్నడూ నా సదుపాయాల నేమరకున్నా అప్పుడు నెయ్యి వడ్డింప మరచింది). "వాళ్లంతా రోజూ 'పబ్లిక్' తోటకు వెళ్తారట. ఎంతో బాగుంటుందిట" అని సన్నంగా రాల్చింది. "ఈ నరక దేశంలో షికార్లు చేలాయిస్తే మర్యాదలు దక్క"వన్నాను. "ఒక్కసారికే ఘోషాఅంతా గంగపాలై పోతుందేమిటి? మనకన్నీ విడ్డూరాలే. ప్రపంచం అందరిదీఓకమతం మనదో మతం" అంటూ కొంచెం ఉచ్చస్థాయిలో వ్యాఖ్యానం చేస్తూ నామీద కోపమంతా కంచాలమీద చెంబులమీద చూపించడం మొదలెట్టింది. సందర్భం చూస్తే శ్రుతిమించి రాగాన్ని పడేటట్టుంది. నా తత్వం ధైర్యంగా వెనక్కుతగ్గే తత్వం. అహైన ఎట్టి మహత్తరోపన్యాసాన్నైనా పెడచెవిని పెట్టెచ్చును కాని అంతఃపురోపన్యాసాన్నిమాత్రం హైదరాబాదునవాబు మొదలు విదురూపాయల తాబేదారువరకు శిరసావహించవలసిందే. ఈ సంసార రహస్యం మొదటినుంచీ గుర్తించిన నేను "ఇప్పు డర్ధరాత్రి ఎక్కడికి తీసుకెళ్తావు? రేపు సాయంత్రం దయచెయ్యొచ్చు" అన్నాను ఆవిడ అనుగ్రహం సంపాదించే ఆత్రతతో. "నాకేం అక్కర్లేదు" అన్నది విజయసూచకమైన చిరునవ్వును చిందుతూ క్రిందిపెదవిని పైపళ్లతో నొక్కిలోపలికి నొక్కుకొనుచూ. ఇంతలో సింహం లేచిన సందడైంది. "లేచాడమ్మా మా చిట్టితండ్రి! యిందాకన్నుంచి బంగారు తండ్రిలా బజ్జున్నాడు. అయనమాత్రం ఎరగడా ఏమిటివాళ్ల వ్యక్తుకు వెనకానరాలేదని" అంటూ అప్పుడే వంటిల్లు చక్కపెట్టి చేతులు కడిగికొని, ఎన్ని నీళ్లైనా భరించే ఖద్దరుచీరతో తుడుచుకుంటూ ఉయ్యాలనుండి తన "బంగారు తండ్రి" వడుననుని రేతుకభీతితో పరువిడినది లలిత. పదిమంది పడి ప్రాసినా తెగని నాదస్వరం దగ్గరకు బుడ్రిగోక్కుంటూ చెంగలలీళ్లనుండి గుడికిపోవు మేకలా నే వెళ్లాను.

౨

కొంచెం మబ్బుగావున్నా గత్యంతరం లేక బయలు దేరాను. నిజంగా "ఎంతో బాగుంది" తోట.

చెట్టూ చేమా చూస్తూ పలురంగుల పిట్టల్ని చూస్తూ, అనేకరకాల జంతువులను చూస్తూ, మధ్యమధ్యనున్న పచ్చికబయళ్లలో "విహారం" చేస్తూ హాయిగా తిరుగుతున్నాము. రోజూ వచ్చేవాళ్లు ఏమీ హడావిడిలేకుండా ఆకబురూ ఈకబురూ చెప్పుకుంటూ కూర్చున్నారు. క్రొత్తగా వచ్చినవారు తోటలోని వింతలన్నీ చూస్తున్నారు. అట్టివారిని వెంటకొని వచ్చిన పాతవారు ప్రత్యక్షముగ కనపడువానినే, తా మిదివరకు వచ్చిన ప్పైరుక పరచు కుతూహలములో వన్నెలు చిన్నెలు పెట్టి వర్ణించి చెప్పుచున్నారు. పిల్లలు గుంపులు గుంపులుగా చేరి అత్యుత్సాహముతో ఆడుకొనుచున్నారు. వారిని చూచిన పిల్లలు దాదులయొద్దనుండియు తల్లులయొద్దనుండియు పరుగునవచ్చి చేరుచున్నారు. చంకలలోనున్నవారు ప్రయత్నముగా జారుచున్నారు. ఎత్తుకొనియున్నవారు కూడ అప్రయత్నముగనే జార్చుచున్నారు.

కాని తన "బంగారుతండ్రి"ని పుట్టినదాదిగ ఒక్కక్షణమైనను విడువని మాలలితమాత్రం మట్టి సహజస్వభావమునకు తావీయలేదు. సింహం చంకలో నిముడుటమానిన చంటి నీడ్చుకొని ఆశ్లేషిస్తోంది. అల్లా కొంతదూరం వెళ్ళేసరికి ఇద్దరు పార్శీపిల్లలను త్రోపుడుబండీలో కొనిపోవుచున్న కురకబంట్రోతును గాంధర్వవిధిని వివాహమైన తెలుగుదాని యొకతె లలితభయమును చూచి నవ్వింది. అది మా లలితకు దుస్సహమైంది. ఆ బూబల్లా వెళ్లగా చూచి ఇల్లా దిగజారింది లలిత తన చిన్నికుమారుణ్ణి. అమితగారాబమున్న కిట్టిని వాకడి పసరింపు వసర ముకుపనలేదు. 'బ్రతుకు జీవుడా' అన్నట్లు సింహం చెంగున గెంతి చెంతనున్న తోటిపిల్లలయొద్దకు తప్పటడుగులతో పరుగిడినాడు. సర్వప్రకృతితోను సహజస్నేహం నెరపు బాలురు మావాణ్ణికూడ వెంటనే తమ జట్టులో చేర్చుకున్నారు. హాయిగ ఆడుకొను ముద్దులకొడుకును చూచి మురిస్తూ "ఇక్కడే కదా" అన్నట్టుగా ముందుకు సాగింది లలిత.

3

అప్పటివరకు ఫల ప్రాణులకు చల్లదనము నిచ్చే మబ్బు క్రమక్రమంగా దట్టమౌతోంది. అంగరకా, గాను, జుబ్బా—వీనిలో నేదియుకానితన బిడ్డ వింతచొక్కాను గుర్తిడుకొని దూరమునుండికూడా చూస్తూనేవుంది లలిత. కొంతసేపైనాక "చూస్తున్నా" ననుకొన్నది. తరువాత చూడ్డం మానింది. "ఏమీభయంలే"దన్న ధైర్యంతో. ఇంతలోనే కారుమేఘాలు కమ్మి అప్పుడే సూర్యుణ్ణి మింగిన సంధ్యాదేవతను దిమ్మచీకట్ల మేలిముసుగులో కప్పాయి. హోరున గాలి. కుంభవృష్టివాన. రెండడుగుల ముందేమున్నదో చూడ్డానికి శక్యంలేని గాఢాంధకారం. మా కాకోటలు కొత్త. ఏమూలేముందో తెలియదు. మోటార్లకూతలు, సైకిలుగంటలు చప్పుళ్లు జట్కాబళ్ల చటచటలు, గుఱ్ఱపుబళ్ల కటకటలు— ఓః నానాభంగారుగానూ ఉంది. "బిడ్డ ఏమైపోయాడో భగవంతుడా!" అని లలిత దీర్ఘం మొదలెట్టింది. నాక్కూడా కడుపు చెరువైపోతోంది. కాని ఆడదానితో సమంగా ఏడ్పులు మొదలెడితే అక్కడ మా గతేంకావాలి? "ఏం, ఫరవాలేదు. వెళ్ళి చూద్దాం రా" అన్నాను. కన్నూ కన్నూ కనపడ్డ కటికచీకట్లో చెయ్యీ చెయ్యీ పట్టుకు వచ్చిన దారి వెతుక్కుంటూ వెనక్కి వెళ్లాం. ఎక్కడా ఒక్క పిట్టలేదు. కేకేస్తే పలికేవాళ్లుకూడా లేరు. భయంకరశూన్యత్వం అంతటా విజృంభించి ఉంది. నాకుకూడా దుఃఖం ఆగిందికాదు. కానేపు కాగలించుకు ఏడ్చాం. మొగాణ్ణికనక కొంచెం ధైర్యం తెచ్చుకుని "కాలయాపన లేకుండా పోలీసుకు చెప్పాలి. లే, వెళదాం" అన్నాను. ఆత్రతతో కంపించు శరీరంతో "నిజంగా! వాళ్లు వెతికిపెడతారా! వాళ్ల కడుపు చల్లగా, నాబిడ్డ నాకు మళ్లీ కళ్లకు చూపెడితే చర్మంవొలిచి చెప్పులు చేయించిస్తాను...... బుద్ధొచ్చింది బాబూ ఇంకెప్పుడూ రాను. వీరంటూ నేవున్నారు. వేంకటేశ్వరస్వామీ తండ్రీ! మా పిల్లాణ్ణి మాకు మళ్లీ ప్రసాదిస్తే వెండిబిడ్డను చేయించిస్తాను" అంటూ సగంచచ్చి నాతో నడవటం మొదలెట్టింది లలిత.

దగ్గరఉన్న ఒక్క పోలీసుస్టేషనే ఎరుగుదును నేను. అక్కడ ఓదాడి (గడ్డం) సాహేబు చాచుకుపడుకుని గురకంలో కయ్యమన్నాడు.

ఏమిటిగతి? ఆకాఊబుచీకట్లో మాయింటికే దారి గుర్తింపలేని మేమేమి చెయ్యగలం? ఏదో తప్పు చేసినవాళ్ళకుమల్లే బహుకష్టంమీద ఇంటికివచ్చాం. "సింహం ఏమైపోయాడో!!!"

లలితకు ధైర్యంచెప్పడాన్కి దుఃఖం చంపుకుని "అక్కడ పిల్లలంతా గొప్పవాళ్ల బిడ్డలావున్నారు. ఒక్కణ్ణీచూచి మనవాణ్ణికూడా ఎవరైనా వాళ్ల కార్లో తీసుకెళ్లి రేపు పోలీసులకు తెలియచేస్తారు. చీకటితోనే వెళ్లి తీసుకొస్తాను" అన్నాను. "అంత అదృష్టంపట్టాలికదా" అంది దైన్యంగా లలిత.

౪

సింహంపోసచంద్రికలతో కలకల్లాడే మా యింటియందంతటను ఇప్పుడు తోటయందలి భయంకర శూన్యత్వమే విజృంభించియున్నది. ఆరాత్రి యిద్దరము ఏల్లా గడిపామో భగవంతునకే ఎరుక. అరుణోదయముకాగానే బయలుదేరాను. పెద్ద పోలీసుస్టేషన్‌కు వెళ్లి వాకబుచేస్తే "తెల్లారకుండానే ఎవరు తెస్తారయ్యా ఒళ్లు తెలియకపారేసుకున్న నీబిడ్డని" అని కసరుకున్నాడు రాత్రి 'డ్యూటీ'లో నిద్దర పట్టనిబడలికతో ఆవలిస్తూ, వరండాలోని కొయ్యకుర్చీలో నాసీనుడై, ముఖప్రక్షాళనమునకై ప్రథమ ప్రయత్నముగ ధూమపానము చేయుచున్న 'సబ్ ఇన్స్పెక్టరు'గారు. ఎందుకో తెలియకుండా "చిత్తం చిత్తం" అని వరండాలోని చివర స్తంభాన్ని ఆనుకుని నిలుచున్నాను. కొంతసేపైనాక కూర్చున్నాను.

ఇంతట్లో బుర్రుమని కారు చప్పుడైంది; స్టేషను దగ్గరే ఆగింది. విశ్వమంతా నన్నే ఓదార్చుచున్నదనియు, అందలి ప్రతిజాతియు మా సింహాన్నే వెతుకుతున్నదనియు భావించుకుంటూ కూర్చున్న నాదృష్టి అప్రయత్నముగా కారువైపు మళ్లింది. అందుండి పల్చని చామనచాయ శరీరముగల ఒక పడిమివయస్సు ముసల్మాను దిగి తిన్నగా సబిన్స్పెక్టరు గారివద్దకు వెళ్లి ఏమేమో తురకములో చెప్పి ఒక చిన్నచీటినిచ్చి వెళ్లినాడు.

చుట్టకాల్చుచుమిమ్మట దానిని పారవైచి చెంతనున్న పోలీసువాని కొకనికి తన దండధావనపరికరములను కాబోలు తెమ్మని యుత్తరువొసగి కొంచెముకాలము అధికారశీవితో నటునిటు చూచి "నీబిడ్డ హిందువా తురకా?" అన్నాడు ఇన్స్పెక్టరు గారు. నా దుస్తులరీతినిపట్టి అట్టి ప్రశ్నకు అవకాశము లేకున్నను ఇన్స్పెక్టరుగా రట్లడుగుటకు కొంత ఆశ్చర్యపోయి "చిత్తము హిందువేనండి" అన్నాను.

"ఎన్నేండ్లు?"

"రెండేళ్లు నిండినవి."

"ఎక్కడ మరచిపోయినావు?"

"మరవలేదండి. తోటలో తప్పిపోయినాడు."

"పేరు?"

"సింహం"

"సింహం, ఏనుగా—ఒళ్లుతెలియని పన్లుచేసి మా ప్రాణాలు తీస్తారు" అని హుంకరించి, ఆ సాయిబుగారిచ్చిన చీటీకి యింగ్లీషు తర్జుమాచేసి నావైపు విసరి "ఆయన హైదరాబాదు కలెక్టరు. కనక మాకు చూపించ నక్కరలేదు. వారికి దొరికిన బిడ్డ మీవాడైతే కొనిపొమ్ము. ఇంకెప్పుడూ మమ్మల్నిల్లా విసిగించకు" అని ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాడు ఇనస్పెక్టరు. ఇంత వినుగు ప్రదర్శించిన ఈ రక్షకభటాధికారి మా సింహాన్ని వెదకడంలో పడ్డ కష్టమేమిటో తెలియక ఆశ్చర్యపోతూ, నిశ్చేష్ట ప్రతిమలా కూర్చున్న ఆ మూర్తీభవించిన అధికారమునకు ఒక సలాముకొట్టి చెంగున వీధిలోకి వెళ్లాను. 'ఎడ్రసు' చదువుకుంటే మా యింటివెనక యిల్లే! ఏమి విపరీతము! రాత్రియెల్ల మాకు పది బారల దూరములోనే ఉన్నాడా మాబిడ్డ! పట్టు వానపు పొరుగులను చూచి నిర్ఘాంతపోయి, తిరిగి క్షణములో సింహంమును జప్తికి తెచ్చుకొని కలెక్టరుగారింటికి పరుగెత్తాను. బంట్రోతు లోనికి పోయి చెప్పాడు.

కలెక్టరుగారు స్వయముగా దయచేసి, నా ముఖమునుపట్టియే నే వెళ్లిన కార్యమును గుర్తించి, చిరునవ్వుతో "పాపము, రాత్రినుంచీ ఏమీతిన లేదండి. కళ్లువాచేటట్టు ఏడ్చాడు. మా అస్రఫ్ ఇస్తే గుక్కెడు పాలుమాత్రం తాగాడు. ఇద్దరూ అగదిలో దాదివద్ద ఉన్నారు. లోనికి వెళ్లవచ్చును"

అన్నారు. అమృతోపమానములైన ఆ మాటలువిని మేరువులా ఉబ్బి గర్రున గదిలోపడ్డాను. అస్రఫ్ చూపు ఆటవస్తువులను చూస్తూ విచారకరమైన సన్నని నవ్వుతో తెల్లతెల్లపోయే సింహం కళ్లపడ్డాడు. నన్ను చూచి యింత ముఖం చేసుకుని ఎగిరి చంకెక్కాడు. ముద్దులొలుకుమాటలతో అస్రఫ్ లేచి లేతనవ్వుతో "తుమారా బాబ్" అన్నాడు. కలెక్టరుగారికి హృదయపూర్వకమైన సలాముపెట్టి ఇంటికి చక్కావెళ్లాను. అంతవరకు వీధిగుమ్మం ఎరగని లలిత గడపలో నుంచుంది నారాకకై ఎదురుచూస్తూ. సింహాన్ని చూడగానే పరుగెత్తుకొచ్చి తన సొంత సొమ్మైనట్లు లాక్కుని యింట్లోకి పరుగెత్తింది.

౫

ఆరోజు మొదలు ఒకర్నివిడిచి ఒకరుండరు అస్రఫ్ సింహములు. తెల్లవారకుండానే "దర్వాజా ఖోలో" అని లేత లొల్లుబల్లులతో, వీధితలుపు తన బుల్లిచేతులతో తట్టేవాడు అస్రఫ్. చేతిలో ఎంత పని ఉన్నా తన స్నేహితునికి తలుపు తియ్యవలసినదే మేము, సింహం అజ్ఞవల్ల. మొదట ఈస్నేహం కొంచెం బాధగానే ఉండేదినాకు. అస్రఫ్ విలువైన వినోదములను తనకుకూడ తెమ్మని మారాముపెట్టేవాడు ఆర్థిక పరిస్థితులను తెలిసికొనలేని సింహం. కాళ్ళువిరిగిన కొండపల్లి కుక్కబొమ్మ తప్ప వేరులేవు సింహానికి. కాని కొద్దిరోజులలో దీనిని అస్రఫ్ బొమ్మలలో కలిపి అన్నిటిని 'మావి' అనుకుంటూ యిద్దరూ ఆడుకునేవారు. నాబాధ తగ్గిన కొద్దీ లలిత కష్టాలు హెచ్చాయి. ఎండలో ఆడిఅడి "అమ్మా భొఖ్" అంటు సింహం తల్లిదగ్గరకు పరుగిడితే "పీనేకు పానీహోవా" అంటూ వెనకాలే స్లిప్పర్లు టకటకలాడిస్తూ వంటింట్లోకి సిద్ధమయ్యేవాడు అస్రఫ్. నిప్పుకడిగి పొయిలో వేస్తుంది మా ఆవిడ. "తురకకొంప చేసేస్తున్నావు, వెధవా" అని కొడుకుని కసురుకునేది. మతభేదములెరుగని అస్రఫ్ సింహాలు లిద్దరూ ఆమె కోరుగునకు కారణమును కానక "బాగా ఏడిపించాం" అన్నట్లు కిలకిల నవ్వుకునేవారు. మొదట్లో స్నానాలు మొదలెట్టింది మాఆవిడ. తరువాత తరువాత నేను చూస్తే చేసేది లేకుంటే లేదు. పిమ్మట అసలే ఎగేసి కొంచెం పసుపునీళ్లు చల్లుకునేది. "అదే"మంటే "తురకాళ్లతోటి తాగితే లేదుకాని" అంటుందన్న భయంతో నే నేమీ అనేవాణ్ణికాదు.

౬

శీతకాలం వచ్చింది. అంతా గొంగళ్లుదులిపారు. ప్లేగుకూడ తన వికృతరూపాన్ని సదలించుకుని విజృంభించింది. చేటలతో చెరిగేస్తోంది. నవాబుగారు ప్రశంసనీయమైన ప్రయత్నములు చేశారు ఈ పిశాచాన్ని అరికట్టుటకు. దగ్గర దగ్గరలో ప్లేగుకు ప్రత్యేక ఆసుపత్రులు స్థాపించారు. కాకిచేత కబురంపితే డాక్టర్లు వచ్చి వాలేవారు. తమ కర్తవ్యముల నేమరకుండుటకై నైజాముగారు రాత్రులు మారువేషాలులతో తనిఖీ చేసేవారు. కాని ప్లేగు పిశాచం అంతకన్న పట్టుదలతో తన కర్తవ్యం నెరవేర్చింది. కలకల్లాడే మహాపట్నం పదిరోజుల్లో పాడుపడిపోయింది. మా సింహంతండ్రినికూడా నేలపాలు చేసేసింది ప్లేగు. ఆదేమి జబ్బో కాని రెండు రోజులూ తుంచేసింది. మంచాన్నిపడ్డ రెండురోజులూ కన్ను తెరవలేదు బిడ్డ. అస్రఫ్ బెదురుతూ బెదురుతూ దగ్గరకొస్తేమాత్రం మెల్లగా పైరెప్ప సగంవిచ్చి మళ్లీ మూసేవాడు. కంటినీరు చూడలేక మాకడుపులు తరుక్కుపోయేవి.

ఏమైతేనేం. అంత బిడ్డనూ మింగేశాం. మా యిద్దరకూ చిన్నతనమే. ఇట్లాటికష్టాలు ఎప్పుడూ ఎరగం. మావాళ్లు వాళ్లవాళ్లుకూడా పుట్టిన పదిమందీ బాగున్నారు. కలోగంజో తాగుతూ కాలం గడుపుతున్నాం. ఆరోజున మంచు దట్టంగాపట్టింది. ఆకాశా కదపకుండా అప్పుడప్పుడు బరువైన మంచుబొట్లను రాలుస్తూవున్న తులసిమొక్కను చూస్తూ దొడ్లో వరండాలో కూర్చుంది లలిత. కళ్లమ్మట కారిన నీళ్లు కారుతూనేవున్నాయి. దాని ముఖం చూడలేక గదులో చాపమీదపడి పొర్లుతున్నాను. ఇద్దరం ఒక్కమాటేనా ఆడుకోలేదు; బిగ్గరగ ఏడ్వనూలేదు. ఎల్లెసల భీకరనిశ్శబ్దత. కడుపులు కుళి

పోతున్నాయి మధ్యాహ్నం తిరిగింది. ఆకలి దప్పులు మరచి అట్లే ఉన్నాం.

ఇట్లుండగ వీధిగుమ్మంలో అస్రఫ్ ఏడుపు వినబడింది. తడబడుతూ వెళ్లి తలుపుతీసింది లలిత. "హమారా మా మర్గయీ" అని భోరున యేడ్చుచు లలిత ఒళ్లో పడ్డాడు. అద్వితీయప్రేమతో అస్రఫ్‌ను ఎదకు హత్తుకొని లలితకూడ ఏడ్పు మొదలెట్టింది. నేనుకూడ దానికి లొంగిపోయాను. కాని ఈమారు ఏడ్చినతరువాత మా కెందుకో హృదయభారము చాల తగ్గినట్లైనది.

రాత్రి తొమ్మిదింటికి అస్రఫ్ దాదివచ్చి "కలెక్టరుగారి భార్యకూడ ప్లేగువచ్చి చనిపోయిన"దని చెప్పి "అస్రఫ్ వచ్చాడా? ఆగోలలో ఇతనిమాటే మరచిపోయాము" అని అడిగింది. నిద్రించుచున్నాడని చెప్పి పంపింది లలిత. నిజముగా అస్రఫ్ నిద్రించుటలేదు. "సింగ్ కహాఁ హై?" అని గుచ్చిగుచ్చి అడుగుతున్నాడు నన్ను. నేనేమియు ప్రత్యుత్తరమిచ్చుటలేదు. మర్నాడు 8½వరకు ఎవ్వరు రాలేదు. అప్పుడు అస్రఫ్‌ను ఇవ్వక తప్పినదికాదు. ఎందుకో మా సర్వస్వమును పోగొట్టుకొన్నట్లయింది మాకు.

కొంచెము ప్రొద్దెక్కిన కొద్ది ఆకలివేయ జొచ్చింది నాకు. కాని ఏమీతోచక పడుకునే వున్నాను. పరిశుభ్రంగావున్న వసారాలో తుడిచినచోటే తుడుస్తోంది లలిత. మొన్నటిదాకా సింహం చింపిన కాకితాలతో ఇంతలోతుండే వసారా యిప్పుడు భయంకర పరిశుభ్రతను తాల్చింది.

"దూద్" అని కేకవినవచ్చింది వీధిలో. బల్లమీది "పర్సు"ను చీపురుమడమతో క్రిందికి పడగొట్టి రెండణాలు కొనిపోయి పాలుకొన్నది లలిత. కొంతసేపైనాక కాసిని వెచ్చని పాలు, వారంక్రితం సింహంకోసం చేసిన మినపసున్ని కొంచెం తెచ్చి నాదగ్గర పెట్టింది.

"నువ్వో?"

"ఆకలేదు"

"అల్లాగే ఉంటుంది. కొంచెం తిను"

"తింటాలెండి" అని ముఖం అటుతిప్పి కుడిచెయ్యి వెనక్కుపెట్టి చీరకొంగుతో తుడుచుకుంటోంది. కళ్లు తుడుచుకొంటుందని నాకు తెలుసును.

"నీకళ్లసలే మంచివికావు. ఆ స్తమానం ఏడవకు మరి. ఏంచేస్తాం........." అని యింకా ఏమిటో అనబోతూఉంటే నాస్వరం గద్గదమైపోయింది.

పెళ్లి రెండుఘంటలేనా కాలేదు, పరుగెత్తుకొచ్చాడు అస్రఫ్. సయించక అక్కడే పడివున్న సున్ని కొంచెం లలితకిచ్చి "అస్రఫ్‌కు పెట్టు" అన్నాను.

దొడ్లో మందారుమొక్క దగ్గరకు ఎత్తుకు తీసుకెళ్లి తినిపిస్తోంది. మధ్య మధ్య ఎక్కువైనదాన్ని నోట్లోనుంచితీసి చేత్తో పుచ్చుకుని మళ్లీ నోట్లో పెట్టుకుంటున్నాడు అస్రఫ్.

౭

పదిరోజులు గడిచాయి. క్రమక్రమంగా జీవిత విధులన్నీ కొనసాగుతున్నాయి మాయింట. అస్రఫ్‌ను చూచుకుంటూ కడుపుదుఃఖం క్రమక్రమంగా జయిస్తున్నాము. ఇట్లాఉండగా నెల తిరక్కుండా కలెక్టరుగారు మళ్లీ పెళ్లి చేసుకుంటారనీ, ఆ యిల్లు విడిచి ఎక్కడికో వెళ్లిపోతారనీ చెప్పింది అస్రఫ్ దాది. గుండె గుభేలుమన్నది మాకు. "అస్రఫ్‌ను కూడా దూరానిక్కొంచుకుపోతారు కాబోలు దిక్కుమాలినదేవు" డనిపించింది లలితకూ నాకూకూడా. ఆరోజు మళ్లీ కళ్లమ్మట నీళ్లొచ్చాయి యిద్దరికీ. అంతా మరిచిపోవాలని వరుసచెడని పుస్తకములనే మరల మరల సర్దుతున్నాను.

కొంతసేపైనాక దాహము కాకున్నా "కొంచెం మంచినీళ్లియ్యి" అని వంటింటి గుమ్మంలోకి వెళ్లాను. చారుఅన్నం గుజ్జులాకలిపి అస్రఫ్‌కు తినిపిస్తోంది. అస్రఫ్ కొంచెంతింటూ కొంచెం లలితమీద కొంచెం క్రిందపడేటట్టు ఉమ్ముచేస్తున్నాడు. నిర్ఘాంతపోయాను. "కురకకొంప చేసేస్తున్నావు" అని సింహాన్ని మందలించే లలిత కురకపైపోయింది! "లలిత! పిచ్చెక్కిందేమిటి?" అన్నాను రెండడుగులు ముందుకువేసి. అస్రఫ్‌ను లాక్కుంటానని కాబోలు

బెదరుచూపులతో దగ్గరగా తీసుకుని "నిన్ను పెంచుకుంటాం" అంది చిరునవ్వుతో అస్రఫ్‌ను చూస్తూ లలిత. నాకేమీ చూణ్ణేనాలేదు. అప్పటి లలిత ముఖం చూడాలి కాని చెప్పలేను. మాతృప్రేమ మూర్తీభవించి ఉంది. విశాల చంచలనేత్రముల నుండి ఉజ్జ్వల దివ్యప్రణయ ముట్టిపడుతున్నది. అది పరిసరములనంతను ముంచివైచింది. సింహం చనిపోయినప్పటినుంచీ శాంతినెరుగని నా హృదయం ఒక్కమారు చల్లబడింది.

ఏమీమాట్లాడకుండా వెనక్కి తిరాను. ఆనాడు రాత్రి పక్కదులుపుతూ "ఆసాయీబు మళ్లీ పెళ్లాడ్తాట్ట" అన్నది లలిత. ఇదివరకే తెలిసిన ఈ మాటకు జవాబుచెప్పలేదు నేను. కొంచెం దూరం నుండి కొంచెము దగ్గరగావచ్చి "అస్రఫ్‌ను మన కివ్వమని అడగండి రేపు" అన్నది. లలితవైపు చూచాను. అప్పటి లలిత ముఖం చూచినవాళ్లెవరూ ఆమె కోరినదాన్ని నిరాకరించలేరు. కాని నేను మాత్రం పైకి "మనవాళ్లు చూస్తే యింకేమన్నా ఉందా? కొంప తవ్వుతున్నావు" అన్నాను. "సింహాన్ని మనవాళ్లెవరూ చూళ్లేదుకా" అంది. ఓహో! భగవాన్! మాతృప్రేమ కెట్టి ధైర్యగాంభీర్యములను సమకూర్చినావు! ఎట్టి సమయస్ఫూర్తి నొసగినావు! ఎట్టి యకుంఠితశక్తుల నిచ్చినావు! ఇన్నియునిచ్చి మాసింహము నేలలాగికొంటివి?!

నేనేమియు చెప్పలేదు.

తెల్లవారకమునుపే లేపింది లలిత.

"వాళ్ళసామానంతా వెళ్లిపోతోంది. బళ్ళొచ్చాయి." అని అత్యంతాతృతలో ఎన్నడూ నా నిద్రను భంగపరుపని లలిత కొట్టిలేపింది. నేను లేచి దంతధావనం చెయ్యకుండానే ముఖం పన్నీటితో తుడుచుకుని, తురక అధికార్ల యనుగ్రహమును సంపాదింపవలెనని నాల్గునెలల క్రితముకొని ధరించుటకింకను నిగ్గుపోకుండుటచే నుపయోగములోలేని టర్కీటోపీ దులిపి కుచ్చుసవరించుకుని కలెక్టరుగారింటికి వెళ్లాను. కాని ఏమిటి చెప్పడం? మీబిడ్డను మాకిమ్మంటే ఏతండ్రి యిస్తాడు? ఇంతలో అస్రఫ్ ఎక్కడనుంచో పరుగునవచ్చి నా చంకెక్కాడు. అతన్ని ముద్దాడుతూ "అస్రఫ్‌ను మాకియ్యండి. పెంచుకుంటాం" అన్నాను. తన విశాలభవనములో నిండియున్న సామానంతకును క్రొత్తయింట ఉచిత స్థలములను నియమించి, అస్రఫ్‌నుమాత్ర మెక్కడ నుంచవలెనో తెలియని కలెక్టరుగారు ప్రయత్నముతో నవ్వే ఆశతో పెదవులు విచ్చి "మీరు హిందువులుకారా?" అన్నారు.

విభూతితో నిండిన బడుగుదేహముతో, మోకాళ్ళవరకు వ్రేలాడు జడలతో కాశీకొబ్బరిచిప్పను రెండు చేతులతోను పట్టుకొని ఒకబైరాగి ఎదురుగనున్న యింటివాకిట బిచ్చమునకై వేచియున్నాడు. నీటితో నిండిన తోటతిత్తులభారమున క్రుంగుచు ఆ యింటిలోనికే పోవు 'బిస్తీ' మహమ్మదీయులకు నీరు పోయువాడు "యేమకాన్ మె ముసల్మాన్ హై" అన్నాడు. "హిందూ నై - ముసల్మాన్ నై ఏక్ హీ ఆదమి హై" అన్నాడు బైరాగి.

కలెక్టరుగారూ నేను ఈ కడమాట వచ్చిన దిక్కునకు దృష్టులను మరల్చితిమి. మరల ఒకరి మొగము నొకరము చూచుకొంటిమి.

"నిజమేనండీ?"

"చిత్తము."

"మీ భార్య నడిగితిరా?"

"ఆమే పంపినది."

"మీకు జీతమెంత?" అన్నాడు కొంచె మాశ్చర్యముతో.

"ఇప్పుడు 35 రూపాయలు. వచ్చే ఫసలీలో 10 ఎక్కువౌతుంది."

"మీరేమి చదువుకున్నారు?"

"బి.ఎ. ప్యాసుఅయినాను." బొమలు పైకివిరిచి "సరే తీసుకెళ్ళండి. అప్పుడప్పుడు మాకు చూపండి." అన్నాడు. మహాభాగ్యమబ్బినట్లు సంతసించి ఒక్క పరుగునపోయి లలితకీశుభవార్త చెప్పాను. ఆనాడు సింహాన్ని లాక్కున్నట్లే ఈనాడు అస్రఫ్‌ను లాక్కుంది లలిత.

మరునాడు టపాలో నూటపాతిక రూపాయల జీతపు పనికి కలెక్టరాఫీసునుండి ఉత్తరవు వచ్చింది నాకు. కలెక్టరాఫీసుకు దగ్గరగా యిల్లు మార్చాము. అక్కడకు వెళ్లినప్పటినుంచి అస్రఫ్‌కు సింహం అని పేరెట్టింది లలిత.

# ముద్రికా!

దేవేంద్ర రాధాకృష్ణ కవులు, భాషాకుటీరము

[అశోకవృక్షముక్రింద ననంతదుఃఖాక్రాంతయగు సీత—అనుకూలంబగు వేళ గుర్తించినాఁడు పవనతనయుండు అంగుళీయక మొసంగినాడు సీతకు—సీతమనస్సు ఝల్లుమన్నది; భావములపై భావము లుదయించినవి—ఒక్కమాఱుగ వెలిబుచ్చింది, ఆత్మగతంబగు భావపరంపరను]

సేమమె రామభూపతికిఁ జెప్పవదేటికి, లక్ష్మణుండు న
న్నేమనినాఁడొ యేమొ, యెటులెంచెనొ నాపరుసంపుపల్కు,లా
హా! మృగమేగతిన్నలిపె? నయ్యయొ, దానినిఁబట్టనేగి శ్రీ
రాముఁడు ఘోరపాతకపిరాముఁడు గాసిలెనేమొ చెప్పుమా.

అతఁడు మృగంబు వెంటను వనాంతరసీమల నేగియేగి యే
గతిఁ గడతేర్చెదాని; నదికాంచుము వారెనె, నాతఁడేమనె
"నతివిడనాడివచ్చి తనుజా" యని లక్ష్మణు బల్కినాఁడె? సం
గతులను జెప్పవేమిటికి గాదగుకార్యములేమి ముద్రికా!

బహుసువిధేయమూర్తి, హితబంధుఁడు, లక్ష్మణసద్గుణాఢ్యుఁడా
విహితమహోపకారి వినిపించిన పల్కులఁద్రోసి పుచ్చి లో
న హృదయనాథునిన్ బొసఁగనాయెను కీడనియెంచి యాతనిన్
యహామిక దోసపుం బలుకు లంటిని గొన్నిటినప్పు డూర్మికా.

నను రమసంబు బాయక యనారతము న్గతుఁబ్రేమఁజూచి న
మ్మనమున; సంతసంబున నమానుషలీలలఁ దన్పుచుండు నా
ఘనుఁడు రఘూత్తముండిపుడు గ నల శీతలవాయువీచికా
జనిత మహోగ్రతాప మెటుసైచుచునుండెనొ దెల్పుమూర్మికా!

ఆననసీమ నవ్వులొలుకపైఁ గనుపట్టఁగ నున్న నంత భా
గానను బ్రేమఁ కేల్చకొని కైత రచించెడిలాగు బల్కులెం
తేనియు విన్పుచున్మిగులఁ దేకువముంగురులంటి దిద్దునా
యానవమోహనాంగుని సుహృత్తపు ప్రేలికి—నీదునిల్వకున్
కొనొకొ సేమము తెలియనాగద నీనుతులందు నూర్మికా!

అంతగ రామభూపతి వనాంతరసీమలఁ దిర్గితిర్గి "నా
యింతిని గాంచగాగలనె యింకెటులేనియు" నంచు నెంచి బ
ల్వంతల గుందుటల్గనుట; వార్నిధిదాటి శ్రమంబుఁజూడకీ
ప్రాంతమున న్ననున్వెదుకవచ్చితె తెల్పవదేమిముద్రికా!

భర్తను బాసియీవిధిని బాడగులంకను గుందుచుంట నా
యార్తిని బోనడంపఁదగు నట్టిని;— మోదము గూర్పఁ జాలునే
వార్తలఁ దెచ్చినావొ; గన వచ్చితొ యూరకరిక్తహస్తవై
బూర్తిగ దెల్పు మీయెడఁ బున్నెము గల్గును నీకునూర్మికా!

పతి యదు దేనాడొ! గలప్రాంతములెల్లను జూచిరాగ నా
పతి నొసగంగ లక్ష్మణుఁడు నా విషయంబునునాలకించి స
మ్మతి నిటకేగుదెంచెనె? యమానుష కృత్యములన్నొనర్చు వీ
డతివను మూర్ఖతం గొనెనటంచు నెఱింగిరె తెల్పు మూర్మికా!

ఉగ్రధనుర్విభేదనము నొప్పినపట్టునఁ జూడనాదు పా
ణిగ్రహణోత్సవంబునన నీ చెలిమందిరితొల్లి నేను; నే
డుగ్ర నిశాచరాధముల యొద్ద నఖండవిషాద మొంది య
త్యుగ్ర విపద్దశన్బొదలు చుండెడువేళను నీవులోన న
వ్యగ్రమతిందలంచి నను నాదరణాన్మనుపంగ వచ్చితో.

నీదు ఋణమ్ము దీర్పగలనే యికనెన్నియుగాలకేని; యూ
హా! ధవక్షేమవార్తల సహాయతఁ బ్రాణమునిల్పినావు; య
త్యాదరబుద్ధి నాకొఱకహర్నిశలు న్బహుయోజనంబు లు
త్పాదితప్రేమభావమును బాయక దర్గినదానవీవు; గై
కోఁదగు నీకునీయెడలఁ గూర్చెద మత్ప్రతివందనంబులన్.



## చీకటి

మాదిరెడ్డి సూర్యనారాయణరావుగారు

సీ. గగనాంగనామణి కన్నుదోయికి నద్దు నాడెంపు కాలాంజనంబనంగ;
సతతేవహులాచెప్ప చౌర్యంబు చేసెడి తస్కరాలికి శుభదైవమనఁగ;
శీఘ్రుంబె నీడముల్ జేరఁ గోరుచునుండు శకునగణాళికి శత్రువనఁగ;
అభిసారికాగృహాభ్యంతర సంచర జ్జారులకున్ మిత్రసదృశమనఁగ;

కాలకంఠ నీలకాలమై కాళికా
నీలతనువుభాతి నెగడునిరులు
పదిదిశలను వేఁగ బ్రాకిపోయెనుఁగను
ప్రాణికోటినింద పరువుచుండ.

# దేవుడు

శ్రీమతి వెంకాయమ్మగారు

కళకు తెలివివచ్చిన నాటినుండియు 'భర్త దేవుడు' అను శబ్దముల ఝుంకారము వీనుల విందగుచుండెను. తన సోదరీమణుల వివాహ మగునపుడుగూడ ఆమెతల్లి యీపాఠమునే బోధించెను. తన సఖీమణులు అత్తవారిండ్ల కేగునపుడుగూడ ఆమె యీపవిత్రవాక్యలనే వినియుండెను. 'భర్తదేవుడు' అని యామె భావింపసాగెను. ఇదియొక మహామంత్రమైయుండెను. వివాహ సూత్రముతో బంధింపబడు ప్రతిబాలికకు ఈ మంత్రముయొక్క దీక్ష తీసుకొనుటయు జీవితపర్యంతము దానిని జపించుటయు నవసరమైయుండెను. ఈ విధమైనవాతావరణలో పెరుగు అన్యబాలికలు ఈమంత్రమును వినినను, మరల మరచుచుండిరి. మరికొందరు దానినివిని నవ్వుచుండిరి. వారి మనసులలో దీనియందు ఉపేక్షగాని అసహ్యతగాని కలిగినందునగాదు. మరెందువలన? దీనినిఅనగా నీమంత్రమును ఒకవిధమైన యాచారమని భావించినందున ఈగీచినగీత దాటకుంటయే ప్రతిస్త్రీయొక్క జీవితపుకర్తవ్యమని వారు భావించుచుండిరి. కొందరికు ఈమంత్రమందలి భావమును గ్రహించుట, యొక యబోధబ్రాహ్మణునకు భగవద్గీతయందలి శ్లోకముల గ్రహించుటెంత కష్టమో యంత కష్టమైయుండెను. కాని, గ్రహింపజాలకగూడ ఆబ్రాహ్మణుడు నిత్యము దాని జపము జేయుచుండును - అట్లుచేయుటకో వానియుద్దేశము ఇచ్చుట అవశ్యకమనియు తదుపరిలోకసౌఖ్యములబ్బుననియు ఇదేవిధమున నాబాలికలుగూడా ఇహపరలోకములకై ఆ మూలమంత్రమును జపించుచుండిరి.

కళ యీ బాలికలకంటె కొద్ది భిన్నమైనది. ఆమె యిట్టి ప్రశ్నలపై లోలోన తర్కించుచుండును. ఆమె దేవతల విషయమై వినియుండెను. కొందరిపేరులమాత్రమే యెఱిగియుండినను హిందువులకు ముప్పదిమూడుకోట్లదేవతలు గలరని ఆమెకు తెలియును. ఆమె వినియున్నవారినిగురించి విపులముగా వినియుండెను. ఆమె తనసోదరీమణులయొక్కయు సఖీమణులయొక్కయు భర్తలగూడ చూచియుండెను. ఈభర్తలయొక్కయు ఆ దేవతలయొక్కయు సమానత్వమేమియా యని యామె పలుసారులువిచారించెను. దేవతలు ఏదియైన యశమైన కార్యములు సాహసకృత్యములను జేసియుండిరి; కాని యీ భర్తలలో అట్టి కార్యముల జేసినవారు అత్యల్పము. దేవతలపూజ అందరును జేయవచ్చును గాని భర్తల పూజజేయుట మాత్రము వారి భార్యలకు మాత్రమే కర్తవ్యమనుకొనిరి. వివాహమైనంత మాత్రమున ప్రతిపురుషునకును తన భార్యకు దేవుడగు నధికారము గలదు. అట్టిచో వివాహమైనతరువాత తన భర్తకు తాను దేవియగు నధికారమెట్లు గలుగదు? దేవతలభార్యలు దేవులని యనిపించుకొనుచుండును? ఈ నర దేవతల భార్యలు ఆపదవినుండి వంచింపబడు

ఉండునా? ఇదంతయు నగోచరముగానున్నది. లింగభేదమే వీటన్నిటికినిగారణమా? పురుషులు మాత్రమే యీపదవిని గ్రహింప నర్హులుగాని స్త్రీలుగారా?

నిత్యము నిట్టి తలంపులు కళయొక్క మానసము నాక్రమించుచుండెను. ఆమె వాటిని తర్కించుకొనుచుండును. కాని, సంతోష జనితమగు ఏనిర్ణయముపైకి రాజాలకుండెను. ఒకదినమామె తన తల్లితో నీ విషయములపై వాదములుజేయ సాహసించెను.

"అమ్మా!" ఆమె యనుమానించుచూ పిలచెను. తల్లి యామెవైపు జూచెను. ఆమె కన్నులు కళయేమి యడుగునోయని అకన్నుల బ్రశ్నించుచుండెను.

"భర్త దేవుడుగదా?"

"అవును"

"అందరి భర్తలును?"

"అందరి."

"వారెట్లున్ననుసరే?"

"వారెట్లున్ననుసరే. ఎవరు సూత్రధారణ జేసిరో వారెట్లున్నను సరే స్త్రీకి సదాదైవమే."

"స్త్రీ వారి దేవిగాదా?"

"భలే, యిదియెట్లగును? స్త్రీ తనభర్తయొక్క చరణదాసీ గాగలదు."

"భర్త కింతయున్నతపదవియు భార్యకింత నీచపదవియునా?"

"ఇది ధర్మశాస్త్రముల యాజ్ఞ"

"ఇది మార్పుజెందజాలదా?"

"ఎట్లు మాట్లాడుచున్నావు? ధర్మగ్రంథముల విషయములుగూడ మార్పుజెందునా? మార్పుజెందునది ధర్మమెట్లగును? పూర్వపు పెద్దలనాటినుండివచ్చు మర్యాదను సదా పాలింపవలసినదే. జాగ్రత్త, యిట్టి మాటల నెన్నటికిని పెదవిపైకి రానివ్వకుము. శాస్త్ర విరుద్ధముగా మాటలాడువానికి నరకమందును స్థానములేదు."

కళ మౌనముదాల్చెను. "భర్తదేవుడు" ఇది ధర్మశాస్త్రముయొక్కయాజ్ఞ. ధర్మశాస్త్రపువాక్కు అవినాశము. దానినెవ్వరు మార్చజాలరు. ఆమె మరెప్పుడు ఈవిధమైన జిజ్ఞాసజేయలేదు. ఆయాచారమును తానికపాలింపవలసియున్నదని నిర్ణయించుకొనెను.

## ౨

కళయొక్క వివాహదినము సమీపించెను. తనకై యేదేవుడు సృజింపబడుచుండెనో యాదేవుని విషయమై యామెకేమియు తెలియదు. ప్రజలు తాము పూజించు దేవతల విషయమై ప్రథమమున కొంచెమో గొప్పయో తెలిసికొనియుందురు. ఒకడు వాని గుణములపై ముగ్ధుడై యాదేవుని పూజించును. మరొకడు దానివలనగలుగు నుపకారముపై యాశగలిగి యాదేవుని భక్తుడగును. కాని కళకు తనదేవుని గుణముల గూర్చిగాని వానివలన గలుగబోవు నుపకారములగురించిగాని తెలియదు. తనతల్లి యామె హృదయమందు నొకయజ్ఞాత అదృశ్య దేవునియెడల యంధభక్తిభావమును పెంపొంద జేయుచుండెను. ప్రతివివాహితయువతికి నిచ్చు మూలమంత్రము

యొక్క జపోపదేశమునే యామెకూడ కూతునకు తెలియజేయుచుండెను. "భర్త దేవుడు." "భర్త దేవుడు" అను శబ్దము కళ యొక్క కర్ణములయందు ప్రతిధ్వనించుచుండెను. ఆమె తన బంధుబాంధవులకు వేరై తన దేవుని వెంట వెళ్లినప్పుడు నయితేము ఆమె తల్లి తన చెవులలో మరల నా మంత్రమునే యూదెను.

"బిడ్డా, 'భర్త దేవుడు' ఈమాటనెప్పుడును మరువకు."

"ఆయనఎట్లున్నను సరే?"

"ఎట్లున్నను సరే."

"దురాచారియైనను సరే, త్రాగుబోతైనను సరే, వ్యభిచారియైనను సరే?"

"దేవునిదోషములు జూచుటకు భక్తుని కధికారము లేదు."

"ఆయనయొక్క పూజజేయుటయే ఆమె యొక్క ధర్మమా?

"అవును. ఆమెసర్వస్వమును ఆయనకు ధారబోయునుగాని యేవస్తుప్రాప్తికొరకును ప్రత్యాశమాత్రము గలిగియుండజాలదు. ఆమె వద్ద నున్న దంతయు తన దేవునిపూజ నిమిత్తమే."

"దేవుని కేవస్తువ యావశ్యకమో దానినే యర్పించుటావశ్యకమా?"

"దానినే."

స్త్రీరూపేణ యామెకేది ధర్మమో యా యుపదేశము దొరికినది. ఆమె దానిని గట్టిగా ముడివైచికొనినది. ఏదైనా వాదవివాదమునకుగాని తర్కించుటకుగాని యామె కధికారము లేదు. అచ్చట అంధశ్రద్ధమూలముననే పనిగాగలదు. ఏజీవితము స్వీకీయము జేసికొన బోవుచున్నదో యచ్చట తర్కమునకుగాని, యవిశ్వాసమునకుగాని స్థానము లేదు. వీటివల్లనైతే యాజీవితమే నష్టమగు భయముగలదు. తనతల్లి జూపిన మార్గముపై కన్నులు మూసికొనిపోవుటయే యామె కర్తవ్యము. తన సర్వస్వమును, తన యాత్మను, తన శరీరమును, వీటన్నిటి కంటె మరేమైననున్నచో దానినిగూడా ఆదేవుని యిచ్ఛానుసారము నిశ్శబ్దముగ నర్పించుటయే యామె ధర్మము. ఆమె యా కర్తవ్యమును నెరవేర్చుటకును, ఆ ధర్మమును పాలించుటకును ప్రతినబూనెను.

3

కళ యత్తవారింటికి వచ్చినది. ఆమె భర్త మధ్యవయస్కుడు. ధనవంతుడు. ఇట్టి వివాహములలో నడివయస్సు, ధనము ఈ రెంటికిని గాఢసంబంధముండును. వయస్సెంత యాధిక్యమైయుండునో ధనముకూడ అంత యాధిక్యమైయుండవలెను. వధువు, వధువుయొక్క తండ్రి, వరునియింటియందలి ధనరాసిని చూడగనే వరుని వయస్సుయొక్క లెక్కను మరచెదరు. అరువదివత్సరముల వయస్సు, వారిదృష్టిలో ముప్పదియై యుండును. యదార్థములో వధువును మనుష్యున కిచ్చి వివాహము చేయుటలేదు! ధనమున కిచ్చి చేయుచున్నారు. ఇట్టివివాహమే కళది గూడాను. ఆమెభర్తయొక్క వయస్సు వృద్ధుడనదగునంత కానప్పటికిని కళయొక్క తండ్రి,

వరుని ధనమును జూచియేయామె నాయన కిచ్చెను.

ఇట్లున్నప్పటికిని కళ, తనతల్లి జెప్పిన మంత్రము ననుసరించియే తనజీవితమును గడుప జూచుచుండెను. తనభర్తను వాస్తవముగా దేవుడనుకొని పూజింప గోరుచుండెను.

వివాహమై కళ యత్తవారింటికివచ్చి చాలా రోజులైనది. నేటివరకు తనపతినుండి యొక స్నేహదృష్టినైనను, లేక యొక ప్రేమశబ్దమైనను ఆమెకు లభింపలేదు. ఆరోజు సంధ్యాసమయమున నామెవంటజేసెను. ఆ వంట చాలా ప్రేమతోను అవధానముతోను జేయబడెను. వంటసిద్ధముజేసి కళ పతికొరకై యెదురుచూచుచుండెను. సమయము గడచుచుండెనుగాని పతిదేవుడు రాడాయె. ఆయనరాకలో నింత యాలస్యమైనదిదే ప్రథమదివసము. పరిపరివిధములనాలోచించుచూ కళవంటయింటనే పీటపై గూర్చుండెను. ఎనిమిదిగంటలు, తొమ్మిది, చివరకు పది! ఆమెయట్లే కూర్చుండెను. ఇంతదనుక రానికారణమేమైయుండవచ్చును? ఒకొక్కతూరి వ్యాకులయగును: మరొకతూరి తానే సమాధానము జెప్పుకొనును. పదకొండు గంటలు. ద్వారము శబ్దమాయెను. ఆమె పరుగెత్తివెళ్లి ద్వారము తెరచెను.

ఆమెచూచిన దృశ్యమువలన కింకర్తవ్యవిమూఢమన్నట్టులయ్యెను. ఆమెకు తనపతిదేవుని ఈ దశలో చూచు ఆశలేదు. ఆయన కాళ్లుఈడ్చుచు లేచుచు పడుచూ వచ్చుచుండెను. నేత్రములు ప్రజ్వలిత అగ్నికణములయ్యెను. చెప్పగోరునది స్పష్టముగా చెప్పజాలకుండెను. తనవిషయమైగాని యితరులవిషయమైగాని తెలివిలేకుండెను. బాగా త్రాగియుండెను.

కళయొక్క ప్రాణము లెగిరిపోయెను. ద్వారము బంధించి పతిదేవు నింటిలోనికి దెచ్చెను. మంచముపై పరుండజేసి శీతలజలము ముఖముపై జల్లి గాలివిసరసాగెను. ఆదేవుడు మండిపడెను.

“ఏమియు చేయకుము, ఇటనుండి లేచిపొమ్ము.” ఆయన పెద్దగా కర్కశస్వరముతో జెప్పెను.

“తమమనస్సెట్టులున్నది?” కళ యడిగెను.

“నీవు నన్నిచటనే వదలివెళ్లుమని చెప్పుచున్నాను.”

“తమమనస్సు స్థిమితమైన పిమ్మటనే బోయెద.”

“నామనసు శాంతించుట నే గోరుటలేదు. నేను నిద్రించెద.”

“ప్రక్క బరచెదనా?”

“వద్దు”

“అయితే కొంచెముభుజించి నిద్రించుడు భోజనము సిద్ధమైయున్నది.”

“భోజనము పొయిలో బారవైచి పైన నీవుగూడ బడుము.”

ఇట్లుజెప్పి యాదేవుడు మంచముపై పవ్వళించెను. కళగూడ భుజింపలేదు. చాలసేపటి వరకు కళయశ్రువుల రాల్చుచు ఈదుర్ఘటనను గురించి చింతిల్లుచూ గూరుచుండెను. ఆమె దేవుడని భావించి పూజింపగోరు వ్యక్తి

యే యీవ్యాసక్తి. ఆమెకు తనదేవుని పైనను తనపైనను అసహ్యము గలుగసాగెను. కాని యామెకు మరల అమంత్రమే—"దేవుని దోషములు జూచుటకు భక్తుని కధికారము లేదు"—జ్ఞాపకమువచ్చెను. ఆమెతన వివశత్వముపై నొకదీర్ఘ నిశ్వాసమును విడచి యొక ప్రక్కకొరగెను.

౪

ప్రాతఃకాలమయ్యెను. దేవునినిషా దిగిపోయెను. కళభోజనము సిద్ధముజేసి దేవుని ముందుంచెను. కొంతదనుక నుభయులు నిశ్చేష్టులై యుండిరి. తదుపరి కళ సాహససంచయముజేసుకుని రాత్రివిషయమును హెచ్చరించెను.

"తాము మద్యము గ్రోలెదరని యింతకు ముందు నాకు తెలియదు."

"ఇదివరలో తెలియకపోవచ్చునుగాని యిపుడు తెలిసినదిగదా?"

"అవును, కాని........."

"కాని?"

"కాని, యిదిమంచిదిగాదు త్రాగుడు మానివేయుండీ."

"మానవలెనా? ఎందువలన?"

"ఏలనన, యీవ్యసనము మంచిదిగాదు. నే రాసంతవరకు మీరాయిచ్చ వచ్చినటుల జేయుచుండిరి. కానియిపుడు........"

"ఇపుడేమైనా మార్పుగలిగెనా?"

"ఎందుకుగాదు? తమ జీవితముతో నిపుడు నాజీవితముగూడ బంధింపబడి యున్నది."

"నీజీవితము బంధింపబడినది యింటి లోపలి నిమిత్తమేగాని యింటిబయటి నిమిత్తముగాదు. ఇంటిబయట నేనే సమస్తమునై యున్నాను. ఇష్టమొచ్చినది జేయగలను. నిను వివాహమాడినది నా పనులలో సలహాజెప్పెదవని గాదు. ఇంటి కావలిగాచి యింటిని చక్కబెట్టెదవని. నీవు కోరునదంతయు నింటనున్నది. ఇచ్ఛవచ్చినది తినుము. ఇష్టమున్నది త్రావుము. కోరినది ధరించుము. కాని యిదంతయు నింటియందలివరకే. ఇంటిబయటిచింత నీకు వలదు. నామాట నీకేదైనా యిష్టము లేనిచో కన్నులు మూసికొనుము, నోరెత్త వద్దు."

"నోరెత్తవద్దా? సమస్త విషయముల జూచుచుగూడ గ్రుడ్డినై యుండవలెనా? ఎటులైనను తమ పత్నినే గదా!"

"నీవు నా భార్యవనునది సరియేగాని నే నెవరినో తెలియునా?"

"పతి".

"పతి ఎవరు?"

"దేవుడు".

"దేవునికంటె భగవంతుడు గొప్ప. దేవునికేమి యధికారముగలదో తెలియునా?"

"పూజ".

"మంచిది, యిదియే కర్తవ్యము. నిశ్శబ్దముగా నావిషయమై కొంచెమైన విచారించక పూజచేయుము."

కళ నిశ్చేష్టయయ్యెను. ఏమి చేయగలదు! ఏ మూలమంత్రోపదేశము ఆమెకిదివరలో లభించెనో దానికది పునరావృత్తి.

విషయ మభివృద్ధి జెందుచునేయుండును. కళయొక్క తండ్రి యేధనముకొరకు కళను ఆదేవుని కర్పించెనో యాధనము ఇపుడు లేదు. కళ తన యావజ్జీవితమును ఏదేవుని కొరకై దేవాలయమును నిర్మించెనో యది గూడా ఖాళీయయ్యెను. కళయొక్క దేవుడు మరొకరిపూజ నధికముగా ప్రేమించుచుండెను. కళకు తనకు నేమియు సంబంధము లేనటు లాయన యచ్చటకే వెళ్లి విరాజమానుడయ్యెను. ఆయనకు కళయొక్క పూజ యిష్టములేదు. కాని కళకు మాత్ర మాయన దర్శనమొసగినా జాలు. కళ కందునిమిత్తమెగూడ తిరుగవలసివచ్చెను. ఆమె భర్త ఆమె దేవుడు! ఆయన సంతుష్టి కొరకై యామె యేమైనను జేయవలయునను యుపదేశము పొందియుండెను. ఆయన పూజయే, యాయనసేవయే చేయుట తన యొక్క ధర్మమని యామె గుర్తించెను. ఆ ధర్మము అవినాశమైనది, అఖండమైనది. అపరివర్తనీయమైనది. కళ యాధర్మమునకు బద్ధురాలై యుండెను. ఇందువలన ఆ రాక్షస కృత్యములుజేయు నాదేవునకుగూడ బద్ధురాలై యుండెను.

ఒకదిన మామెకు దైవదర్శనసౌభాగ్య మబ్బెను. ఆదినము కళ తన హృదయమంతయు విప్పివాని ముందుపెట్టెను.

"మీరు నన్ను ఈవిధముగా త్యజించుటకు నేనేమి యపరాధముజేసితిని. తమను దైవముగా దలంచి సహృదయముతో, విశుద్ధసంకల్పముతో పూజింపలేదా?"

"పూజింతివి—గాని?"

"కాని"

"నాహృదయ మాపూజచే సంతృప్తి నొందదు."

"నాపూజచే సంతృప్తినొందరా? ఒక సద్వంశీయురాలైన తమ ధర్మపత్నియొక్క యదార్థపూజవలన సంతృప్తికలుగదా?"—దేవుడు మాటలాడలేదు.

"ఏమి!!యా వారాంగనయొక్క పూజచే సంతుష్టికలుగునా? ఆనందముగలుగునా?" అని మరలయనెను.

"కళా, యది హృదయముయొక్క భేదము."

"ఆ వారాంగనయొక్క పూజలో నేమి విశేషముగలదు?"

"హృదయమును తనవైపున కాకర్షించు విశేషముగలదు."

"అది బహుశః కులలలనగానందున నట్లుండవచ్చును. ఏలయన, నామె యొక వస్తువును, రూపమును, యౌవనమును, సతీత్వమును బేరమువలె నమ్మివేయును."

"పూజగూడ నొకబేరము. పూజయందు గూడ దేవునికి వాంఛితపదార్థము లావశ్యకములు. ఆపదార్థము అధికముగా దొరకు స్థలమునందలి పూజనే యాయన ప్రేమతో స్వీకరించును."

"పూజగూడ నొకబేరము" ఈమాటను తన దేవుడు లేచి వెళ్లినమీదట కళ యాలోచింపసాగె. యదార్థహృదయముతో జేయు పూజ కేమియు విలువలేదు. బాహ్యాడంబర పదార్థములనే యందరు ప్రేమింతురు.

"మంచిది దేవా! నీకిష్టమైన పదార్థములనే సమర్పించెద. ధర్మవాక్కునే వల్లించెద. శాస్త్రముల యాజ్ఞను సమ్మతించెద. ఆ ప్రాంతముదనుక దేవుని ప్రసన్నునిజేయు నుపాయ మాలోచించెద. ధర్మము! దేవుడు! పూజ! బేరము!"

ఇట్టి సమయమున నామె ముఖముపై హాసమును నేత్రములలో నశ్రువులును గలవు.

దేవునియందు వరముల నొసగుశక్తి యున్నంతవరకు పూజారిన తన మనోధనములతో పూజజేసెను. కానియెప్పుడు ధనమను వరమొసగు శక్తిక్షీణించెనో యప్పుడు వారాంగన దేవుని దేవాలయమునుండి పారద్రోలెను.

తిరుగుచూతిరుగుచూ దేవుడు రెండవ ద్వారమునదట్టెను.

ద్వారము విడిపోయెను. తలవాల్చి దేవుడు కుర్చీపై నాసీనుడాయెను.

"మద్యము"!— ఒకచిన్న గిన్నెనుముందుంచి యొకయువతియనెను.

దేవుని నిద్రభంగమయ్యెను. కన్నులపై కెత్తిజూచెను. ఇదేమి? మరలకన్నులు పైకెత్తిచూచెను.

"కళా!"

"అవునునేను నూత్నపూజారిరూపములోనున్నకళను"

"నేనేమిచూచుచున్నాను?"

"ఏమి తమకీరూపమునచ్చలేదా? తమకీరూపమునచ్చునని సెలవిచ్చియుంటిరి గదా!"

"ఓభగవంతుడా! నీవిక్కడ......... ఒక్క.........."

"..........వేశ్య!"

"కాదుకళా, నీవునాభార్యవు. నాభార్య వేశ్యయా?"

"ఏమియిప్పుడైనదేమి? యితరవేశ్యలుగూడ నొకరిభార్యలేగదా! మీకుగావలసినది పూజారూపముగదా! మీకుగావలసినవి. రూపము, కువాసనలు, కులటతనము, బాహ్యహావభావములుగదా! అవిమీకిపుడు దొరకుచున్నయవి. నేటివరకు అన్యవారాంగన ప్రసాదింపుచూవచ్చెను. నేడుమీధర్మపత్నియే వాటినిఒసంగుచున్నయది."

ఆమెసమీపించెను. దేవుడు రెండుచేతులతో తలబట్టుకొని యాలోచింపసాగెను.

"ఆలోచించునదేమిటి? మద్యమునుసేవించుము. నేనైతే చాలాదినములనుండి యీరోజును ప్రతీక్షించుచుంటి. ఇంటియందలినా పూజపనికిరాలేదు, ఇచ్చటనైనను స్వీకరించుము."

"మాట్లాడబోకుముకళా! హా! ఏమినేనిట్టుజేచితిని! నాపాప మీప్రకారముఫలించునని నేదలంచనైతి. ఎట్టియనర్థమునుజేసితిని?"

"అనర్థమెట్లు? ఇది ధర్మశాస్త్రముల యాజ్ఞ! ప్రాచీనప్రథ! పతిదేవుడు, పత్ని దాసి. ఆయనస్త్రీని ఇవ్వవచ్చినటుల జేయవచ్చును. స్త్రీమాత్రమేవిధమునైన, తానేమైననుసరే' పతిని సంతుష్టునిజేయుమార్గము వెదకవలయును; ఆమె యేమైననుసరే!"

"దీనినినీవువిశ్వసించెదవా??"

“అవును. నాకుజన్మనుండియు నిదే నేర్ప బడినది.”

“ఇప్పుడుకూడా విశ్వసించుచుంటివా?”

“అవును.”

“సత్యముజెప్పుచున్నావా?”

“దేవునియెదుట నసత్యమెట్లు జెప్ప గలను?”

“ఇప్పుడుకూడా నన్ను దేవునిగా భావించు చుంటివా?”

“అవును.”

“నాకొరకై నేగోరినది జేయగలవా?”

“చేయగలను”

“అదెంతకఠినకార్యమైననుసరే?”

“ఇప్పుడునే జేసినదానికంటె కఠినకార్య మేమియుండగలదు?”

“మృత్యువు.”

“కాదు.”

“అయితే నాతో గూడ నాసంతుష్టికొరకు మరణింపగలవా?”

“సంతసముతో”

“రెండుగిన్నెలు మద్యముతో నింపుము” కళ రెండుగిన్నెలను మద్యముతో నింపెను. భర్త రెంటిలో యేదోనొకచూర్ణమును గలిపెను.

“తీసికొనుముదీనిని”

ఉభయులు గిన్నెలనెత్తి నోటనిడుకొనిరి.

“త్రోడుతోడుగానరకమునకు” — పతి యనెను.

“దేవుని వెంట నెచటికైనా సరే!”, “దేనిని ఈ జన్మలో ఈసమాజములో చేయజాలమైతిమో దానిని ముందరిజన్మలో మరొకసమాజములో జేయుదుముగాక!”

ఉభయులునుగిన్నెల వదలిరి. ఉభయులును ఒకరుమరొకరి హస్తములగ్రహించిరి. ఒకరిమొగమువంక నొకరు జూచుకొనుచూ విషపాత్రలను జారవిడచిరి.

(‘చాందు’నుండి)

---

# వాసంతసంధ్య

శ్రీమతి రత్నావళిగారు

శ్రీవసంతలక్ష్మీమృగాక్షీమనోజ్ఞ
మధురతరకౌముదీనిభ మందహాస
రుచులపులకితమై సాంధ్యరోచులందు
చెలగి కోకిల గానముచేయసాగె.
కుసుమసౌరభమును మోసికొనుచు జనుల
కాయముల కతిహాయినిగలుగజేసి
కొలనిజలములపైనుండి కొసరికొసరి
మలయపవమానబాలుండు మసలుచుండె
ప్రాంతతరుపోతపంబులు భూజములకు
సుమలతలకు నత్యంతమౌశోభ గూర్చ

దివ్యసౌందర్య కాంతులతేజరిల్లి
బంగరుమలాముచేసినభంగిదనరి
మాధవీలత యొకతియ మావిమోక
జుట్టుకొని సుమములతోడసుందరియగు
కాంత యనుకూలుడగుతనకాంతుగాఢ
తరపరిష్వంగ మొనరించుకరణినుండె
ప్రేయసియుప్రియుడును తమప్రేమభరిత
హృదయభావాల నొండొరులెరిగికొనుచు
కుసుమమంజరులనుమాలగూర్చుకొనుచు
పూవుడేరాలలో ప్రొద్దుపుచ్చినారు.

# శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసరచన

కోనెల వేంకట నరసింగరావుగారు బి. ఏ.

వ్యాసరచనయనఁగా నేదియేనొక విషయమును బాగుగఁ బరిశీలించి, చక్కఁగఁ జర్చించి, వివిధాభిప్రాయములనెల్లఁ గ్రోడీకరించి వానిని వివేకముతో విమర్శించి వచనరచనా మూలమునఁ దమభావములను వ్యక్తీకరించునట్టిది. ఇట్టి గద్యరచనలను మనవాఙ్మయ వేత్తలు 'కవిత' యనరు. పద్యరూపమునను న్నదెంత భావశూన్యమైనను 'కవిత' యనికాని 'కావ్య' మనికాని వ్యవహరింపఁబడుచున్నది. ఉత్కృష్టతాపూరితమైనదయ్యు వ్యాసరచన 'కావ్య' మనఁబడదఁట. ఎంతవిపరీతము! మన సారస్వతమందు గద్యరచన నిట్లుపేక్షించు వేలకో తెలియవచ్చుటలేదు. కానిందు; అవశ్య మట్టివి పఠనీయములును ననుసరణీయములునై యుండుననుట మనిశ్చయము. శ్రీవరలక్ష్మమ్మగారి రచనలు వచనాకృతిఁ దాల్చినవయ్యు రసభరితగీతాధికములు, గద్యమే యయ్యు భావోద్రేక పద్యోపమానములు, చిన్నమాటలేయయ్యు తేనెలతేఁటలఁ బురుడించున ట్లతులితమాధురీమహిమంబులు, సామాన్యలోకోక్తులతో నిండినవేయయ్యు నసామాన్యనీతిబోధకములు. భావములు గంభీరోదార సంకులములు; పలుకులు సుభాషితములు; పదముల లాలిత్యమమేయము; వర్ణనలవిన్యాణము వర్ణనాతీతము; శైలినిరుపమానము.

ఇఁక శ్రీవరలక్ష్మమ్మగారి వ్యాసములను బరిశీలింతము. మావద్దనుండెడి 'గృహలక్ష్మి' మాసపత్రికల యందన్నింటియందు: నించుమించు నీవిదుషీమణిచే వ్రాయంబడిన వ్యాసములుగలవు. అయ్యవి ముఖ్యముగ "శారదలేఖలు" "స్త్రీసమాజములు." "కీ|| శే|| పోరగుడి సీతమ్మగారు" "శ్రావణపట్టీ" "స్త్రీ అబలకాదు." "సుభాషితము" "వెన్నను పుచ్చుకున్న నాఁటిరాత్రి" "స్త్రీ" "పిఠాపురము మహారాణీగారితో ఒకగంట కాలక్షేపము." "సంవత్సరాది పండుగ అంటే" మొదలగునవి. 'గృహలక్ష్మి' లో ప్రచురింపఁబడిన వ్యాసములేగాక వేఱొకవ్యాసములను బహుళ: "పేదరాలు" భారతిలో జూచితిని.

పైనుదాహృతములైన వ్యాసములలో శ్రీవరలక్ష్మమ్మగారి పాండితీగరిమ యనన్యసామాన్యమైనదని ద్యోతకమగుచున్నది. 1930 సం|| ఏప్రియల్ మాసపు 'గృహలక్ష్మి'లో నాపత్రికాసంపాదకు లీక్రిందిరీతి నామెను బ్రస్తుతించిరి. "శ్రీవరలక్ష్మమ్మగారి శైలిలో ఒకవిధమైన వేగమున్నది. అలతిపదములచే గూర్పఁబడిన చిన్నవాక్యము లావేగమునకు ముఖ్యపరికరములు. ఆమెకు గల వస్తుపరిశీలనాశక్తి ఆమె వ్యాసములందలి ప్రతివాక్యమున గోడగట్టుచుండును. శైలికి వ్యక్తిత్వము నీయఁగల సామర్థ్యము, వస్తువులను పరిశీలించుటలో అపూర్వమైనశక్తి, విషయముల నుండి మంచినీతిని వడపోసి ప్రదర్శింపఁగల ప్రతిభ శ్రీవరలక్ష్మమ్మగారికి సహజగుణములు." ఇందలి సత్యమును బరిశీలింతముగాక. శైలిలో వేగమున్న దనఁగ శైలి నిరర్గళముగఁ బ్రవహించుచున్న దన్నమాట. ధారాళమైయుండు శైలి నాంగ్లేయులు (Flow) "ప్రవాహ"మని వ్యవహరింతురు. "స్త్రీ అబలకాదు" అను వ్యాసమునందు పురాణగాథ లిమిడియుండి వ్యాసమున కొకవిధమగు వన్నెను జేకూర్చుటయే గాక పదలాలిత్యమును జెప్పకయే చెప్పుచున్నవి. 'గృహలక్ష్మి' నభినందించుచు నామె యిట్లు వ్రాసిరి. "ఆమె ముఖావలోకనమాంధ్రమహిళల కకాల సుధాకరదర్శనమైనది. ఆమె దరహాసజ్యోత్స్న లాంధ్రగృహదీపికలైనవి. ఆమె పలుకు చిలుక లాంధ్రహృత్పంజరనివాసములైనవి. ఆమె గమనవేగము యావదాంధ్రదేశమును జుట్టివచ్చుటయే గాక దేశాంతరస్థుండాంతరాంధ్రజనసందర్శనా సమర్థంబయి తనరారినది. ప్రాచీనులను నవీనులను గూడ నామె సమాధానపెట్టుచున్నది. బాలలకు వృద్ధులకుఁ గూడ నామె ప్రేమభాజనమగుచున్నది."

ఇందలి నడిని, నడకను గమనింపుఁడు—ఇట్టి యనర్ఘశైలితో నలంకరింపఁబడిన వ్యాసము లెవని హృదయము నలరింపఁజాలవు. శ్రీ 'గృహలక్ష్మి' సంపాదకుల సిద్ధాంతమిచ్చట్టున నిక్కువమని నొక్కి వక్కాణింపనగును.

శ్రీ వరలక్ష్మమ్మగారి వ్యాసరచనలోఁగల వేఱొక విశేషమును శ్రీ కేసరిగారు విశదపఱచిరి. అయ్యది "ఆమెకుఁ గల వస్తు పరిశీలనాశక్తి." దీనినిగూడ చర్చింతము. వస్తు పరిశీలనాశక్తి యనఁగా ప్రతివస్తువును సూక్ష్మబుద్ధితో బరిశీలించి యందలి సత్యాసత్యములను బాగుగఁ గ్రహించి వానిని స్థిరపఱచుటయే. ఈమెకుఁగల వస్తుపరిశీలనాసామర్థ్యము ప్రతివ్యాసమందును ప్రతిబింబించుచున్నది. ముఖ్యముగ 'దక్షిణదేశయాత్ర' 'అమరావతీయాత్ర' యను వ్యాసములలో నధికముగఁ జూడఁదగును. "ఉన్నతోన్నత ప్రాకారగోపురావళులతోడను విశాలమైన రాచబాటలతోడను నొప్పారును" కాంచీపురము. దశమి నాఁటిరాత్రి ఎనిమిదిగంటలకు" "ఏకామ్రేశ్వరుని యాలయములో గొప్ప యుత్సవము జరుగుచుండును," అందలి "బృహదేశ్వరాలయపు గోపురమునంటిదెది మఱి యెచ్చటను లే"దఁట. "దానినీడ భూమిపై పడ"దఁట. "అది శిల్పశాస్త్రజ్ఞానైపుణి". ఇది యీవిదుషీమణి వస్తు పరిశీలనానైపుణి. పడమటి కనుమల వర్ణనము బరికింపుఁడు. "వికసించిన పుష్పగుచ్ఛములతో, విరియఁ గ్రమ్మిన యాకుజొంపములతో, నాపర్వతముల పైనున్న లతాద్రుమావళులు" "కుంకుమపు రాసులుపోసిన ట్లొకచోటను, పసుపు కుప్పలుపోసిన ట్లొకచోటను, నీలాంబరముగప్పిన ట్లొకచోటను, వెల్లముసుంగువేసికొనిన ట్లొకచోటను" నున్నవి. "క్విలన్" స్టేషనుదాఁటినదాదిగ త్రోవపొడుగునను కొబ్బరిడిప్పలు నీటిలో నాననేయుచున్న వారును, నానిన డిప్పలనుండి పీఁచును త్రాళ్లుగా పేనుచున్న వారును కానవగుదురు". వస్తుపరిశీలనాశక్తియన నిట్టిదేగదా! ఆమని—యాగమనము నభివర్ణించుచు 'ఋతురాజగు 'వసంతుఁడు' 'రసపాయి'. అతఁడు 'సౌందర్యోపాసకుఁడు' గావుననే పక్షులచే పాడించి, వృక్షములచే ఊగించి, గంధవహునిచే వింజామరలువేయించి, సుధాకరునిచే మధుర పీయూష మిప్పించి, సర్వవిధముల కళారాధకుల ఆకలిదప్పుల తీర్చిస్తాడు." ఇందుగూడ వస్తు పరిశీలనాప్రతిభ ప్రజ్వరిల్లుచునేయున్నది. ఇయ్యది రామరాజభూషణకవికృత 'వసుచరిత్ర' ప్రబంధమందలి వసంతాగమవర్ణనఁ దలపించుచు గడుముదంబుగూర్చుచున్నది. ఆహా! ఈమె వస్తు పరిశీలనాశక్తి నిజముగ నత్యద్భుతము. పరిశీలించుకొలఁది ప్రతివాక్యములోను ప్రతిపదములోను నిట్టి విచిత్ర సామర్థ్యమే గనుపట్టుచుండ నింక నుదాహరణములను చేర్కొనుట యనవసరమని భావించుచున్నాను.

శ్రీ కేసరిగారు "శైలిక వ్యక్తిత్వము నీయఁగల సామర్థ్య" మీమెకు గలదని నుడివిరి. (ఆంగ్లేయమందు నియ్యది Distinctness, or Manifestation అని వ్యవహరింపఁబడుచున్నది.) కనుకనే నొకయాంగ్లేయకవిరాజు (Style is the man)" శైలియే మానవుఁడు" అని నుడివియున్నాడు. ఏలననిన మానవుని మానసకుసుమమందు దాఁగుఁడు గుణగణములే వారి వ్రాఁతలలోను చేఁతలలోను జూపట్టుచుండుట సహజము. ఇఁక శ్రీవరలక్ష్మమగారు శైలికి వ్యక్తిత్వమెట్లు చేకూర్చిరో విచారణీయాంశము. ఈవిషయచర్చకు గూడ నుదాహరణములే మనకు సహాయభూతములు. ఆమెచే లిఖియింపఁబడిన స్త్రీసమాజముఁ గూర్చిగాని, అస్పృశ్యతాసమస్యఁ గూర్చిగాని, శారదాశాసనము సవరణగూర్చిగాని, పెన్నముపుచ్చుకున్న నాఁటిరాత్రి యను కథా వ్యాసమును గూర్చిగాని, వేయేల, ఏ వ్యాసమును గూర్చిగాని చర్చించునపు డీగుణవిశేషము ప్రస్ఫుటముగఁ గానవచ్చుచున్నది. "స్త్రీసమాజము"లను వ్యాసమునం దీమె ముఖ్యముగ సూచించునట్టి విశేషవిషయమేమనఁ నభిన మహిళాసమాజములయందు, హిందూమహమ్మదీయ క్రైస్తవాది సర్వమతసమ్మతమగు నేకేశ్వరోపాసనకు సంబంధించు ప్రార్థనలు సల్పుట యవశ్య మనుసరణీయ మనియు "విదేశీయక్రీడలతో బాటు దేశీయక్రీడలకును, విదేశీయ వ్యాయామములతో బాటు దేశీయ

వ్యాయామములకును, విదేశీయ భాషతోబాటు దేశ భాషకును, విదేశీయ 'టీ' పార్టీలతోబాటు దేశీయ వనసమారాధనలకును గౌరవమొసంగి సామరస్యము గల్పించి సమన్వయబుద్ధితో నడిపించినచో ఈక్లబ్బులద్వారా యువతీజనములో నెక్కువ ప్రబోధము గల్గించుట కవకాశమున్నదనియు నుడివిరి. ఇట్టి సిద్ధాంతములే శైలియందలి వ్యక్తిత్వమును వెల్లడించును. ఇట్టివే రచయిత సహజసరళస్వభావమును ప్రకాశింపఁజేయును. ఇప్పట్టున నీమెకుఁ గల భగవద్భక్తియు దేశాభిమానమును తెల్లముగనుల్లమునకుఁ దోఁచును. అంతియెగాక మహిళాపురోభివృద్ధికై యీమె కొన్ని సూచనలను గూడ జేసిరి. వేఱొండుదాహరణమును జేర్కొందను. అస్పృశ్యతా సమస్యను గూర్చి చర్చించుచు నీమె అగ్రజాతులు అంత్యజాతులు అనెడి భేదములేక హిందువులనఁబడు వారందఱు దేవాలయమున కేఁగినప్పుడేగదా దేశమునందలి వివిధజాతులవారికి సర్వసమత్వభావము గలుగునని యుఁ దన్మూలమున దేశసౌభాగ్యములు నెంపొందు ననియు నుడివియున్నారు. మరియు ప్రేమమయుండగు నీశ్వరుఁడు "దీనులు దరిద్రులునైనవారి పక్షమునఁ నే వాత్సల్యము జూపుచుండు" ననియు "గుణశీలములను బట్టియేగాని జాతిమత విచక్షతనుబట్టి నిగ్రహానుగ్రహములు చూపఁబో"దనియు వ్రాసిచ్చిరి. ఈసాధ్వికి దీనులయెడఁ గల నపారవాత్సల్యమును బరికించితిరా? ఇట్టి గంభీరభావజనితమగు సూక్తిశ్రేణికమునే వ్రాఁతమూలమునఁ దెలుపుడు చేసినయెడల శైలికి వ్యక్తిత్వము చేకూర్చినట్లగును. మఱియొక యుదాహరణమును జూడుఁడు. "శారదాచట్టమునకు సవరణను ఉపపాదించుట యనుచిత కార్యమనుటకు సందియములే"దనియు, యుక్తవయస్సునందు అనఁగ, పదునాలుగేండ్లకు వివాహములు చేయుటయత్యంతావశ్యకమనియు "స్త్రీజనాభ్యుదయ చింతతోఁ జేయఁబడిన శారదాచట్టము యథారూపమున నమలులోనికి రప్పింపవలెననియు నీమె ప్రబోధించిరి. దీన నీమెకతి బాల్యవివాహములయందుం జెడి రోఁతయు, శారదాచట్టమునకు సవరణ నుపపాదింపనిచో దాన భారతీయులకు గలిగెడు ఖ్యాతియు వెల్లడింపఁబడియెను. సోదాహరణముగఁ బ్రతివ్యాసమును బరిశీలించుచో నిట్టి వాక్యస్ఫురణమపారముగఁ గానవచ్చుచున్నది. కావున శ్రీ 'గృహలక్ష్మి' సంపాదకుల యభిప్రాయమిప్పట్టున సత్యమని నిరూపింపఁబడినది.

శ్రీమతి వరలక్ష్మమ్మగారికి "విషయములనుండి మంచినీతిని వడపోసి ప్రదర్శింపఁగల ప్రతిభ" గలదని సంపాదక మహాశయులు నుడివియున్నారు. ఈసిద్ధాంతము కూడ నిజమని, చెప్పుటకు సంతసించుచున్నాను.

నీతియనఁగా నేమి? సత్యమునకు ధర్మమునకు న్యాయమునకు బద్ధమగునట్టి సుగుణవిశేషమే నీతి యనఁబడును.

ఈ విదుషీమణిచే వ్రాయఁబడిన ఒకానొక శారద లేఖలో "స్త్రీ నాటకరంగ ప్రవేశమును" గూర్చి చర్చగలదు. అందీమె స్త్రీ నాటకరంగ ప్రవేశమునకు విముఖతఁ జూపుచు దగురీతిని విమర్శించిరి. పూజనీయమగు వాక్యములో "మానంబెతోడవు సతులకు, మానమె ప్రాణాధికంబు, మానమఖిల సమ్మానములకు మూలంబగు, మానరహితమయిన బ్రదుకు మానినికేలా?" యనెడి నీతియేగదా ఇమిడియున్నది. మఱియొక 'శారదలేఖ'లో 'శ్రీ గౌతమీదేవి' పుష్కరోత్సవమును వర్ణించుచు, భరతదేశవాసు లెల్లరు "స్వదేశీ వ్రతము నవలంబింపరేని" "కలుగనేటికి తల్లులకడుపుచేటు" అని ప్రథమపాఠమును బోధించిరి.

"పెన్షను పుచ్చుకున్న నాఁటిరాత్రి" యను కథావ్యాసములో "కష్టజీవికి కన్నీటి కాల్వకైన, కాలచక్రము నిలువదు కనికరమున, ధారుణీపాల పాలనా దండమునకు, వెఱచి యాఁగదు తృటికైన విరతి గొనదు" అనుభావమును వ్రాసిచ్చి "తగునిది తగదని, యెదలో వగవక సాధులకుఁ బేదవారలకెగ్గుల్ మొగిఁజేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబులయిన భయంబుల్." అనెడు ధర్మంబును సువ్యక్తపఱచిరి. ఇట్టి నీతులామె వ్యాసములయందు "ఎందెందు వెదకిజూచిన నందందే గానవచ్చు" చున్నవి.

శ్రీ వరలక్ష్మమ్మగారి శైలిని అభినందించుచు శ్రీ సంపాదకులు వ్రాసిచ్చిన గుణవిశేషముల నన్నింటిని విమర్శాపూర్వకముగఁ బరిశోధించితిమి. ఇఁక నీ విదుషీమణిచే వ్రాయంబడిన వివిధవ్యాసములలో

వ్యాప్తమై దనరు మఱికొన్ని సుగుణములను సూచించుట ప్రస్తుత కర్తవ్యమైయున్నది. అయ్యవి లోకోక్తుల ప్రయోగమును, సర్వసామాన్యవిషయ చర్చయునైయున్నవి. ఈ ద్విగుణములను వేర్వేరుగ వివరింతము.

లోకోక్తులనఁగ సామెతలు. ఈసామెత లాసంగడి విజ్ఞాన మపారమనుటలో నతిశయోక్తి లేదు. ఒకసామెత సహాయమున నేవిషయమైనను "తెలియనివానికి సుఖముగఁ దెలుపందగు"ను. ఇట్టి సామ్యములు శ్రీ వరలక్ష్మమ్మగారి వ్యాసములలో విశేషముగఁ జూడనగును. ఇట్టివాని మూలముననే ఆమె తమ యుత్తమాభిప్రాయములను లోకమునకు వ్యక్తపఱచుచు యశస్సు నార్జించుచున్నారు. కొన్ని లోకోక్తు లీక్రింద నుదాహరించుచున్నాను. "ఎఱుక పిడికెడు ధనము", "ప్రాతగోడకు పూతచక్కనా, కోతిరూపికి ప్రాఁతచక్కనా", "తడిసిగాని గుడిసె కట్టరు", "ప్రాతయన్న రోత", "త్రాగిగాని తూఁగరు", "సాగితే నాయఁడు, సాగకపోతే పోయఁడు", "లోకోభిన్నరుచి", "ఊరంతా మాడిగే దంటే తాను పాడిగేద అను పెళ్లాము", "ముంజేతికంకణమున కద్దంబేల". ఇత్యాది సామెతలు మనోరంజకముగనుండుటయే గాక వస్తునిర్దేశమునకు గూడ దావొసఁగుచుండును.

ఇఁక సర్వసామాన్యవిషయములతో తమ వ్యాసములను జిత్రించుటయం దీమె ప్రసిద్ధిఁజెందిన సిద్ధహస్త. సర్వసామాన్యవిషయములను స్వభావసిద్ధముగఁ జర్చించువారే నిజముగ 'వ్యాసకర్త'లనిగాని 'కవు'లనిగాని పిలువంబడుదురు. కనుకనే మహర్షి కార్లయి లీ క్రిందివిధమున వాక్రుచ్చెను.

"The poet, we imagine, can never have far to seek for a subject; The elements of his art are in him, and around him on every hand; for him the ideal world is not remote from the Actual, but under it and within it; nay, he is a poet precisely because he can discern it there."

శ్రీ వరలక్ష్మమ్మగారి వ్యాసరచనయం దిట్టి సామర్థ్యము గోచరించుచున్నది. "పెన్నను పుచ్చుకున్న నాఁటి రాత్రి" యను శీర్షికక్రింద నీమె వ్రాసిన వ్యాసమును బరికించితిరా? ఆనాఁటి రేయి రాజేశ్వరరావుగారి యూహాపోహ లెంత సహజముగనున్నవి! ప్రతిమానవుఁడును నా పరిస్థితులలోనన్లే డోలాందోళిత మానసుండగుట కరతలామలకము. అటులనే "శ్రావణపట్టీ" యను కథావ్యాసమును జూడుఁడు. పాపయ్యపంతులుగారి లోభము, దాన వారికిఁ గలుగు లాభము, మహాలక్ష్మమ్మగారి యూవి, దాన భార్యాభర్తల రోసరోసలు, గృహచ్ఛిద్రము లెంత స్వభావసిద్ధముగనున్నవి! ఇట్టి ప్రస్తావనలఁ బ్రకాశింపించు వ్యాసములు సర్వజనాదరణీయములగుట నిక్కువము. ఇట్టివే వేయి చరిత్రలపెట్టు!! వ్యాసవిస్తరభీతిచే నిఁకయుదాహరణములఁ బేర్కొనఁజాలను. శ్రీ వరలక్ష్మమ్మగా రాంధ్రసారస్వతమందలి వ్యాసరచనకొక వినూతనమగు వన్నెను జేకూర్చిరి. ఆధునిక వ్యాసకర్తలలో ముఖ్యముగ స్త్రీలలో, నీమె ప్రథమస్థాన మలంకరించుచున్నది.

ప్రస్తుతపు కవయిత్రులలో శ్రీమతి కవితిలక కమలావతీదేవిగారును, శ్రీ వరలక్ష్మమ్మగారును నాంధ్రదేశమునఁ బేరెన్నికఁ గన్నవారు. ఏలనో శ్రీ కమలావతీదేవిగారు 'గృహలక్ష్మి'నిఁ దమ యమూల్యవ్యాసాభరణములతో నలంకరింపకున్నారు. జననీ, నీవంటి విదుషీమణులు 'గృహలక్ష్మి'ని విస్మరింపఁదగునా! ఆంధ్రసంతానమును బెంచి విద్యాధికులుగఁజేసి విజ్ఞానముగఁ బోషింపవలసిన విధ్యుక్తకర్తవ్యము మీయదియేగదా!! మీరిరువురును నిరువురు తల్లులవలె మా యాంధ్రసోదర సోదరీమణులఁ బ్రబోధించెదరు గాక!!! మీవంటివారే నిక్కముగ దేశదారిద్ర్యమునకు విమోచనము గల్గించెడివారు. మీరే దేశమునందలి ధీసంచయము. మీరు మీ యుత్కృష్టాభిప్రాయములను 'గృహలక్ష్మి' ముఖమున నాంధ్రలోకమున కెఱింగించుచు జిరకాలము తెనుఁగుదేశమును సేవించుచుందురు గాక! ఈశ్వరుఁడు మీ సముద్యమములకు దోడ్పడుచు చిరాయురారోగ్య సౌభాగ్యములొసంగి యాశీర్వదించును గాక!

# తిరుమలదేవి

శ్రీమతి గొల్లపూడి అన్నపూర్ణమ్మగారు

నాడు పౌర్ణమియగుటచే చంద్రుడు పరిపూర్ణమైన కళలతో ప్రకాశించుచుండెను. పగలు విశేషముగ యుద్ధముచేసి యుండుటచే సైనికులు గుడారములందు గాఢముగ నిద్రించుచుండిరి. కావలివారు మాత్రము కడుజాగరూకతతో గుడారములు కాయుచుండిరి. ఆ నిశ్శబ్దసమయమున అప్పుడప్పుడు చేయు గుర్రముల సకిలింపులతోను, కావలివారి 'హారాహుషారు' అను హెచ్చరికలతోను ఆ నిశ్శబ్దమున కంతరాయము గల్గుచుండెను. ఆ గుడారముల కనతిదూరమున నొక చక్కని చిన్నగుడారము వేయబడియుండెను. గుడారము బైటను మంచముపై ప్రభువగు కృష్ణదేవరాయలు పండుకొని కోటముట్టడినిగూర్చి దీర్ఘముగ మంత్రియగు తిమ్మరసుతో నాలోచించుచుండెను. అంతలో కావలివాడు "ప్రభూ! తమకొరకెవరో వచ్చియున్నార"ని చెప్పెను. కృష్ణదేవరాయలు ఇంచుక యోచించి యా క్రొత్తవానికి రా ననుజ్ఞయిచ్చెను. ఆ నూతనపురుషు డరుదెంచి కృష్ణదేవరాయలకు నమస్కరించెను. కృష్ణరాయలు "నీ వెవర"వని ప్రశ్నించెను. "దేవా! నేను ఉత్కలేంద్రుని ముఖ్యసేనానిని. తమచే యిట్లు కోట ముట్టడింపబడియుండుటచే మా ప్రభువువారు సభచేసి కర్తవ్యమేమని యందరి నడిగిరి. దానికి నేను యాతని కుమార్తెయైన తిరుమలను తమకొసంగి సంధి చేసుకొనిన బాగుండునని సలహానిచ్చితిని. అందుపైని వారందరు నన్ను పరాభవించి యావలకు పొమ్మనిరి. ప్రభూ! యిచటి కనతిదూరమున ఒక రహస్యమార్గము గలదు. దానిగుండా కోటను సులభముగ వశపరచుకొనవచ్చును" అని చెప్పెను. కృష్ణరాయలు, తిమ్మరసు గుడారములోనికేగి యేదియో ఆలోచించుకొని యీవలికి వచ్చి "ఓయీ! నీవు చెప్పినదానియందు యించుకేనియు నసత్యమున్న నీదేహముపై నాశయుండ"దనియెను.

౨

తిరుమల యుత్కలేంద్రుని తనయ. పదునారు వత్సరముల ప్రాయముగల చక్కని చుక్క. తాను ఇదివరలో నారుమాసముల వెనుక నొక సందర్భమున నొక ఛాయాచిత్రమును చూచియుండెను. ఆ ఛాయాచిత్రమునందుగల పురుషునిగూర్చియే యామె యా యర్ధరాత్రియందు తన భవనముప్రక్కనున్న యుద్యానవనములో కూర్చుండి యోచించుచుండెను. ఆమె యొక పెద్ద నిట్టూర్పువిడచి, "ఆహా! యీ చిత్రపటమునందుగల పురుషుని నామధేయమైనను తెలియదాయెను. నాకు పటమొసంగిన నాచెలి యాతని నామము తన భర్త నడిగి తెలిపెదనని నేటికిని రాదయ్యెను. అయ్యో! యీ సుందరపురుషుని వివాహమాడని నా జన్మమేల?" అని మాటిమాటికి ఆ చిత్రపటమును చూచుచు

పరిపరివిధముల తలపోయుచుండెను. ఇంతలో తండ్రిగారి యాజ్ఞయగుటచే ఆమె యాలోచనల కంతరాయము కలిగెను.

౩

"సభాసదులారా! నేటితో మన కోట వినాశనముగాక తప్పదు. మనకు కృష్ణరాయనితో సంధి కుదరదు. నేను బ్రతికియుండగా ఆ కులహీనునకు నా తనూజాతనిచ్చి పెండ్లిసేయను. శత్రులవశము గాకుండ అంతఃపురస్త్రీలను చంపివేయుడు. కాని నా ముద్దులతనయయైన తిరుమలను చంపవలదు" అని యుత్కళేంద్రుడు తన కుమార్తెవైపు తిరిగి "తల్లీ! నిన్ను పదునారు వత్సరములు గారాబముతో పెంచితిమి. నాకు పుత్రులు లేమిచే నీయందే గంపంత యాశతోవున్నాడ. కాని నేటితో మన కోట శత్రువశముగాక తప్పదు. మేమందరమును శక్తియున్నంతవరకు పోరి వీరస్వర్గ మలంకరించెదము. కనుక నీవు నీకు యిచ్చవచ్చిన రాకుమారుని వరించిన యాతడు నిన్నిటనుంచి తప్పించుకొని పోవటకైన నేగగల''డని చెప్పెను. దానికి తిరుమల తనలో "ఆహా! నేను నా చిత్రపటమునందుగల పురుషుని యెట్లు చేరగలనని" యోచించి తుట్టతుదకు సభికులతో " ఈ యుత్కళేంద్రుని యీ యాపదనుండి యెవరు రక్షింతురో వారినే వరించెద" ననియెను.

రాజపుత్రులెల్లరు ఒకరినొకరు చూచుకొని దీర్ఘాలోచనాపరులైరి. ఇంతలో ఒక సుందరపురుషుడు లేచి "నేను రక్షించెద" ననియెను. అప్పుడు మిగిలినవారందరును కరురోషముతో "యోరీ దాసీపుత్రా! తుచ్ఛా! కృష్ణదేవరాయా!" అని యందరు నిలువబడిరి. కాని యేమి లాభము? వేనవేలు సైనికులు కోటను ముట్టడించిరి. ఆ పురుషుడు వారివైపుచూచి "మీ రోషములతో మాకు పనిలేదు. కోట మా స్వాధీనమైనది. మీరు వివాహమున కంగీకరించనియెడల మిమ్ములనందర చెరకొనెద" మనియెను. ఉత్కళేంద్రుడు చేయునదిలేక తన నలుగురైదుగురు సభ్యులతోను తన తనయతోను నేదియో యాలోచించుటకు వెళ్లెను. మారువేషముతోనున్న తిమ్మరసు కూడ వారివెంట నరిగెను. ఆ మరుక్షణముననే యుత్కళేంద్రుడు తన కుమార్తెను కృష్ణరాయునికి వివాహముచేయుట కంగీకరించి సంధి చేసుకొనియెను.

౪

"కృష్ణరాయ ప్రభూ! యీ కల్పిత విగ్రహమును యీ మంచముపైనుంచి మీరు ప్రక్కనుండి రహస్యముగ పొంచి చూడు"డని తిమ్మరసు చెప్పెను.

పరిచారికలు తిరుమలను తీసుకవచ్చి యాగదిలో వదలిపోయిరి. తిరుమల క్రీగంట మంచముపైనున్న కృష్ణరాయుని వీక్షించుచుండెను. ఆమెకు కోపము రెట్టింపయ్యెను. "ఆహా! యీ క్రూరాత్ముడు నన్ను చేపట్టదలచెనా! నా ప్రాణముపోయినను చిత్రపటమునందుగల పురుషునితప్ప యింకొకని ప్రేమింతునా? నా పెద్దల యాజ్ఞానుసారము వీని నిదే తుదముట్టించెద"ననుచు

పైటకొంగుననుంచిన బాకునుతీసి యావిగ్రహమును పొడచివేసెను. ఆ తొందరలో తన పైటచెంగున నిడుకొన్న ఛాయాచిత్రము నేలపై బడెను. ఏమి యాశ్చర్యము? ఆ పటమునందుగల పురుషుడే యా మంచముపై నున్నవాడు. తిరుమల యది గ్రహించి "హా! నే నేమిచేసితిని? నా ఛాయాపటమునందుగల నా మోహనమూర్తిని చంపుకొంటినా? అయ్యో! ఆ చిత్రపటమునందుగల నా ప్రియుడు కృష్ణరాయడా? అహా! నిదానించిచూడగ నా మనోవల్లభుని, నా జీవితేశ్వరుని, నా చిత్రపటమునందుగల నా మోహనాంగుని చంపుకొంటిని. తండ్రీ! నీతనయ నధోగతిపాలొనరించితివి. హా! ప్రాణేశ్వరా! కృష్ణరాయప్రభూ! నీ ఛాయాచిత్రము ఆరునెలలనుంచి చూచి నిన్ను వలచుచుంటిని. కాని యాతడు నీవని తెలియకపోయినది. ఓ తండ్రీ! నా ప్రాణవల్లభుడు, నా కృష్ణరాయడు లేని జీవమేల? ప్రియా! ఇదిగో నీ ప్రాణేశ్వరి నిన్ను కలుసుకొనుటకై నీ వెనువెంటనే వచ్చుచున్న"దని బాకుతో పొడుచుకొనుటకు తిరుమల సంసిద్ధురాలై యుండెను.

"అంత సాహసమువలదు. నీ ప్రాణప్రియుడు కృష్ణదేవరాయలైన నీ ప్రేమవర్షమిటు కురిపింపు" మని కృష్ణదేవరాయలు బైటకువచ్చెను. ఆబాలిక యాశ్చర్యమునకు మేరలేదు. ఆమె వణకుచూ "నే..... బా......కు......తో......పొ......డు.....చి.....న.....దె.....వ.....రు?"
"ప్రేయసీ! అది కల్పితవిగ్రహము. ఇక నీ ప్రేమసాగరము నాపై పొరలింపుము."
"ఆహా! నా ప్రేమమూర్తి, నా చిత్తచోరుడు, నా ఛాయాచిత్రమునందుగల కృష్ణదేవరాయడున్నాడా?" ఆ మరుక్షణముననే ఒకరి కౌగిట నొకరుండిరి.



## పల్లెపిల్ల

గవను వేంకటకృష్ణయ్యగారు

నిటలేందు రేఖపై నీటుగాగోటితో దిద్దితీర్చినబొట్టు తేమగిల్ల
కుదురునిండినకులుకు గబ్బిగుబ్బలపైని తారహారావళుల్ తాండవింప
ఘట్టించుదంతాలధావళ్యరుచితోడ బింబాధరముపాండురంబునొంద
తుమ్మెదబంతులందోసిరాజను నీలకుంతలంబులు వెన్కగునిసియాడ
పంటదేవేరి రూపుచేపట్టినట్టు
కెంపులీగాళ్లపైఁగాళ్లరెంటినుంచి
తడవుచాలంగఁబోదనుతత్తరాన
త్వరితగతి నేతమెత్తె మాపల్లెపిల్ల.

# మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి.యే.,బి.యల్.

1 అల్లదే తూర్పున తెల్లవారినది,
చిన్నలు పెద్దలు మేలుకొన్నారె,
'కొక్కొరో' యనికూసె కోడిమేల్కొల్పు
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

2 నీతోడిబిడ్డల నేస్తములజూడు
చల్దియన్నముతిని చదువగాబడికి
పోవుచునున్నారు లేవమ్మవేగ
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

3 దమయంతిసావిత్రి ద్రౌపదిసీత
పతులతోబడిన విపత్తులగూర్చి
కథలనుచదివితే కల్గునేగుణము
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

4 చదివితేకల్గునట సౌఖ్యంబుమిగుల
చదివితేయబ్బునట సంపదల్ చాల,
చదువువచ్చినవేరె చక్కదనమేల?
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

5 చక్కగావ్రాయుటకు చదువుకోవాలి
చక్కగానడచుటకు చదువుకోవాలి
చదువులురాకున్న జరుగదేపెళ్లి
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

6 హార్మనీయుండాలి యందముండాలి
పద్యాలుచదువాలి పాటపాడాలి
ఎన్నెన్నొయుండాలి యెట్లనోపెళ్లి?
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

7 కట్నంబులేకావు కానుకలేకావు
చెడుదెప్పులేకావు చీవాట్లెకావు
పెళ్లిపెళ్లనగానె పెద్దసంబరమా !
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

8 అప్సరసలాగున్న హార్మనీయున్న
సిరిలావుగానున్న చురుకుగానున్న
గొప్పవారికెపెళ్లి కుదరడములేదు
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

9 తండ్రిసంపదచూచి తాహత్తుచూచి
తల్లివర్తనచూచి తనయులంజూచి
పిల్లఅందముచూచి పెళ్లిచేయుదురె!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

10 కట్నంబులీయక కలుగదేవరుడు
చదువురాకుండినా సంచులియ్యాలి
అక్షరములేకున్న ఆశలేలేవా ?
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

11 మాటలురాకున్న నూటపదార్లు
కూడబల్కుట నేర్చుకోగానేవెయ్యి
ఇంగిలీషులెవస్తె ఇగచెప్పవలెనా?
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !

12 మెట్టుప్యాసవుతేన మిట్టిపడతారు
పిల్లనుముద్దుగా బియ్యేకుచేస్తే
పెండ్లితోమామకు భిక్షాటనంబె!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి !



" నీమగని కోయమ్మ నీమీదె మనసు

## ఆతపస్నానము



"సూర్యుని కీబంగారు కిరణము లెట్లు కలిగెనో?
ఆకాశమున కా నీలిరంగు నెవరు పూసిరో! ఈజలమున
కీ తళతళ లెక్కడివో!...నాతల్లి నడిగి తెలిసికొనెదను."

13 పెల్లికొడుకెవ్వడో? పెల్లియెల్లానో?
ఆడబిడ్డలెవరో? అత్తగారెవరో?
పెల్లియంటే పెద్ద బెంగవుడుతుందే!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!

14 చక్కదనములువద్దు సంపదలువద్దు
కొట్టకా తిట్టకా కోపపడకుండా
అభిమానమున నేలు అదియె పదివేలు!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!

15 సరుకుజప్రలువద్దు చదువులునువద్దు,
మిద్దెమేడలువద్దు మిన్నందవద్దు
బలుసుకూరైనాను బ్రతికితేచాలు!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!

16 మొగుడుచూచునొ లేదొ ముద్దుగానిన్ను?
అత్తగారేలాగు ఆదరిస్తారో?
నిన్నుతలచినయంత నీరౌనుగుండె!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!

17 [ప్రేమతో పెంచాలి పెండ్లిచెయ్యాలి]
అత్తింటికంపాలి ఆశచంపాలి
ఆడబిడ్డలగన్న అన్నికష్టములె!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!

18 అల్లదేసూర్యుండు అవతరించేడు
ఎండలోకమునెల్ల నిండుకొన్నాది
ఆలస్యమగునేమొ లేలెమ్మువేగ!
మంచిగాబడికిపో మాచిట్టితల్లి!



## మనోవేగము

ఉభయభాషాప్రవీణ వారణాసి లక్ష్మీనారాయణశాస్త్రిగారు

పరులు నియమించిరో! నీకె పనిగలిగెనో!
వస్తువేమైన వెదుకంగ వలచినావో!
పాదుత్రిప్పట కిటు లలవాటుపడితో
కాలుమోపక తిరిగెద వేల? మనమ?

ఇట్టి కనుపింతువిచ్చట నట్టిచూడ
సకల కకుబంతమధ్యదేశములలోన
ఇచ్చవచ్చినచోటికి వెగిరిపోదు
వెక్కరణిఁగాఁగలేనో! యింత చిక్కుపుట్టి!

ఆఁకలియు దప్పికయు నిద్ర యలపు సొలపు;
దలఁపవెన్నఁడు వానిపైఁదలపులేదొ!
మంచిచెడ్డలుశోధించి సమతనెఱపి
కుదురుపఱచెడువారలే కొఱతయైరొ!

భ్రమసి కడుపెద్దపనులకే పరుగులిడెదు
వానిఫలసిద్ధిస్వప్నలబ్ధంబెయైన
నౌర! విరమింప వాయడిరయాసనుండి
"సాహసే శ్రీః" యనెడు సెత్తి యూహానేమొ!

నీవెకా కొకకొందఱు నేస్తకాండ్రు,
నిన్ననుసరించితిరుగుచు నున్నవారు,
వారిలోమొనగాఁడవై వఱలుచునికి,
నేమొ! యింతటినిర్లక్ష్య వృత్తి నీకు.

ఈప్రపంచంబునంతను జాఁపవోలె,
జుట్టఁదలచిన నదినీకు సులభమగునె?
సాగరంబుల నొకగ్రుక్కఁ ద్రాగఁగఁనె?
ఏటికో! యింతశ్రమ నగుబాటుపనికి.

# ప్రేమ లేని పెండ్లి ప్రాణాంతకము

నాయని శేషాచలరావుగారు బి. ఏ.

(ఏకాంక నాటకము)

రంగము ౧. శయనమందిరము.

[శయనమందిరము అలంకరింపబడియుండును. దంతపుకోళ్ల మేజా. మేజాపై అమర్చబడిన తిరుగుటద్దము. విడియములు చుట్టియున్న బంగారుపళ్లెరము, పెండలుగాగలవి మేజాపైయుండును. మేజాపై స్టాండు ఎలక్ట్రిక్ దీపమొకటి ప్రకాశమానముగ కాంతు లీనుచుండును. మేజాముందు రెండు రోజ్‌వుడ్ కుర్చీలు అమర్చబడియుండును. రాత్రి పది గంటలు.]

ప్ర॥ వకుళమాల (పలుచని పొడుగాటిలేమ. రంగు చేవదారిన చందనపుబొమ్మరంగు. వయస్సు పదునెనిమిది సంవత్సరములు.) వెనువెంట దాసి పూల పళ్లెముతో.

వకుళ:—(భుజమువద్ద తడుముకొనుచు) చూడు రాగం! ఇక్కడేదో గ్రుచ్చుకుంటూవుంది.

రాగం:—(ఆవిడ భుజమును తడుపుచు) ఏమీ లేదమ్మా. జాకెట్టు ముడతపడింది. (సర్దును) అమ్మా! అవును గాని, యిదేమి జాకెట్టమ్మా. ఎప్పుడో పూర్వోత్తరముది. పెట్టిలో నలిగి నలిగి వుంది.

వకుళ:—(కొంచము కోపముతో) అయితే నీయిష్టమంటావా, మాఅమ్మ యిష్టమంటావా?

రాగం:—అయ్యో. ఎంత మాటన్నారు. మీయిష్టం కాక నాయిష్టమంటానమ్మా. నలిగిన జాకెట్టు, యీ కాలపుదానికి తగదని అట్లా చెప్పాను కాని మీయిష్టంకాక నాయిష్టమెందుకవుతుందమ్మా?

వకుళ:—కాదే, అది అచ్చివచ్చిన జాకెట్టదే!

రాగం:—అలాగా అమ్మా! నాకు తెలియక వన్నాను. క్షమించండి. (పరిశీలించి వకుళను చూస్తూ) వుందమ్మా! యీ పైటపిన్ను తల్లక్రిందుగా పెట్టిందెవరు? (పైటపిన్నును సరిగా పెట్టుతూ.) నాగం పెట్టిందా!

వకుళ:—కాదే. నేనే పెట్టుకున్నాను.

రాగం:—ఇదేమిటమ్మా! అయ్యగారిని చూస్తే, ఆయన వన్నెలవిసనకర్రలాగ తయారవుతారు. మీరేమో కుచ్చుల జాకెట్టులతోటి, బొంతకోకతోటి, ముక్కున అడ్డబాసతోటి, గుండ్లులాటి జాకాలతోటి ఎప్పటో పూర్వకాలపుమనిషిలాగ ముస్తాబవుతారు. చిలక్కు చిలకలాగ తయారవాలె. గోరింకకు గోరింకలాగ తయారవాలె.

వకుళ:—చాల్లే. ఇక ప్రసంగం కట్టిపెట్టు.

రాగం:—చిత్తం.

వకుళ:—రాగం! నాకేమో భయంగావుందే.

రాగం:—కాదమ్మా! మరి. మొదటిదివసం కదూ. నాకూ మొదటినాడు (సిగ్గు నభినయించుచు) అపరిమితమైన భయం వేసిందమ్మా. రెండవనాటికి సగం నయం. మూడవనాటికి నిర్భయం. ఆ తరువాత స్వయం.

వకుళ:—ఉండూ. ఏదో కాలిజోడు చప్పుడవుతూ వుంది.

రాగం:—అవునమ్మాయి.

ప్ర॥ (చటచట) దివాకరరావు.

[వకుళ, దాసివెనుక దాగబోవును. దాసి తప్పించుకుపోయి గదికిపైన గొళ్లెము వేయును.]

దివా:—(వకుళమాలను చూడకయే పోయి మంచమున పవళించును)

వకుళ:—[భయవిభ్రమములతో దివాకరరావును జూచి నిట్టూర్పు వదలును. పదునైదు నిమిషములైనను దివాకరరావు కదలడు పడుకున్నవానివలె నటించును. వకుళకు భయము విభ్రాంతి. చెమర్చును.]

(తనలో) ఎంత మూర్ఖత్వము. (నిట్టూర్పు) నేను ముందు పలుకరింపవలెననియా వుద్దేశము... లజ్జా విహీనురాలనై నేనే పలుకరింపవలెనా ముందు! ఇంతవరకు నిలచియున్నను శ్రీగంటనయిన నను జూడకుండెను గదా... మగవారికింత పంతముండగునా? యుక్తాయుక్తముల విచారింపరా? ఆడుదానను, మొదటిదినమున నేమని పోయి 'నాథా! నేను వచ్చితి...' నని ప్రార్థించవలెను. ఎంత అసంభవము. ఎంత నీచత. ఎంత రోత... పలుకరింపకున్న నేమగునో. 'ఆడుదానికింత పట్టా' అను నేమో! ఇందువల్ల మరింత మూర్ఖత వాటిల్లునేమో. అవును యిదియును నిజమే. ఏది ఎటులున్నను మగవానికి స్త్రీ లోకువ. వారిపంతము నెగ్గునుగాని స్త్రీలపంతము నెగ్గుట అరుదు. ఇప్పుడు పలుకరింపకున్నచో నాపై నిర్లక్ష్య మెక్కువగు నేమో. లేనిపోని అంతఃకలహములకు చోటిచ్చిన దాననౌదు నేమో...

ఏమయినను పలుకరించుట తప్పనట్లు తోచుచున్నది. లజ్జా విహీనురాలనైయ్యే పోయి పలుకరించవలెను... (రెండడుగులు ముందునకు బెట్టి. ఆగి, పోలేక మరి మూడడుగులు వెనుకకు పెట్టును)... ఛీ.ఛీ. నే పోజాలను. కానున్న దేమయిన కానిమ్ము. సిగ్గు విడచి నే నేమని పోయి పలుకరింతును? అతను పలుకకున్న—నగు బాట్లు, అప్రతిష్ట. అయ్యో! ఏమి చేయుటకును తోచకున్నది. అనురాగము ముందు కీడ్వ సిగ్గు వెనుకకు లాగుచున్నది. ఇందున కుపక్రియ యేమైన నుండునా!

(ఆలోచించి) అయిన నీవిధముగ జూచెద.

(ప్రకాశముగా) అబ్బబ్బా. తేలు. తేలు. కుట్టింది. రాగం! రామ. ఎక్కుతూవుంటే విషం (దినాకరరావు నోరకంట చూచుచునే)... బాధ. బాధ.

(తేలుకుట్టినట్లు అభినయించును.)

దినా:—(వకుళను చూడకుండనే. యధోక్తిగా) ఎందుకట్టిలకుగూడ తేలుకుట్టునా.?

వకుళ:—(యధోక్తిగా) ఎందుకట్టెవరు?

దినా:—(యధోక్తిగా). విన్నవారే.

వకుళ:—(గగుర్పాటు)... ఎందుకట్టె నెటుల పెండ్లి చేసుకుంటిరి?

దినా:—(యధోక్తిగా) చూడకయే.

వకుళ:—వినలేదా?

దినా:—(యధోక్తిగా) వినలేదు? వింటిని.

వకుళ:—(యధోక్తిగా) ధనాశనా!

దినా:—(యధోక్తిగా) ఆహా. అదీ నిజమే.

వకుళ:—(యధోక్తిగా) ధనమేనా ప్రేమకు సోపానము.

దినా.—(యధోక్తిగా. కోపమున). అధిక ప్రసంగము వలదు. నాకు తెలియదు. నీతండ్రి నడుగుము. నా తాత నడుగుము.

(ప్ర॥ నలుగురైదుగురు దాసీలు.

దాసీలు:—ఏమమ్మా! సంగతేమిటి?

ఒకదాసి:—ఎక్కడమ్మా! కుట్టింది.

వకుళ:—ఇక్కడే... ఇక్కడే... (కాలి బొటన వ్రేలిని చేతితో చూపును. ఒకమారు ఒకచోటు చూపును. రెండవమారు యింకొకచోటు చూపును.)

ఒకదాసి:—ఏమిటమ్మా! ఇక్కడోకమారు చూపుతావు. ఇంకొకమారు యింకొకచోటు చూపుతావు...

ఇంకొకదాసి:— (తేలుకై వెదకుచు) ఏదమ్మా ఎక్కడా కనుపించదే ముండా తేలు!

దినా:— (యధోక్తిగా) దొంగతేలు, యింకెలా కుట్టుంది?

వకుళ:—(యధోక్తిగా) నిజంతేలు, హృదయంలో నే కుట్టింది.. (నిట్టూర్పు)...అబ్బా. ఇక్కడనుంచి నన్ను తీసుకుపొండే. [నిష్క్రమించును.

రంగము ౨.

అదే శయనమందిరము.

(ప్ర॥ వకుళమాల (విచారములో)

వకుళ:—(తనలో) మొదటిరాత్రి ముచ్చటలం.

ముద్దుగా గడిచిపోయినవి. ఇది రెండవరాత్రి... పాడు స్త్రీజన్మం ఎత్తేకన్న పశువై పుట్టే చాలా మంచిది. ధనమును చూసి పెండ్లి చేసుకునేవాళ్లు కొంతమంది... దాబును చూసి పెండ్లి చేసుకునే వాళ్ళు కొంతమంది...ఇదుగో జోళ్లచప్పుడు. ఇవాళ ఏ గ్రంథం వ్రాసి పెట్టాడో భగవంతుడు.

ప్ర॥ దివాకరరావు దాసీదానితో (దాసిదాని భుజమున చేయివేసుకుని జాయింటుగా నడుస్తూ.)

వకుళ:—(పెద్ద నిట్టూర్పు)

దాసి:—(దివాకరరావు చేయిని తన భుజంమీద నుండి తొలగించఁ బోవును.)

దివా:—(బలవంతమున చేతిని దాసి భుజాన్ని మోపి) ఏమిటి భయం! (దాసీని దగ్గరకు లాగును.)

దాసి:—(మెల్లగా) వుండండి. అమ్మగారున్నారు.

దివా:—(గట్టిగా) అమ్మగారెవరు. నేను అయ్యగారిని. నీవు అమ్మగారువు. (వకుళను చూపుచు) అది నీదాసి...ఏదీ పిలువు. "వకుళముండా! దాసీముండా! యిలారావే" అని.

దాసి:—(భయపడును.)

దివా:—పిలువు నీకు భయమేమిటి? నేను వున్నానుగా (ముద్దుపెట్టుకుని, బలవంతపెట్టును.)

దాసి:—(సన్నని గొంతుకతో) వకుళముండా దాసీముండా. ఇలారా.

వకుళ:—(నిలువున నీరగును)

దివా:—శబాష్. ఏదీ ముద్దు (ముద్దు పెట్టుకొనును)

వకుళ:—(తెరిపిలేని కన్నీటితో తనలో) నేటికిట్టి మాట వినుటకని కలనైన నెఱుగనైతిని. తుచ్ఛదాసి నామగని ప్రాపుగొని నన్నీవిధి పరిహసింప నెటుల సజీవినై యుంటినో తెలియకున్నది. ఔరా కాలమహిమ. నాకూడు దినినా కూడిగములు చేయు దాసిదానికా నేను దాసినీ? గ్రుడ్డుపోయి పిల్లను వెక్కిరించెనను సామెత నేటికి స్థిరపడినది కదా...ఛీ. దీని నూరక ఏల నిందింపవలెను. అనిపించినవారి ననవలెను. అగ్నిసాక్షిగ పెండ్లాడి నన్ను, 'వకుళముండా' అని తుచ్ఛదాసిచే పిలిపించి మురియుచున్న అమహా పత్త ననవలెను. ఇట్టి దయాశూన్యులగు పతులు ప్రపంచమున నుందురా? నాపరాధము తన పరాధము కాదా? దయ, ప్రేమ, ధనాశలగు పతులకుండేల యుండును?

దివా:—(వకుళ నుద్దేశించి) ఓయి. తెలసివదా. ఇదుగో విసనకఱ్ఱ.

వకుళ:—(తనలో ఛీ. ఇట్టిచోట మననుండరాదు. [తలుపుతీసుకొని పోబోవును.]

దివా:—(చేయిపట్టి లోనికీడ్చి) ఎక్కడికి పోయేది. ముందు విసరి మాట్లాడు.

వకుళ:—ఏటి నిర్బంధము.

దివా:—నిర్బంధమో. సద్బంధమో మాకు తెలియదు. ముందు విసిరి మాట్లాడు...(దాసితో) ఏమి పూరుకుంటావేమి, పోతూవుంటే. ముందు విసరమను.

దాసి:—(విసనకఱ్ఱ వకుళ కందించును.)

వకుళ:—(పీవన జారవిడచి)...రాగం! పుష్పం! సరోజనీ!

ప్ర॥ నలుగురైదుగురు దాసీలు.

వకుళ:—(దివాకరుని కౌగిలిలో వున్న దాసీని చూపుచు.) ఇదుగో. దానినీడ్చి మన బంగాళా కవతలకు పారద్రోలుడు. ఇది నాఆజ్ఞ.

దివా:—(పెద్ద నవ్వు నవ్వి) "నీ ఆజ్ఞ!" అహోహ. నీఆజ్ఞగా! (దాసీల నుద్దేశించి) ఇదుగో మీకే చెప్పడం. దీని (వకుళను చూపుతూ) కేమన్నా సహాయం చేశారంటే మీబుఱ్ఱలు చితుకపోడుస్తాను. ఇలారండి మనకుంతా వొకటి. అది మన మెట్లా చెబితే అట్లా పడుండాలె.

దాసీలు:—(ఒకరిమొగము నింకొకరు జూచుకొందురు. దివాకరరావును చేరుదురు.)

వకుళ:—(దుఃఖమున) ఇది ఏటి యోగడము!

దినా:—ఇది ఏమి వాగడము. నీవేమన్నను నీ తండ్రి కాస్తా బుద్ధంగుమను వరకును. వేచియుండవలెను. (దాసీలతో) ప్రస్తుతము దీనిని పోనీయకుడు. కట్టి పడవేయుడు.

దాసీలు:—(అటుల చేయుదురు.)

దినా:—(కూడవారికి సహాయపడును.)

[తెరవ్రాలును.

## రంగము 3.

### ఒకహాలు.

[తెరఎత్తగా కూరమాంబ (వకుళతల్లి ఏబదిసంవత్సరముల బడిమునలిది) మంచమున కూర్చుండి యుండును. చెంత వకుళమాల విచారమున కూర్చుండి యుండును.]

వకుళ:—అమ్మా భరింపరాని వేదన.

కూర:—ఎవరిది.

వకుళ;—మనది.

కూర:—నీదేమో నాదికాదు!

వకుళ:—అవును నాదే. ఇచ్చినది మీరు అనుభవించునది నేను!

కూర:—(కొంచెము విసుగుతో) మేము యిచ్చిందేమిటి నీవు అనుభవించేదేమిటి.

వకుళ:—ప్రేమలేని మగనిని మీరు చేకూర్చితిరి. భరింపలేక నేను అనుభవించుచుంటిని.

కూర:—(కోపముతో) ఏమి! భర్తను భరింపలేని దాని నిన్నొక్కతెనే చూసినాను. దొరక్క దొరక్క దొరికితే వున్న భూములంతా వ్రాసి యిచ్చి కుదిర్చాము.

వకుళ:—ఇట్టి వివాహముకన్న వూరుకున్న వుత్తమముకదా!

కూర:—ఇప్పు డేమివచ్చింది లోటు?

వకుళ:—అమ్మా కోప పడకుము. లోటే. తల చితుకని పోటే. చనికిరాని పోటే అయినది నా బ్రతుకు.

కూర:—నీబ్రతుకేమిటి నాబ్రతుకూ అట్లాగే ఏడుస్తూవుంది.

వకుళ:—నీబ్రతుకు కేమమ్మా.

కూర:—నీబ్రతుకు కేమొచ్చిందమ్మా అయితే. వేలకువేలు కట్నంపెట్టి, వున్నదంతా ఊడ్చిపెట్టి, జమీఅంతా వ్రాసిపెట్టి పెండ్లిచేస్తే ఏమిటి యిట్లా వగలు గుడుస్తావు?

వకుళ:—కోరి వురి తెచ్చుకున్నట్లయినది.

కూర:—(కోపముతో) ఎవరికి వురి.

వకుళ.—నాకే నాకంఠానికే! బిగిసుకుంది—పెండ్లి త్రాడు!!

కూర:—అయితే ఏమంటావు. పెండ్లి చెయ్యకుండావుంటే వైరాగిముండలాగ వుండివుందునంటావా ఏమిటి.

వకుళ:—ఆబ్రతుకన్నా కొంతనయమే ప్రేమలేని మగనితో కాపురం చేసేదానికన్న!

కూర:—చంపేస్తున్నావేమిటి?

వకుళ:—మీతో నాలుగుమాటలు చెప్పడానికే వచ్చితిని. కడసారి మాటలవి.

అమ్మా! పెద్దలగు మిమ్మ దూషింపరాదు. మీరు నా పెండ్లి విషయములో మహా ఘోరమొనరించితిరి. ప్రేమలేని వరునకిచ్చి నాకు ప్రళయాంతకము గల్పించితిరి. అనురాగములేని సంసారమెటుల వృద్ధినొందునా అను తలంపు మీకు లేదయ్యెను. ఎవరినో తీసుకునివచ్చి పెండ్లిచేయుట యా ప్రధానము? కన్నులమూసి గంపనెత్తిని పెట్టుటయా ప్రపంచధర్మము? శాస్త్రసమ్మత వివాహమున సరిగకొంగులు ముడిపెట్టుటతో నా సరిపోవును? వరు డెట్టివాడో ఎట్టి సుగుణసాంప్రదాయుడో వధువుకు తెలియదు. వధువు ఎట్టిదియో, రూపవతియో, కురూపియో, సుగుణవతియో, మనోజ్ఞయో వరునకు తెలియదు. ముడిపెట్టుటయే ప్రధానమని మాకు ముడి పెట్టితిరి.

అందున గల్గు పర్యవసానము నాలోచింపరైరి. ఇది మంచి ఇది చెడ్డ యను విచారణ మీకు లేకయ్యెను. 'దున్నపోతు యీనినదన దూడనుగట్టు' అను సామెతగ జేసితిరి వైవాహిక విషయమును, గంపమూగి పేరమాడు పండ్ల పేరము లయినవి యీనాటి పెండ్లి పేరములు. ధనము నాశించి వచ్చు వరులు, పొలముల వ్రాసియిమ్మని పీకు పెండ్లికొడుకులు, సమభాగములకై మామల నిర్బంధపెట్టు అల్లుండ్రు, దయాశూన్యులగు పతులు,... చెలరేగి, దయ, అంతరంగిక ప్రేమ, అనురాగము, అన్యోన్యత, మొదలుగాగల సౌరభ్యముల దెగటార్చి దేశమునకే గాక లోకమున కంతయూ నపకీర్తి సంఘటిల్ల జేయుచున్నారు.

కూర:—ఏమిటీ గోల!

వకుళ:—గోల కేమున్నది? ఇది జరుగుచున్న సంగతి. (మొలలో దాచిన బాకుతీయును)

కూర:—ఏమే. అదేమిటి... బాకెందుకు... నన్ను పొడుస్తావా ఏమిటి... (వణుకు)...

ప్ర॥ దాసి

[వకుళ పొడుచుకొనబోవగా దాసి ఆపును. వారికి బాకుకై పెనుగులాట. తెరలో పెద్దమ్మగారి పని అయిపోయిందని కేకలు.]

ప్ర॥ దివాకరరావు.

దివా:—(దాసీని విడిపించి తాను వకుళతో బాకు లాగ పెనుగులాడును. పెనుగులాటలో దివాకరునికి గాయముతగిలి క్రిందపడును... బాకు క్రింద పడును.)

వకుళ:—ఆ! ఆ! ఆ దెబ్బ మీకు తగిలినదా... ఇదుగో నేను గూడ మిమ్ముల ననుసరించుచున్నాను. ఆగుడు.

[బాకు నందుకొని తాను పొడుచుకుని నేల గూలును.]

కూర:—(కన్నీటితో) దాసీ యిదేమి ప్రారబ్ధమే?

రాగం:—అమ్మా! ప్రేమలేని పెండ్లి ప్రాణాంతక మని తెలియదా!

[తెర వ్రాలును.]

## గగనగామి

శ్రీమతి కూచి బాలాత్రిపురసుందరిగారు

గగనగమనానురక్తిపై కెగయునపుడు
సోకజొచ్చెను శబ్దంబు శ్రవణములకు
లోకబంధంపుతెగత్రెంపుమ్రోతలేమొ?
బరువుకాజొచ్చెదేహంబుపైకెగయుకొలది
భవబంధబంధితంబగుటనేమొ?
ఎట్టకేలకుజేరితినెగిరిఎగిరి
అఖిలసౌఖ్యప్రదమైననభ్రతలము.
అక్షతిమిరంబునలుదెసలలముకొనిన
అవనిజూడగనాకధమముగదోచె.
మధ్యనున్నట్టిమేఘమండలముజూడ
మహినిగప్పినమాయజాలంబువోలె
గోచరించెను గగనగామికి నాకు.
గ్రోలితిని నేనుగంధర్వగానరసము
ఆనితిని నేనుఅమరులఅమృతపాత్ర
విహరించునపుడేను వియత్తలమునందు
మొలచుచున్నట్టితారకల్ ముదముగూర్ప.

# పికోక్తులు

తుమ్మలపల్లి వేంకటరత్నము పంతులుగారు

నీకున్ వర్షపుగాలితాకునకటన్ నిల్పోపరాదయ్యెనో?
నీకున్ విస్మృతియయ్యెనో? యిచటి నీనిత్యోల్లసన్మంజరీ
ప్రాకట్యోరు వసంతకాలసహకారస్యందనారోహముల్,
మాకందాంకురభోజనంబులు, లసన్మందారమారందముల్॥

2. అనిలములన్ విలీనదశనందు మనుచ్ఛ్వసనంబులింతలో
ననె, మఱపయ్యెనే? యకట! నన్ గికురించియిఁ కేడ కేని నీ
చనెడి ప్రసక్తి నే నెఱుఁగజాలితి నేమియుఁ బోలునోవమిన్,
నినుఁ‘గడసారి నన్నుఁగననిమ్మ’ని కోరుచునుంటి, నర్మిలిన్॥

3. ఖగమా! నీదు తనూవినీలిమయు; మున్ గ్రైరాతబాణాగ్ని నీ
మొగమం దేర్పడినట్టి మ్లానిమయు; నిన్నుంజూచి, యీనేను తో
ల్తఁగడాసించితి—నీసదాపరిచితిన్ లావెక్క—వాల్లభ్యపుఁ
బిగిలో శ్యామలవర్ణ మేమయినదో? పెన్మచ్చయొం దేగనో॥

4. తిర్యగ్యోనివి—నీకునెక్కడివి? బుద్ధిస్థైర్యముల్; మాధురీ
ధుర్యంబైన పదార్థమబ్బిన మఱెందున్నిల్తువా సక్తివై,
ఆర్యబ్రాహ్మణజాతివాఁడనయి, నీకాసించు టేయొక్కదు
ష్కార్యంబయ్యెను, నాకు—నిన్నుమటతోఁ గార్యంబు లేదేమియున్॥

5. తొలి, నీ కాఁజేరఁగఁదీయునప్పుడు, భవత్త్రోటీపుటీ కుట్టనం
బులచే, నాదుప్రకోష్ఠమందగు క్షతంబుల్ మాసిపోవిప్పుడున్
నిలుచున్ లెమ్మివి, నీవుమాత్ర మెట కేనిం బోయినన్ నీపయిన్
మలచుఁ నాతలఁపుల్ ప్రతిక్షణము, నామచ్చల్విలోకించినన్॥

6 ఇదిగో: నీదౌపీడుకోలుకోల కిం దేర్పడ్డసామగ్రియే
కొదువల్ లేనటునంటి పద్యమిదె! నీకున్, బల్లవచ్ఛేదమి
ల్లిదె: బాష్పోదకకీలితాంజలియిదే! ఇం కేదినీకిష్టమో?
కొదుకంగాఁబని లేదు, వేడ్క—మెయిఁగైకో! మ్మో విహంగాంగనా॥

# ఖండితోపన్యాసము (కర్టెన్‌లెక్చరు)

శ్రీమతి యస్. అనసూయా దేవిగారు

ఏమండోయ్! ఇంకా లేవరే, తెల్లవారింది. ఆరుగంటలు వెయ్యబోతున్నారు. చదువుకోవాలనీ, పరీక్షలు దగ్గరకువచ్చాయనీ, అన్నారుగా? రాత్రి ప్రొద్దుపోయివచ్చారేం? చీట్లాటలో పేచీలొచ్చేయా యేమిటి?

"Shutup (షటప్) ఒళ్లుపొగరెక్కిందా యేమిటి? నా Studies (స్టడీస్) సంగతి నీకెందుకూ? ఈ ప్రశ్నలన్నీ నీకనవసరం, జాగ్రత్త! తన్నులు తినేవు, చదువుకోండి చదువుకోండని గజ్జికురుపు నలిపినట్లు సలుపుచున్నావే? మీకు కావలసినవల్లా వంటిల్లూ, పొయ్యేగాని, యీ విషయాలన్నీ యెందుకూ, తెల్లవారగానే నాచేత నీకీతిక్లెందుకూ?" అంటున్నారా?

అవును. కొట్టరాకండి. బుద్ధి పొరపాటు. మీరింతదరిపడితే నేను చెప్పలేనుగానీ రాత్రి నేను అంతప్రొద్దు పోయేవరకూ వక్కరినీ వున్నానుగదా? మీరు యేవేళకూ రాకపోతే యిల్లేమైపోతుందనుకున్నారు చెప్పండి? ఏమిటా పేకాట. ఒళ్ళుగుల్లా, యిల్లుగుల్లా ఇక్కడీ కాపురం మీచదువుకా పేకాట్లకా? ఇప్పుడు లేవడానికిన్ని చదవడానికిన్ని బద్ధకిస్తున్నారే! ఆపాడుసిగరెట్టు ముట్టించడానికి బద్ధకంయెట్లా లేకపోయిందో! ఏమైనా అంటే సిగరెట్టుమీద దండకాలు చదువుతారు కూడానూ.

"నోరు ముయ్యమన్నా, బుద్ధిలేదేం? ఏమిటా పొగరూ, దెబ్బలుకావాలా, యిప్పటికైనా నోరుమూస్తావా? లేదా? Be-careful (బి కేర్ ఫుల్)" అంటున్నారా?

ఏమండోయ్! నేనన్నదానిలో యేమైనా తప్పుంటే నన్ను మీ యెడంకాలు చెప్పుతో కొట్టినా పడతాను. ఆసినీమాలలో, మాటా, పలుకా! ఏమి టామమకారం? రూపాయలకు రూపాయలుదానికి పోస్తున్నారే! మొన్ననాకు తెలియనీయకుండా, యిదిగో మా Friend (ఫ్రెండు) యింటికి వెళ్లి యేదో వ్రాసుకోవాలని వంకపెట్టి నాటకానికి దయచేసి నిద్రచెడగొట్టుకుంటేనేగా, యీ ఘడియవరకూ జ్వరంపీల్చి పిప్పిచేసింది. ఎటొచ్చీ నిన్నా యివ్వాళానూ మీముఖం కాస్త తేటుగా కనబడుతుంట. ఇవన్నీ కూడబెట్టనా, గుడ్డెట్టనా? యెందుకీ ఖర్చులన్నీ?

"ఆ! ఏమిటి! ప్రొద్దున్నే లేస్తూ నీకిదా వుద్యోగం? చాలు. ఆడుపుట్టుకవంటి ఛండాలం పుట్టుక యీ ప్రపంచంలో యింకొటిలేదు. నీకేమి తెలుసు నీసిగరెట్టు సంగతి? తెలిసీ తెలియని ప్రేలాపనప్రేలకు" అంటున్నారా?

కాదూ మరీ! ప్రపంచమంతా మీలాంటి మొగాళ్లతోటే వుందని మీయభిప్రాయం. పోనీకాని నామాటలకు సమాధానం చెప్పండి? "పొరుగింటి పుల్లకూర రుచట" నేను కాఫీని కాచనా? కావలిస్తే ఫలహారం చెయ్యనా? రోజూ ఆకాఫీహోటల్సుకెందుకా డబ్బు తగులపెట్టడం? మన దర్జాకులోటనా కనపడిన స్నేహితునల్లా తీసికొని వెళ్ళి కాఫీ హోటల్సులో మేపుతారు? అయ్యో, డబ్బా!

డబ్బుచేసికొన్న పాపం యేమిటోకాని దుర వస్థవచ్చిందే. ఎన్నాళ్ళు, సంసారం యీలా తగులపడిపోతూంటే చూస్తూ కూర్చునేది! కాని, పాపం ఏమాటకామాటే చెప్పుకో వాలిలెండి. నేనడుగకముందే పువ్వులు, ఖరీ దైన చీరలుకొని పెడుతున్నారు. నగలు కూడ చేయిస్తూనేయున్నారు. మాకు కావలసినవే యివి. మొగవాళ్ళకు విద్య నగలైతే మాకు బంగారపునగలు. కాని యీఖర్చంతా యేమిటి? మీతల్లిదండ్రులు యెట్లా సంపాదించి పంపుతున్నారో! అనారా యణమూర్తికి తెలియాలి. శనివారాదివారా లొస్తే యిల్లేపట్టరే! డబ్బెట్టి పేకాటలూ-బ్రాందిషాపులూ, యెక్కువైతే యింక డబ్బెక్కడాగుతుందీ!

"అదిగో! డాబ్బా. ఏమిటీ (Lecture) లెక్చరూ? ఇవన్నీ నీకు యెవరు చెప్పడం, నాప్రాణాలు తీయడానికి? కాఫీహోటల్సులో శుభ్రం మనయింటికంటె తక్కువే కావచ్చు గాని, ఆపదార్థాలు అక్కడ తయారైతేనే రుచి, ఆహాహా! ఏమిరుచండి తలుచుకుంటే! చూడూ, ఎన్నినీక్యూరామో నానోట్లో, స్టూడెంట్సు (Students) సినీమాలకు వెళ్లినందు వల్లనేగా, రినూ, వాకిజనరల్ నాలెడ్జి(General-knowledge) ఇంప్రువు (Improve) కావడం, ఇంగ్లీషు (English) ఇంప్రువు (Improve) కావ డానికి స్కోపు (Scope) కలుగచెయ్యడం. చెప్పాలంటే అన్నిటికీ అన్ని సమాధానా లున్నాయి. ఎందుకు నన్నిల్లా ప్రాణాలు తీస్తావు. వెళ్లు నీపని నీవు చూచుకో?" అంటు న్నారా?

అవును! ఏమైనాఅంటే ప్రాణాలు తీశావంటారు. అంటే చెప్పలేనుగానీ, చదివే క్లాసు యెన్నేళ్ళుతప్పినా, జీతాలు చెల్లించ డం తప్పదుగదా? ప్యాసవుతారనే ఆశతోటి, బంట్రోతులవద్దనుంచి, మాష్టర్లవరకూ లం చాలు తప్పవుగదా? కష్టపడి చదువుతే యిటు వంటి ఖర్చులేమీవుండవుగా? ఖర్చు యెటు చూచినా జల వూరినట్లూరుతోందే! మొన్న నన్ను చల్లగా టోపీవేసి, డబ్బు తీసికొని వెళ్లి, పరీక్షపేపర్లు అమ్మిస్తే, అవికొని, తీరా, అవే చదువుకు వెళ్లేసరికి, దగాపడినందువల్లేట గా నిరిటి పరీక్షనున్న చుట్టడం. ఇంకా ఆ ర హస్యం నాకు చెప్పనేలేదే? సరే ఇంక యేపాటుతప్పినా సాపాటు తప్పదుగదా! దాని ఖర్చు దానికి తప్పదు. అందులో ఖర్చు తగ్గించుకుందామన్నా కుదరదు. ముప్పొద్దూ కూరలేనిదే ముద్దదిగదుగా? కూరలేకపోతే కొట్టరావడం. ఆకోపం, యేమికోపమోగాని మీకే వుందో లేక మనిషైన ప్రతివానికీ వుందో గాని, తల్లయినదీ, తండ్రయినదీ, మరెవరైనదీ కూడా తెలియదేమండీ! ఒక్క-పూట కూరలేకపోతే నానాహంగామా చేస్తారే యిల్లంతా! అందులో చవుక కూర లంటే దర్జాకులోటుగా మనకి! "వెలిగినన్నా ళ్లేవెయ్యరా వెండికాగడా" అన్నారు. జరి పించుకోండి, జరిగినన్నాళ్లు. ఇంకొకచోటకు పోతే యివన్ని సాగుతాయూ ఏమిటి?

"నిలువు! ప్రాణాలు తీస్తున్నావు. నీవేమైనా ఆర్చేదానవా తీర్చేదానవా ఎందుకూ నీకీ

కంఠశోష. నీవరుసచూస్తే యేమీ బాగుండ లేదు. భర్తమాట అడుగుదాటనా, భార్య" అంటున్నారా?

కాదటండీమరీ! పాపం!మీతల్లిదండ్రులు, భూములు ఒక సెంటుకూడా లేకపోయినా, యేదోవిధంగా కష్టపడి సంపాదించి ముద్దుల కొడుకు మనకొక్కడేకదా, పొరుగూరిలో చదువుచున్నాడు, డబ్బు పంపకపోతే, యేమి దిక్కుపడ్తాడోఅని నెలకు పలభైలు యేభైలు పంపడం—మీరీవిధంగా నాశనంచెయ్యడం!! పాపం మీతల్లిదండ్రుల కివన్నీ యేలా తెలుస్తాయ్? వారేమో మాఅబ్బాయి కష్టపడి చదువుచున్నాడమ్మా, ఏదో యీసంవత్సరం, క్రిందటిసంవత్సరం పరీక్షపోయిందంటే మామూవాడిలో టేమీలేదు. ఆమాష్టర్ల పక్షపాతబుద్ధి. ఎట్లాచ్చీ, గీటుమంచిది కావాలి."అని చెప్పుకుంటున్నారు. చూశారా, మీరు వారిమాట విన్నావినకపోయినా ఎట్లావున్నా మీయందు వారికి యెంత అభిమానముందో! స్కూలుకేనాడో ఋణమున్నారు. చెల్లించండి కిస్తీలపై కిస్తీలు, మీ స్నేహితులూమీరూ? అన్నన్నిమాటలను కుంటూవుంటారే, డబ్బు ఖర్చు తగ్గించుకోవాలని అనుకోరేం యెప్పుడూను? ఇటువంటిఖర్చు లందరికీకూడా యిష్టమైయే వుండొచ్చు!

"ఏమిటి? ఓహోహో! చివరకు నీపని ముదురుతోందే వూరుకున్నకొద్దీ?పో! నాదగ్గరలే! నీవా—నాకా—చెప్పటం' పో! నీపని నీవు చూచుకో— ఓ చదువురానిమొద్దూ నీకు మర్యాదా, మంచీ, మాట్లాడేవరుసా వావీ, యేమీ తెలియదు. ఇదంతా అక్షరం ముక్కరానిలోటు! స్పష్టంగా తెలుస్తోంది, నేర్చుకో రాదూ— చదువునేర్పుతాను'. అంటున్నారా?

ఆహాహా! మీరు చెప్పటం, నేను నేర్చుకోటం. ఎల్లుండి దీపాటికి పురాణాలన్నిటికీ అర్థంచెప్పినానన్న మాటే!

"ఏమిటి? ఏం? వేళాకోళం అనుకున్నావా యేమిటి? వెళ్లు, యెవరో పిలుస్తున్నారు" అంటున్నారా? సరే!

ఇక దయచెయ్యండి?

---

## స్త్రీవిద్య

శ్రీమతి పీరుబొట్ల రామలక్ష్మమ్మగారు

పుడమియందున గొందరు పొలతుకలకు
విద్య జెప్పింపరాదంచు వెఱ్ఱిమొఱ్ఱి
వాదముల జేయుచుందు. రవ్వారి బుద్ధి
జాడ్యమేమని కట్ట! ప్రశంసజేతు.

ఎంచ నొకగర్భమందె జన్మించినట్టి
పురుషులే విద్యలన్నిటిఁ గఱచుటకును
స్త్రీలు నేర్వంగరాదని చెప్పుటకును
బాపురే! మేముచేసిన పాపమేమొ?

మొల్ల తరిగొండ వెంకమ్మ మున్నగగల
సతులు విద్యలనేర్వరే క్షితినివారి
కేమినాటిల్లె నపయశం? బిపుడుమాకు
నాటిలునదేమి సోదర వర్యులార?

బ్రహ్మనుంగాక యాలని పత్నియైన
వాణినే విద్యలకు నధిష్ఠానదేవ
తగ; వచింపఁగ బడుట విద్యలను సతుల
కుంగలుగుహక్కు వేరుగా గొనరవలెన!

# సవతి తల్లిప్రేమ

శ్రీమతి పి. శేషమ్మగారు

౧

కాకినాడయందుఁగల న్యాయవాదులలో నారాయణరావుగారును యెన్నికగన్నవారు. మంచివారనియు, పరమశాంతులనియు, ఉదారహృదయులనియు వీరు పేరుగాంచిరి. చాల ఆస్తిగణించిరి. ధనమునార్జించిరి. మొన్న మొన్నటి దనుకను బహుఆనందముతో జీవయాత్రగడుపుచుండిరి. కాని యెల్లప్పుడును మానవుని జీవితము ఒక్కరీతిని నడచుట దుర్లభముగదా! పేరునకు దగినరూపము—రూపమునకు దగినపేరు, రూపమునకూ పేరునకూ దగిన సుగుణసంపత్తి గలిగి, కాలధర్మమునొందిన సుందరియను నాతని ప్రథమకళత్రవియోగముతోనే నారాయణరావుజీవితవాహినియు వక్రగతికి రాఁదొడంగినది. విమల యనునది సుందరికిఁదనయ. నారాయణుని జీవితసర్వస్వమిపుడాబాలికయే. సుందరిసహధర్మచారిణీత్వమును మఱువజాలని యతని మానసికప్రపంచము నావరించిన గాఢాంధకారము విరియింప విమలయే యిపుడు దివ్యజ్యోతియైయున్నది. ఇంటనున్నపుడొకనిముసమేనియు విమలను విడువకఁ దనచెంగట నునిచికొనుట—కార్యాంతరముల నిలువెడలినని యపుడెల్లను విమలవిషయమునే తలంచుచుండుట—నారాయణరావున కలవాటు. వేయేల! నారాయణరావు ప్రాణములే విమలస్వరూపమని చెప్పుట యతిశయోక్తికాఁజాలదు. సుందరీవియోగము విమలసంరక్షణము—ఈరెండును అతని హృదయగ్రంథిఁ బెనవైచికొని చాలసంకటములఁ గల్పించి యాతని జీవితమంతయు దుఃఖమయముగావింప నారంభించెను. ప్రేమ మిక్కటముగ నున్నచోటఁ గీడును శంకించుట సహజము. విమలను విడిచి పరోక్షమున నున్నపుడెల్లను తల్లిలేనిబిడ్డ గావున నామె కెట్టి విపత్తుగలిగెనో యని నారాయణరావు చింతించుచుండును. మనమెంతచింతించి యేమిచేయఁగలము? సర్వరక్షకుఁడగు పరమేశ్వరుని విధానమెట్లున్నదో అటుల జరిగితీరును. కపటనాటకసూత్రధారియగు నాతఁ డేకర్మము జేసికొన్నవాని నాఫలము ననుభవింప నియమించియుండ నన్యథాప్రవర్తించుటెట్లు? నారాయణుఁడు, విమల తనతల్లినిగుఱించి బెంగపెట్టుకొనకుండను, ఆమె కెట్టి కొఱంతయును లేకుండను, శక్తివంచనలేక సంరక్షించుచుండెను. అహోరాత్రము లామె యిష్టములనెరవేర్చుచూ, సంతసము గల్పించు మాటలుజెప్పుచు, తల్లిని మఱచునట్లు జేయుచుండెను. ద్వితీయవివాహమున నారాయణరావు కమలను భార్యగా గ్రహించుటయే, విమలవిషయమున నాతఁడతి మనఃక్లేశ బాధితుఁడగు గతిఁ గల్పించెను.

౨

కమల, కాపురమునకువచ్చి యొకసంవత్సరమైనది. విమల, యిప్పు డారేండ్ల యీడుగలది. కండ్లకలకగలవానిచూపునకు దీపమువలె కమలకు విమల యున్నచోఁ గంటగింపు ప్రారంభమయ్యెను. ఈసడించుట మెండయ్యెను. భర్తసమక్షమున విమలపై నెంతో ప్రేమనటించుట—అతని పరోక్షమున నాబిడ్డను చంపుదమనునంతటి తీవ్రభావము వహించుట, కమలకు సహజగుణములుగ మారెను. ఆవులించినఁ బ్రేవులులెక్కపెట్టు తెలివిగల నారాయణరావీటుక్కులాడి జాడలెఱుంగుటలో నొకింత యేమఱుపాటు వహించెను. అయినను విమల సంరక్షణవిషయము దలంచుకొనునపు డాతని విచారసాగరము మేరమీరుచుండెను. హృదయము నీటికెంటను బలుచనగుచుండెను. ఎట్టులైననేమి. తల్లియొక్కస్థానమునకువచ్చి నిలిచెఁగావున విమలసంరక్షణభారమున గొంత, దన ద్వితీయకళత్రముపై మోపక రావునకుఁ దప్పదయ్యెను. ఇంటినౌకర్లలో నెల్లవెంకి యనునది చిరకాలమునుండి వీరియింట నున్నది. సుందరి చిట్టచివరయూర్పువిడచుతరి యీవెంకి

చేతిలో విమలచేయిఁ బెట్టించి కన్నులుమూసెను. కమలకును నీవృద్ధపరిచారికపై నమ్మకమెక్కుడు. ఆమె యెన్నెన్నియో సంభాషణ లీదాసితోఁ జేయుచుండును. ఆసలుఁగొల్పును. వసదనము లొసంగును. రహస్యాలోచనములు సలుపుచుండును. కమల రహస్యాలోచనముల వినునప్పుడెల్లను సుందరి మందహాస వదనమున దాని మానసిక వీథిని దోచి "వెంకీ! బిడ్డను కాపాడుము" అని పలికినట్లు తోఁచుచుండును. నారాయణరావుగారి గృహమున నిపుడు "విమల" నుగూర్చిన విచారముదప్ప నొండొక్కకొఱఁత నంతయుఁగానరాదు. విమలనుగూర్చి యొక్కొక్క విచార మొక్కొక్కరిని-వారియింట నున్నవారిని-ఆవేశించియున్నది. కాలచక్ర మిట్లే పరిభ్రమించుచున్నది.

3

"నాన్నగారు రాగానే చెప్పుతాను—నన్ను కొట్టితిరిగాదూ! నాకు లక్కచిట్టి యియ్యకుండా దాచిపెట్టుకున్నారుగాదూ! అడుకుంటా కక్కియంటే తోసేశావుగాదూ! వెంకీగూడా నేను మెట్ల మీదినుండి పడిపోతుంటే పట్టుకోలేదుగాదూ! మా నాన్నగారు నాకు అన్నీ యిప్పిస్తారు. ఎప్పుడూ నన్ను రానీయకుండా దొంగమాటలు చెప్పుకుంటారు నాన్నా-కక్కి, వెంకీని, అని నేను చెప్పేస్తాను నాన్నగారితో. ఇక్కడ చూడండమ్మా! నాచేయి దోక్కుపోయింది. కక్కి నెట్టితే పడ్డానుగానూ—నెత్తురుగూడా వస్తున్నది—ఊ-ఊ-ఊ" అని విమల పంచభూతాలతో దన మొఱ చెప్పుకుంటూ చూచువారి హృదయము లవియునటుల వెక్కుచు యేడ్చుచుండెను. ఆదిక్కుమాలిన బిడ్డ నాదరించువచట నెవ్వరును లేరు. ఆమె తొక్కుపల్కులయందలి తీయదనము ననుభవించువారెవ్వరు? సుందరి లేదుగదా? కమల కీమె సవతిబిడ్డగదా? ఇట్టి యనాథశిశువులఁ గాపాడ దైవము గాక నింకెవ్వఁడున్నాఁడు? విమల యట్టులే లోలోన కుమిలికుమిలి యేడ్చుచున్నది.

అప్పటి కైదు గంటలైనది. ఎన్నిపనులుండినను అయిదుగంట లగునప్పటికి నారాయణరావు తప్పక యిల్లుసేరితీరుట అలవాటు. ఘటికాయంత్రము టంగు టంగున నైదుగంటలు కొట్టుటవిని కమల సంభాషణ ముగించి వెంకిని గృహకార్యములకు నియోగించెను. వడఁవడి విమలనుఁజూచి "తల్లీ! నీవేల యేడ్చెదవు? నీవేమి కోరెదవో చెప్పుము? ఈనిముసమున నిచ్చెదను. తోటలోనున్న పూవులుకోసి తెచ్చుకొందమా? ఏడువకమ్మా! మీ నాన్నగారు కోప్పడతారు" అనుచుఁ జేరఁదీసి యోదార్పఁజూచుచుండెను.

విమల:—కక్కీ! ఇవన్నీ దొంగమాటల్లే. అన్నీ మాయమాటలు చెప్పుతావు. నాన్నగారు రాగానే నాచేయి దోక్కుపోయిందని చెప్పుతాను" అనెను.

ఇంతలో నారాయణరావు ప్రవేశించి "నాతల్లీ! చేయి దోక్కుపోవుటేమిటి? చూపుము" అనుచు విమలను చేరఁదీసి తొడపైఁ గూర్చుండబెట్టుకొని చూచెను. ఆమె మోచేయినుండి రక్తము చెమ్మగిలుచుండెను. దానిఁగాంచి నారాయణుని కన్నుల నీరు గిఱ్ఱునదిరిగెను. విమలను ప్రశ్నించి కారణమూహించెను. ఆమెకుఁ దాను దెచ్చిన తినుబండారముల నిచ్చి యోదార్చెను. కమలనుజూచి "కమలా! ఇది నిరపరాధి. లోకమన్న నెఱుంగదు. దానియం దేవియేని లోపములుండి యవి నీకు సహింపరానివైనచో నందుకుఁదగుశిక్ష నాకొసఁగుము. దాని నేడ్పింపకు. ఎవరెన్ని విధముల నాలోచించినను దీనులరక్షింప పరమేశ్వరుఁడున్నాఁడని మఱువకుము." అని చెప్పెను. అందరు వారివారి పనులయందుఁ బ్రవేశించిరి.

4

"అంతటను బాగా వెదకితిమి. కమలాంబగారూ! పిల్లదాని జాడయేమియుఁ గానరాలేదు" అనుచు పరిచారకు లొకనాఁటి సాయంకాలము నారాయణరావుగారి భార్యతోఁ జెప్పుచుండిరి. ఆసమయముననే సరిగా రావుగా రింటికివచ్చిరి. సమాచార మేమిటని కమలను ప్రశ్నించిరి. ఆమె పెద్దగ నేడ్చుచు "నేఁటి

"మధ్యాహ్నమునుండియు మన విమల కానవచ్చుట లేదు. నగలు పెట్టించుకొని ఆడుకొనెదనని వీధిలోని కేగెను. ఇంతవఱకు నింటికి రానందున వెదకితిమి. ఎందును గానఁబడదు. వెంకియు వెదకుటకు బోయి నది. అది యింకను రాలేదు." అని చెప్పెను. నారాయణరావు నిలువునఁ గూలఁబడిపోయెను. అతనిని దుఃఖదేవత పూర్తిగ నావేశించెనని వేరుగ వివరింపఁబనిలేను. ఇంతలో వెంకియు నిఁక కొందరును ఒకగోను బట్టుకొనివచ్చిరి. ఆగోను యొక బొమ్మ తెముడుపొదక్రింద నుండెననియు నచట రక్తము స్రవించినజాడ లుండెననియు వెంకియుఁ దక్కిన వారు తెల్పిరి. వాఁడాగోనును విమల తొడిగినట్లు కమల చెప్పెను. నగలకొఱకెవ్వరో బిడ్డను జంపివైచి రని యూహించిరి. గోను దొరకిన ప్రదేశమునకుఁ బోయి నారాయణరావుగారి మిత్రులు శోధించిరి. అడుగుజాడలుగట్టి శోధింపఁజొచ్చిరి, ఏమియు ఫలములేదు. విమలకొఱకు నారాయణరావు చింతాసాగరమగ్నుఁడై విరక్తిఁగొని మంచముబట్టెను, కమలనుగూర్చి యేమేమి చెప్పవలెనో తోఁచకున్న యది, గాని వెంకిమాత్ర మానాఁటినుండియు కమలకు దాస్యముసేయ నిచ్చగొనలేదు; ఇంటనే జీవయాత్ర చెల్లించుకొనుచుండెను. ఈస్థితిలో క్రమక్రమముగ మాసములు గడచి యేండ్లు ప్రారంభించినవి.

విజయనగర కళాశాలలో యఫ్. ఏ. పరీక్షయందుత్తీర్ణలైన కన్యారత్నముల యందెల్ల సుందరి యగ్రగణ్య. ఈయమ యచట డాక్టరుగా నున్న విశ్వనాథయ్యరుగారి యభిమానపుత్రిక. ఆయనయుఁ దత్పత్ని మీనాక్షియు సుందరిని వేయికనులఁ గాపాడి పోషించుచుండిరి సౌందర్య విశేషసూచియగు "సుందరి" యను నామకరణము గూడ నామెకు వారే యొనర్చిరి. సౌందర్య, సౌశీల్య, సద్గుణ, సరస సల్లాప సమేతయగు సుందరి యందంతటనుఁ గడు నాదరము, గౌరవముగూడను. సుందరి వైదియేని గౌరవస్వతంత్ర జీవితమునందుఁ బ్రవేశపెట్టవలెనని అయ్యరుగారి యుద్దేశము. విద్యావతియు, లోకానుభవజ్ఞయు నగు సుందరియు నట్లే లోలోనఁ దలంచుచుండెను; కాని అయ్యరుగారి సంరక్షణమునందున్న యామె స్వతంత్రించుటెట్లు? అయ్యరుగారికి స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యములయెడ నభిమాన మెక్కువ. సుందరి కచట నేని యోగ్యమగు పాఠశాలయందుపాధ్యాయినీ పదవి నేర్పాటుచేసి ఆమెయొక్క యోగక్షేమములు దాను గనిపెట్టియుండి, ఆమెనొక ఆదర్శయువతీ మణిగఁ దయారుచేయ అయ్యరుగా రువ్విళులూరుచుండిరి. ఆయనకు సంతానములేదు. సుందరిని దమ ప్రాణాధికగ నయ్యరు నాయన భార్యయు ప్రేమించుచుండిరి. సుందరి విశ్లేషమును మీనాక్షమ్మ యోర్వఁజాలదు. కాని విశ్వనాథుని బోధవలన నామె సమ్మతించెను. విశ్వనాథుఁ డాయాటంకము దీఱిన యనంతరము సుందరినిగూర్చిన దన యభిప్రాయమును సజ్జనులగు తన మిత్రులతోఁ జెప్పెను. వారిలో విజయనగర కళాశాలయందలి ప్రధానోపాధ్యాయుఁ డొక్కఁడు. ఒకనాఁటి సాయంకాల మయ్యరుగారు భార్యా సహితుఁడై సుందరితోఁ బ్రసంగించుచుండ నాయుపాధ్యాయుఁ డచటికి వచ్చెను. ఆయన నుచితపీఠమున గూర్చుండఁజేసి విశ్వనాథుఁడు కొంత ప్రసంగించిన యనంతర ముపాధ్యాయుఁడు జేబునుండి యొకయుత్తరమునుదీసి అయ్యరుగారికిచ్చెను. దాని చిరునామా వ్రాతచూచి అయ్యరుగారు "సార్! ఇది మనకాంతారావు పంతులుగారు వ్రాసినది. విశేషములేమైనఁగలవా?" అనుచుఁ జదివెను. చదువడి సుందరినిఁ జూపుచు నుపాధ్యాయునితో "పంతులుగారూ! కాంతారావుగృహమన్న మాగృహమే. వారు మనకు ఆప్తులు. మాబిడ్డ వారింటనున్నను మా యింటనున్నట్లే. అభ్యంతరములేదు. సుందరియు నిందుకు సమ్మతించును." అనుచు సుందరినిజూచి "తల్లీ! పోయిననెలలో మనయింటజరిగిన గానసభల సందర్భమున కాకినాడనుండి ఇక్కడికివచ్చి పది పదునైదుదినములు మనకు అతిథులుగనుండిరే—వారే కాంతారావు పంతులుగారు—ఈజాబు వారే

వ్రాసిరి. నీవు చదువుము. సంగతులు తెలియును." అని యా జాబును సుందరిచేతి కిచ్చెను. ఆమె చదువఁ గొనసాగెను. చదివినకొలఁది సుందరిముఖమున సంతోషచిహ్నము లుదయించసాగెను. ఉపాధ్యాయుఁడు "అయ్యా! ఈలేఖ తమ యొద్దనే యుంచండి. ఆలోచించి తమ యభిప్రాయమును దెలిపిన వెంటనే నేను సిద్ధముగనుందును. సెలవుగైకొందు" నని వెడలిపోయెను.

౬

"లక్ష్మీ! సరస్వతీ! అల్లరి చేయుచున్నారు గారా? ఇక మీ అల్లరి సాగదులెండి. పంతులమ్మ గారు రాత్రిబండిలో వస్తున్నారు." అని కాంతారావుగారు కుమార్తెలను మందలించుచున్నారు. ఆయన భార్య రంగమ్మవచ్చి "రాత్రి 8 గంటల బండికేనా వారువచ్చేది? ఎంతమంది వచ్చెదరో? అయితే వంటచేసి యుంచుమందురా?" అనెను. కాంతారావు "ఔను, ఎనిమిదిగంటలబండికే వస్తారు. అక్కడ కాలేజీలో టీచరు బాబురావుతో గూడా ఆమెను యిక్కడికి పంపెదమని విశ్వనాథయ్యగారు వ్రాశారు. మనము వ్రాసినజాబు బాబురావు, డాక్టరుగారికి యిచ్చారట. బహుశా ముగ్గురో నలుగురో వస్తారు. వంట చేయవలసినదే." అని చెప్పెను. తరువాత కాంతారావుతన, కుమారుడు కమలాకరుని పిలిచి "బాబూ! రాత్రి ఎనిమిదిగంటలబండిసమయమునకు మన మోటరుకారుతో నీవు స్టేషనుకువెళ్లి, బాబూరావు వగయిరాలను తీసికొని రావలసినది. విశ్వనాథయ్యగారు వ్రాసిన జాబు చూస్తివిగదా" అనెను. కాంతారావు కాకినాడయందలి సంపన్నగృహస్థు. ఈయనకు ఆంధ్రదేశీయ, జాతీయ సంప్రదాయములయం దభిమానము. కావున విదేశీయపద్ధతులపై గాక మనజాతీయనియమములకు లోఁబడి తన కూతుండ్రగు లక్ష్మీసరస్వతులకు విద్య నభ్యసింపఁజేయ గోరియుండెను. యోగ్యురాలగు నుపాధ్యాయినినిఁ దనయింట నునిచికొని తన బిడ్డలకు విద్యఁజెప్పింపఁ దలంచి యందుకై యత్నించుచుండెను. తన యభిప్రాయమును విజయనగరమున బాబురావుగారికి వ్రాయ వారద్దానిని అయ్యరుగారి కిచ్చిరి. సుందరి అంగీకారమును బొంది విశ్వనాథయ్యగారామెకు బాబురావుగారిని తోడిచ్చి కాకినాడకు బంపుచున్నానని కాంతారావుగారికి వ్రాసెను. మనము విజయనగరమునఁ జూచిన సుందరియే కాకినాడకు కాంతారావుగారింటికి ఉపాధ్యాయినియై రానున్నది. కమలాకరుఁడు కాంతారావుగారి కుమారుఁడు. ఇతఁ డిప్పుడు న్యాయవాద (ప్లీడరు) పరీక్షకు జదువుచున్నాఁడు, కమలాకరుఁడు ఈకథ మొదటిప్రకరణములో మేము జెప్పిన న్యాయవాది నారాయణరావునకు వ్రేలువిడిచిన మేనయల్లుఁడు. బంధుగులు గావున విమలనుగూర్చిన విచార మీకాంతారావు కుటుంబమునుగూడ ఘోరదుఃఖసముద్రమున ముంచివైచెను. దానికిఁ గారణమున్నది. నారాయణరావు ప్రథమభార్య సుందరమ్మ జీవించియున్న రోజులలో విమలను కమలాకరునకిచ్చి వివాహముజేసి వియ్యమంద సుందరమ్మ—రంగమ్మలు ముచ్చటలతో మురియుచుండిరి. అది వమ్మయ్యెను. క్రమముగా విమలపేరును మఱచి అందఱును దుఃఖమువణచుకొనిరి.

౭

సుందరి, బాబురావు, ఒకదాసి, ఒకసేవకుఁడు రైలునుండి దిగిరి. కమలాకరుఁడు వీరినెదుర్కొని మోటారులోఁ గూర్చుండఁజేసి కారునడుప డ్రైవరు నాజ్ఞాపించెను. సుందరి కాభరణములులేవు. సహజసౌందర్యవతి. ఆమె సొగసుదనమును కొనితెచ్చుకొన నగత్యములేదు. బంగరుచాయమేను, గుండ్రని మొగము, సోగలైన కన్నులు, పెన్నెఱులు. చంద్రబింబమువలె నామె నెమ్మోము చూపర కాహ్లాదము గల్పించుచుండును. బాబురావుతో మాట్లాడుచుండెనే కాని కమలాకరుఁడు సుందరిని సందుసందున జూచుట విడువలేదు. బహుకాలమునాఁ డెడబాసిన ప్రాణసమమగువస్తువును గాంచినంతయానంద మా కమలాకరునకు జనించెను. కమలాకరుఁడు దనపైఁ బరగించు చూడ్కుల తాకునకు మోమించుక

వాల్చి సిగ్గున సుందరి తెలియనట్లు నటింపఁజొచ్చెను. కాని ప్రథమదర్శనమాత్రముననే నూత్న పరిచయ సంశయమును దొలంగఁ ద్రోచికొని యొండొరుల చూపులు సాహసించి సమ్మేళనము గాంచక పోలేదు. ఇది దైవికమా? కపటనాటకసూత్రధారి యగు పరమేశ్వరునకే దీని పరమార్థము తెలియవలె. ఇంతలో మోటారు కాంతారావుగృహము ముందఱ నిలిచెను. ఆ దంపతులు అతిథుల నతిగౌరవముతో నెదుర్కొని మర్యాదల గావించిరి. మఱునాఁడు బాబురావు వెడలిపోయెను. సుందరి యుపాధ్యాయిని యయ్యెను.

౫

"అన్నయ్యా! నేఁడు నీ మేనల్లుని పుట్టినరోజు పండుగ. నన్ను చంపుకున్నంత ఒట్టు— నీవూ ఒదినే తప్పక రావాలె. ఎల్లకాలము యీలా అయితే మొగవాడికి నేను ధైర్యం చెప్పగలనా? ప్రాప్తము లేదు. పోయింది. ఏండ్లు గడిచాయి. అపఖ్యాతి వచ్చిందని ఆవిడ బెంగపెట్టుకొని దిగజారసిల్లి మంచము పట్టిపోతూంది. చెట్టుబాగుంటే కాయలు కాయవా? వెఱ్ఱిమాని తప్పక మీరు రావాలె. ఈవూళ్లో నీకు నేనూ—నాకు నీవూ—తల్లితోడూ ఇంకెవరైనావున్నారా? ఇన్నేండ్లవలె కాదు. నీవు రాకపోతే నాకడుపులో చురచురకోస్తుంటుంది. మామయ్య రాలేదేమని కమలం అడుగుతాడు. నీవు వస్తానని చేతిలోచేయివేస్తే నేను వెళతా. లేకపోతే నేనుగూడా పోను. యిక్కడే పడివుంటా" అని రంగమ్మ నారాయణరావుతో ననెను. "నాతల్లీ! వి-మ-లా—అయ్యో! కాదు—కాదు—గం-గా-వ—చ్చెద. పొమ్మ. తప్పను" అని నారాయణరావనెను. అటులే కాంతారావు నారాయణరావు భార్యచే నాహ్వానముపొందెను. కాంతారావు రంగమ్మ వెడలిపోయిరి. నేఁడు కమలాకరుని పుట్టిన రోజు పండుగ. బంధుగులందఱ నాహ్వానించినారు. విశ్వనాథయ్యగారు దంపతులు వచ్చెదమని చెప్పినారు. సుందరి యుత్సాహమును వివరింపఁబనిలేదు. కమలాకరుఁ డానాఁడు ధరించుటకు సుందరి తాను స్వయముగఁ గుట్టి మంచిదుస్తుల సిద్ధము చేసెను.

౬

"నా చిట్టితల్లీ! విమలా! రావేమి? నన్ను పలకరింపవేమి? ఎందుఁబోయితివి? ఏలోకమున నుంటివి? నీవు ధన్యవు. నిను గన్నతల్లి ధన్యురాలు. నేనే మహాపాపిని. నీపాలిటి కాళరాత్రిని. నాబిడ్డా! నామీఁది నేరములు నాన్నగారితో చెప్పి కొట్టింతు నని జంకించుటేగాని యెన్నడును చెప్పి యెఱుఁగవు. అంత చిన్నతనములోనే నీకా గొప్ప ఉదారగుణము ఎట్లువచ్చెనో తల్లీ! బ్రదుకుటకు రోజులు లేవనియా? నేను బ్రదుకజాలను. నీ వున్నచోటికి వచ్చెదను. రమ్మ. నన్ను కౌగిలింపుము" అని కమల దీనాతి దీనముగ దుఃఖించుచుండెను. దుఃఖించి దుఃఖించి తుదకు పరవశయై మొదలు తెగఁదీసిన కదళీవృక్షమువలె నామె భూమిపై నొక్కపెట్టునఁబడెను. ఆ చప్పుడువిని నారాయణరా వచటికివచ్చి ఆమె నోదార్చి తేర్చెను. కమల తెలివిఁగాంచి నారాయణరావు పాదముల వ్రాలి "మహానుభావా! మీరు నాపాలిటి కీశ్వరులు. ఈశ్వరుని యపరాధక్షమను వేడునట్లు నేను మిమ్ము అపరాధక్షమను వేడుచున్నాను. నేను మహాపాపినిని. కొన్ని యేండ్లనుండియు నా పాపఫల మనుభవించుచున్నాను. మీ దుఃఖములన్నిటికిఁ గారణము నేను! నే నడుగుపెట్టఁబట్టియే ఆనందనిలయమగు మీ యిల్లు దుఃఖసదనమైనది. నావలననే మీబిడ్డ మిమ్మెడబాసినది. నేనీ సశరీరనరకము ననుభవింపజాలను. నాకు సెలవిండు. క్షమించితినని మీరన్న జాలును. నే నికమీకు గానరాను. నాబిడ్డను గలసికొందును" అని గోడుగోడున నేడ్చెను. నారాయణరావు అదివిని "కమలా, అంతయు పూర్వకర్మఫలము. మనము కర్తలము గాము. కావున నా దుఃఖమునకు నీవుగాని నీ దుఃఖమునకు నేనుగాని కారణము గాము. ఎవరి కర్మము వారిది— నేఁడు మా సవతల్లి కుమార్తె

గంగమ్మకు మనము చేసిన వాగ్దానముచెల్లించి రేపు ఉదయమున బయలుదేరి శ్రీ కాశీక్షేత్రమునకేగి యచట జీవితశేషము వెళ్లించుదము. మన యావదాస్తియును ఏకళాశాలకైనను దానపత్రము వ్రాసి యిత్తము. నేడు కాంతారావింట మనబంధువుల నందఱ నొక్కమఱి సందర్శింతము. ఈ దినము మనకు బరమపవిత్రదినము. కావున సందియముమాని నాతో బయలువెడలుము. మోటారు దెప్పింతును'' అనియెను. ఆమెయును సమ్మతించెను.

౧౦

కాంతారావుగారింట నేఁడు బ్రహ్మానందము నిండియున్నది. భోజనములైనవి. బంధువులందఱు నొకచోట గూర్చుండి యిష్టాగోష్ఠిచేఁ గొంతప్రొద్దు గడపిరి. ఆడువాండ్రందఱు గూర్చుండిన చోట సుందరి సంగీతపుపెట్టె (గ్రామఫోను) పాటలు పాడించుచున్నది. కమల యొడలెఱుపిలేక సుందరినిఁజూచుచు గ్రుడ్లనీరు రెప్పల నప్పళించుచున్నది. విశ్వనాథయ్యరు—కాంతారావు ప్రసంగము సాగించిరి. మీ దరవవారుగదా? తెలుగుపిల్ల నెలసాకితిరని కాంతారావు ప్రశ్నించెను. అదివిని అయ్యరు "రావుజీ! నన్నేమియు ప్రశ్నింపవలదు. విజయనగరపరిసరముల నొకతోటలో నొకగుడిసెనుండి యొకబాలిక రోదనధ్వని వినవచ్చెను. షికారుకేగిన నే నాతోటలోఁ బ్రవేశించిచూచితి. ఒక వృద్ధుఁడు చచ్చిపడియుండెను. వానిప్రక్క నొకబాలిక కూర్చుండి యేడ్చుచుండెను. అచట శోధింప నొక యుత్తరమున్నది. ఆ యుత్తరమును బాలికను నేను దీసికొని యింటికిఁబోయి నా సేవకులచేత నా ముసలివాని శవమునకు సంస్కారము గావింపఁజేసితిని. ఆయుత్తరము నా చేతిపెట్టెలోనున్నది. అది యొక స్త్రీచే వ్రాయబడినది'' అని అయ్యరు దన చేతిపెట్టెను దెఱచి యొకయుత్తరమును దీసి కాంతారావున కిచ్చెను. ఆయన యిట్లు చదివెను.

"బాబయ్యా! ఇది యొక దిక్కుమాలినబిడ్డ. నా మాలుగుఁజొచ్చినది. ఒకానొక మృత్యుదేవతనుండి దీనినిదప్పింప నాతరముగాలేదు. కుదకట్లో నీ యొద్దకు మన బుల్లివానిద్వారా పంపుచున్నాను. పదిలముగా కాపాడుము. ఇది నాబిడ్డ. నీబిడ్డ. కావున రక్షింపుము. తోటవెలుపల రానీయకుము. జాగ్రత్త. ఇంతే దండములు. ఇది బాపనవారిబిడ్డ. నీనీళ్లు యివ్వకుండా బ్రదికింపుము.'' రంకమ్మ.

కాంతారావు చదివిముగించెను. అది విని నారాయణరావు దేహము గగుర్పొడిచెను. బాపనవారి బిడ్డయనియు, దిక్కులేనిదనియు యుత్తరముండుటచేత బిడ్డలులేని నేను సుందరని పెంపుడుకొమరితగా నుంచుకొని పెంచి పెద్దదానిఁజేసితిని. సుందరి యను పేరు మేమే యామెకుఁ బెట్టితిమి. ఆమెకు లోకానుభవము, స్వతంత్రత, అలవడుటకై యిపుడు మీ చేతులలో నామె నుంచినాను. ఇది యామె వృత్తాంత"మని డాక్టరుగారు కాంతారావుతోఁ జెప్పిరి. నారాయణరావు మెల్లగాలేచి స్త్రీలున్న స్థలమునకేగి సుందరినిఁ జూచుచు గొంచెముసేపు నిలిచి యశ్రుకణములు దుడిచికొనుచు మరల నీవలికి వచ్చెను. అతని దీనవదనమును గాంచి రంగమ్మ కంటఁ దడిపెట్టెను. "నేను చచ్చిపోయి విమల బ్రదికియుండినచో వారి కిట్టి దుఃఖము గలిగియుండదు. విమల పోలికలన్ని సుందరమ్మగారి ముఖములో నున్నవి. అది చూచి యేమో జ్ఞప్తికివచ్చి గుండెపగిలిపోయి వారల్లాడిపోవుచు లోలోనగుములుచున్నారు. ఎంతపాపిని! ఎంతటి దుష్టురాలను. అయ్యో—నా తల్లీ! విమలా! రావమ్మా. క్షమించవమ్మా. నన్ను కౌగిలించి పోవమ్మా—వి—మ—లా— విమ—లా—రా—రా—గో"యనుచు కమలమ్మ స్మృతి దప్పి పడిపోయెను. గంగమ్మగారి ప్రార్థనపై సుందరి పెట్టెపాటలు పాడించుట చాలించి కమలమ్మ కుపచారము సేయుచుండెను. ఈ దృశ్యమునుజూచి అందఱును గంట దడిపెట్టిరి. నారాయణరావు జీవచ్ఛవమువోలె బడియుండెను. అప్పటికి సాయంకాల మైదుగంటలైనది.

౧౧

"అయ్యా! కాంతారావు పంతులుగారూ! నేను నారాయణరావు పంతులుగారింట పూర్వపు సేవకురాలు వెంకి రెండవకొడుకును. నా పేరు బుల్లెయ్య. మాయమ్మ యిపుడు చావ సిద్ధముగనున్నది. నారాయణరావు పంతులుగారిని ఒకసారిచూచి ప్రాణము విడువవలెనని తహతహపడుచున్నది. వారిచట నున్నారటగారూ! దయచేసి పంపండి" అని యొక శూద్రయువకుఁడు ఆఁడావిడిగా బరువెత్తివచ్చి కాంతయ్యతో ననెను. వెంటనే కారు సిద్ధముచేయించి నారాయణరావును కమలాకరునితోఁగూడ కాంతారావు వెంకి యింటికిఁబంపెను. వెంకిని బాలకులు మఱచియుండరు. కమలాంబగారు తనకొసంగిన బహుమానధనముతోఁ గాలక్షేపము చేయుచున్నది. కాని హృదయశల్యాయమానమగు బాధ—మనోవ్యాధి—యేదో వెంకి నావేశించి దానిని మంచము పట్టించినది. అది యిపుడు మరణావస్థయందుండి తన హృదయవేదనను రావున కెరిగించి క్షమాపణవేడి చావఁదలంచి నారాయణరావుగారి నిమిత్తము తన కొడుకును బంపించినది. దీనదయాళుఁడగు రావు వెంకిపైగల యాదరమున దానిజాడ నిశ్చయించి బయలుదేరిపోయెను.

౧౨

నారాయణరావు—ఆయనను అనుకొని కమలాకరుడు వెంకియింటిలో నొకచాపమీద గూర్చుండిరి. వెంకి యొకచాపపై బరుండి రావునుజూచి "నా బాబూ! దగ్గరకు ర"మ్మనెను. ఆయన వెంకిని సమీపించెను. "ఆ పున్నెపుపాదాలు యీలా బెట్టండి బాబూ" అనుచు వెంకి రావుపాదములపై దన మొగముజేర్చి కన్నీరు మున్నీరై పొఱి వెక్కుచు "నాతండ్రీ! నీ—బిడ్డను—నేను ఎడబాపితిని—చంపలేదు. ఉన్నది. కారణము నేను చెప్పను. పండువంటికాపురము. ఎక్కడనున్నా—బతుకుతుందని పంపించా—యీజయనగరానికి—నా చినబాబు దగ్గరికి—తోట్లకాపరి. ఆయన చచ్చిపోయాడు—యిమలమ్మ ఆసాయులుందేమో యెతికించాలె—నన్ను క్షమించాలె—నాబాబూ—ఆమెను రచ్చించాలెననే చంపేశా. పిన్నదొరసాన్ని యేమనొద్దు. దణ్ణం—దణ్ణం—పాపాలునిలవ్వు—పోతున్నా—పో—తు—ఊం" అనెను. వెంకి నిర్జీవయయ్యెను. నారాయణరావు నిర్విణ్ణుఁడయ్యెను. విశ్వనాథుడు చెప్పిన మాటలు—వెంకమ్మ యుత్తరములోని కబుర్లు—వెంకి తన సమక్షమున బల్కిన వాక్యాలు విన్నాడు కమలాకరుఁడు. సుందరి కీకథ సూటియగు నాయని తలంచుచున్నాఁడు. నారాయణరావు తన జేబునుండి పదిరూపాయీలు వెంకికొమరునకిచ్చి మరల మోటారునెక్కి కమలాకరునితోఁ గాంతారావుగారింటికిఁ జేర బయలుదేరెను.

౧౩

"అట్టే నాకు జ్ఞప్తిలేదు. నేను తోటతాతదగ్గరికి వచ్చేటప్పటికి పూర్వము నన్నందరు "విమలా" యనుచునే పిలుచుచున్నట్లు జ్ఞాపకము. ఏమిగోలో ఎన్నెండ్లో నాకేమి జ్ఞాపకము! నన్నెందుకు వేధిస్తారు? నా తండ్రిగారు డాక్టరు విశ్వనాథయ్యరుగారు, నా తల్లి మీనాక్షమ్మగారు. అరవ్వారలో—తెలుగువారలో ఎవరైతే నేమి? ఎవరు బ్రదికించారో—ఎవరు విద్యాబుద్ధులు చెప్పించారో—వారే నాతల్లి-దండ్రీ. ఇప్పుడీ రంగమ్మ అత్తయ్యగారింత అన్నము పెట్టుచున్నారు. వారిల్లే నాయిల్లని యిప్పుడను కొనుచున్నాను. పైన మింకెన్ని రంగములలో యీ పాత్ర నేకాలమున నేరీతిని నటింపజేయ దలంచి యున్నాఁడో ఎవరెరుంగుదురు. నా పూర్వచరిత్ర నాకు జ్ఞప్తిలేదు. నన్ను తేఱచకండి, మ్రొక్కెదను" అని సుందరి, వివిధరీతుల బ్రశ్నించుచున్న స్త్రీబృందమునకు, బదులిచ్చుచున్నది. కమల మెల్లగలేచి సుందరినానుకొని కన్నీరు గార్చుచున్నది. విమలాస్మరణముదక్క కమల కింకొక తలంపులేదు. కాంతారావు—విశ్వనాథుల సంభాషణము—ఉత్తరములో సంగతులు అచ్చటివారికెల్ల దెలియుటచే నందఱకు భావములపై భావములు జనించి యొక్క మొగిని

సుందరిని బ్రశ్నింపసాగిరి. నారాయణరావుగారు వచ్చిరి, వెంకి మరణావస్థలో జెప్పిన మాటలన్నియు కాంతారాయవిశ్వనాథాదులకు గమలాకరుడు వివరించెను. కాంతారా వించుకయోజించి "ఇంక సందేహమేల? లెండి. మన మచటికేపోవుదము" అనుచు లేచెను. ఆయనతో దక్కినవారు లేచిరి. స్త్రీలున్నచోటికి బోవలెనని వారి ప్రయత్నము. కాంతారావు మొదలగువారు వెలుపలిహాలుదాటి మండువాద్వారమువద్దకు వచ్చిరి. ఆద్వారమున కెదుట మండువాకు ఆవలివఱండములో స్త్రీలు గూర్చుండియున్నారు. రంగమ్మగారు సుందరిని జూచి "అమ్మాయీ! పెద్దదానవుగాన అడుగుచున్నాను. నీకు జ్ఞప్తియున్నంతలో నీ తల్లి పేరుగాని—తండ్రి పేరుగాని చెప్పలేవా?" అనెను, సుందరి ఆమాటవిని "అత్తయ్యగారూ! తెలిసితెలియని అవివేకపు మాటలాడిన లోకము నవ్వదా? తోటశాలదగ్గరికి నేను వచ్చేసరికి ఆరో—ఏడో—ఏండ్లట. మాపూరు బాగా తెలియదుగాని మా అమ్మ పేరు కమలాంబ—ఆమె నన్ను పెంచింది" అనునప్పటి కామె యొడిలోఁ దలపెట్టి పరుండియున్న కమలాంబ "అయ్యో! నాతల్లీ! కమలా! నన్ను అమ్మ అనెదవా? నేను కిరాతురాలను—నా చిట్టికూనా—ఎచటనుంటివే"-అని బావురుమనెను. ఆమె స్థితిఁగాంచి సుందరియు ధైర్యముజ్జగించి కన్నీరుగార్చెను. ఈదృశ్యము నావలివఱండమువద్ద నిలిచి చూచుచున్న మగవారుగాంచి విస్మయులైరి. నారాయణరావు వారిలో నిలువజాలక యొక్కపెట్టున బరువిడి సుందరిని సమీపించి కౌగిలించికొని "నా కన్నతల్లీ! సుందరీ! విమలవుకావా? నీవు?" అనుచు నానంద దుఃఖ ఆశ్చర్యమగ్నమానసుఁడై సుకుమారియగు నాసుందరి మస్తకమున దన తల మోడ్చి కన్నీటిధారలచే నామెను దడపుచుండెను. విశ్వనాథయ్య రదిగాంచి "ఆరరే! దైవసంఘటన మిట్టిదిగదా! తండ్రియు బిడ్డయు జిట్టచివర కొక్కచోటున జేరిరి. ధన్యుఁడను. నారాయణరావుగారూ! మీసొత్తు మీకు జేరినది. అమ్మా! సుందరీ—కాదు-కాదు—విమలా! నీ తల్లిగారికి మ్రొక్కి ఆమె అడలుదీర్పుము. దుఃఖముననవయుచున్న నీతండ్రి పాదములకు నమస్కరింపుము" అనెను. సుందరి అటులే చేసెను. కమలాకరునికి, అతని తల్లిదండ్రులకు గలిగిన సంతోషమునకు మేరయుండునా?

సమాప్తి

నారాయణరావు ప్రార్థనపై మీనాక్షీ విశ్వనాథులు విమలను కమలాకరునకిచ్చి పాణిగ్రహణము గావించిరి. కమల, విమలనుఅల్లుని క్రింద నడువనీయక ప్రేమించుచుండెను. మరల నారాయణరావు భవన మానందనిలయమయ్యెను. తల్లిదండ్రుల అత్తమామల లాలనపాలనల నుప్పొంగుచు విమలా కమలాకరులు గృహస్థధర్మము నవలంబించి సౌభాగ్యాంబుధి నోలలాడుచుండిరి.

---

## శాంతి

యడవల్లి రామమూర్తిగారు

ప్రేయసీ! నీదు వికసితనయనయుగము
నుండి వెడలెడు యమృతనుకువులకట!
నాదుయలసిన హృత్సీమ నదిమిపట్టె
సేదదేర్చెడుగాదె, నీశీలమేమొ!
కాంతు నీవదనమం దొక్క కాంతిరేఖ,
శాంతిగూర్చెడు నీమేనుకాంతులకట!

నాదు నిస్సారజీవనవీథియందు,
విహారణంబొనరింపగా సహాసమందు.
నిర్భరంబగునాజీవనిలయమందు
కాంతు నేనొక్కయుత్సాహకారణంబు
భానుకిరణాలయన లేతుపల్లవంబు
హేమకిరణంబు వెన్వెంట నెమకునట్లు.

# కుమారీ హితబోధనము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు, బి. ఏ

సీ॥ వైదేశికములగు వస్త్రముల్ విడనాడి ఖద్దరుబట్టలు గట్టుమమ్మ
భారతవర్ష సంపదకెల్ల మూలమై యొప్పెడిరాట్నంబు ద్రిప్పుమమ్మ
సకలవైదేశికాచారముల్ కడునష్టకరములంచును మదినరయుమమ్మ
స్వకులక్రమాగతాచారానుసరణంబె అలఘుధర్మంబని తలపుమమ్మ

తే॥గీ॥ దయయు పతిభక్తియునునోర్మి దానగుణము। నివియె భరతావనీసతులెల్ల కలిగి
యుండవలెననుమాట నెన్నండు నైన। మరువక యశంబుగాంచు మమ్మాధరిత్రి॥

సీ॥ పగలెల్ల శ్రమపడి పతి యిల్లుసేరగా వీవన చేబూని వీచుమమ్మ
విశ్రాంతిచెందినపిదప సంతోషంబుగలుగునట్టులు ప్రీతిఁబలుకుమమ్మ
ప్రాణప్రియునకు నిరంతరంబు సుఖంబు గలుగజేయుట ముఖ్యకార్యమమ్మ
పతికన్న వేరెదైవము కులసతికింక లేదను పాట పోనాడకమ్మ

తే॥గీ॥ ఘనపతివ్రతామహిమంబునను అరుంధ। తీప్రముఖ సర్వభరతసతీతిలకము
లాసుధాకరతారార్కమైనయశము। గాంచిరనియెంచి యటుసంచరించుమమ్మ॥

సీ॥ పతిపెరవారితో భాషించువేళల నాతనికఠినోక్తు లాడకమ్మ
మేలైనసగలు దుకూలముల్ కొనలేదటంచు వల్లభుని నిందించకమ్మ
కాంతునకుపచర్యగావింపగా నెన్నడును నవుకర్లను పనుపకమ్మ
గృహకృత్యముల నిర్వహించుచో నేప్రొద్దు కొంచెమే నశ్రద్ధ గాంచకమ్మ

తే॥గీ॥ పుట్టినింటికి మెట్టినయట్టి యింటి। కధికగౌరవమునుగూర్చి యుత్తమాము
లకును,తలిదండ్రులకునుభర్తకును ముదము। నింపగానెప్పుడును ప్రయత్నింపుమమ్మ॥

సీ॥ అనిలోనవెన్నిచ్చి యరుదెంచుతిక్కన కుపదేశమొసగిన యువిదవోలె
అతులకవిత్వ మింపరయ రామాయణంబును వ్రాయు కవయిత్రి మొల్లవోలె
విగతజీవు నిజాత్మవిభుఁ బునర్జీవిగ వెలయింపజేయు సావిత్రివోలె
దేశసేవాపర దృఢఘనవ్రతమునందిన యా సరోజినీదేవివోలె

తే॥గీ॥ వీరపత్నివై వైదుష్యవిలసితవయి। సతతపతిభక్తియుక్తవై సకలసుజన
వినుతభంగిస్వదేశభక్తినిగలిగియు। మందకీర్తినిగాంచు మమ్మా సతంబు॥

# ముద్దు కూతురు

శ్రీమతి వి. సరస్వతిగారు

కమల లక్ష్మణరావుగారి ఏకపుత్రిక. లక్ష్మణరావు ఇంజనీరుగానుండి చాలాధనము సంపాదించి పింఛను పుచ్చుకొనుచుండెను. అతనికి రంగరావను కొమారుడు బయటూర ఉద్యోగమునందుండెను. అతని వెనుక పదునారేండ్ల తర్వాత, వారి నానందాబ్ధి తేల్చ కమల జనించెను. చకోరములకు సుధాకిరణములును, కమలములకు సూర్యుడును, ఎట్టి ఆనందము గూర్తురో, లక్ష్మణరావుదంపతులకు కమల అట్టి ఆనందము కలుగచేయుచుండెను. వీరి ఆనందమును జూచి విధాత ఓర్వలేక కమల తల్లిని, కమలకు నాల్గవయేటనే యమునిపాలు గావించెను. తల్లిలేనిలోటు తోచనీక లక్ష్మణరావే కమలకు తల్లియు తండ్రియువలెనుండెను. ఆమెకు చిన్నతనమున ఆటలు నేర్పెను. బాల్యముననే విద్యారంభము గావించి, చక్కగా చదువనేర్పెను. ఆమె చాల చురుకుగల పిల్ల గనుక అతిత్వరితముగా నేర్చుకొనెను. తండ్రితోగూడ ఆమె కావ్యాలంకారములు చదువుచు మధ్య మధ్య వాటిని గురించి అతనితో తర్కించుచుండును. ఆమె నొక బాలికాపాఠశాలకు లక్ష్మణరావు పంపెను. ఆమె పదునారేండ్లు ముగియక మునుపే మెట్రిక్యులేషను పరీక్షయందు కృతార్థురాలయ్యెను. ఇంకను చదువ తండ్రికిని తనయకును చాల యిష్టముండెను గాని, వైద్యు, డామె శరీరము దార్ఢ్యముగాలేదనియు, విశ్రాంతి తీసుకొనవలెననియు చెప్పెను. అందుపై ఆమె, ఇంటియందేయుండెను గాని విద్యాభ్యాసము వదలలేదు.

౨

రాత్రి పన్నెండు ఘంటలు కొట్టెను. ఒక విశాలమగు భవనమునందు వసారాలో, చప్పుడుచేయక అడుగులువైచుచు మనుష్యులిటునటు తిరుగుచుండిరి. బల్లపై మందుసీసాలు నాలుగైదు (కాగితము లంటించి) యుండెను. ఎఱ్ఱటికన్నులును చెదరిన వెంట్రుకలునుగల బాలిక యొకతె 'నర్స్, నీవు కొంచెము విశ్రమింపుము. నేనుండెదను'' అని బలవంతముగా ఆమె చేతితోలుతిత్తిని తీసుకొనెను. ఆమె "వందనములు'' అని చెప్పి చప్పుడు చేయకుండా గదివిడిచి మరియొకగదిలోనికి పోయెను.

కొంతసేపటికి రోగి కన్నులుదెరచి, 'కమలా' అని హీనస్వరముతో పిలచెను. కమల "ఏమి బాబూ" అని అతనిని సమీపించెను. రోగి, "కమలా, కాగితము కలము దెమ్ము. మరణశాసనము వ్రాయవలెను" అని లేవబోయెను. కమల అతనిని మెల్లగా పరుండబెట్టి, "నాన్నా మీరు పండుకొనుడు. జ్వరముతగ్గును. మీ కిప్పుడేమీ భయములేదు. శాసనము రేపు వ్రాయవచ్చును" అని అతనిని మెల్లగా తట్టెను. లక్ష్మణరావు పరుండిన మరునిముషమే ప్రజ్ఞావిహీనుడయ్యెను. నర్సు "టెలిఫోను"వద్దకు పోయి రోగి చనిపోయినాడని వైద్యునితో చెప్పెను. కమల నిలుచున్నట్లే క్రిందబడి మూర్ఛపోయెను.

3

తండ్రి చనిపోయినతర్వాత రెండు మూడు రోజులవరకు కమలకు శరీర మొక విధముగా మొద్దుపారియుండెను. మెదడు పనిచేయుటలేదు. దిగ్భ్రమ పట్టినదానివలె నుండెను.

అయిదవరోజునుండి కమలకు హృదయమున అగ్నిజ్వాలవలె మంట పుట్టుచుండెను. ఆ మంటయే ఆమెను నిదురలేపును. పక్షుల మధురగానము, మనోహరమగు పండు వెన్నెల రాత్రులు, శాంతభావమును పురికొల్పు సంధ్యయు, ఆమె మనసుకు శాంతముగాని ఆనందముగాని కూర్చలేదు.

4

కమలసోదరుడు, రంగరావు, తండ్రి ఉత్తరక్రియలకై వచ్చియుండెను. అన్నియు ముగిసినవెనుక, తా నాయూరనుండుట లేదు గనుక ఇల్లు సమ్మనెంచెను. లక్ష్మణరావు మరణశాసనము వ్రాయనందున ఆస్తి అంతయు రంగరావునకే చేరెను. పెండ్లి పేరంటములు లేక తండ్రిప్రేమకంతయు అధిపతియైయుండినందువల్ల కమలపై, వారి భార్యాభర్తల కొకవిధమైన ఈర్ష్యయుండెను గాని ప్రేమలేదు. అయినను వారు కమలను తమతోగూడ రమ్మని చెప్పిరి. కమల చాలా స్వతంత్రాభిమానముగల పిల్ల. వదినకు తన్ను చూచిన చాలా అలక్ష్యమని గ్రహించి వారితోడ వెళ్ళనని ఖండితముగా చెప్పివేసెను. ఆమెకు నగలు రెండువేలరూపాయలు ఖరీదు చేయునవియుండెను. ఆమె వాటినిఅమ్మి, ఆపైకముతో, తనవిద్యను కాలేజిలోచేరి ముగించి, పిమ్మట యొకజీవనాధారము కలుగజేసుకొనవలెనని నిశ్చయించెను. ఆమె, నెలకు అయిదురూపాయలకు ఒకగదిని అద్దెకు పుచ్చుకొనెను. తనవంట తానేచేసుకొని, ఆపాత్రలన్నియు శుభ్రపరచి, ఇంటిపనులన్నియు చేసుకొని,చదువుకొనుచుండెను.కమలకు బ్రతుకు చాలాకష్టముగానుండెను. మనోవిచారము,దారిద్ర్యము గూడచేరి, అతికోమలమగు ఆమె దేహారోగ్యమును బొత్తిగా చెడిపెను. నాలుగుదినముల కొకసూరి జ్వరమువచ్చుచుండెను. వీటినన్నిటిని లక్ష్యపెట్టక కమల కళాశాలకు పోవుచుండెను. వైద్యుడామెను పరీక్షించి, ఆమెకు క్షయవ్యాధియనియు, చాలా విజృంభించియున్నది గనుక అతిజాగరూకతతో ఉండవలెననియు, మంచి ఆహారము పుచ్చుకొని, విశ్రాంతిగలిగి, మంచిగాలియందుండవలెననియు చెప్పెను.

ఒక ఇరుకువీధిలో ఒకచిన్నయింటి మేడమీద చిన్నగదిలో మంచముపై కమల అతికృశించిన శరీరముతో బరుండియుండెను. ఆమె ఎముకలగూడెమువలె నుండెనేకాని మనిషివలె లేదు. ఆమెమిత్రురాలగు లక్ష్మి, కమలకు చినిగిపోయిన విసనకఱ్ఱతో విసరుచుండెను. కమల అప్పుడప్పుడు శ్రమతోదగ్గి, నెత్తురుకలసిన కఫమును గిన్నెయందు ఉమియుచుండెను. నాటిదినము ఎండతీవ్రమునకు కమలకు నూటరెండు డిగ్రీలు జ్వరముండెను. లక్ష్మి—"కమలా, క్రూరుడగు నీఅన్న నిన్నువచ్చి చూడనుగూడలేదు గదా!ఆతండ్రి కడుపునబుట్టి, అత డైశ్వర్యముల తులతూ

గుటయు, నీవిట్లు మందుకు డబ్బులేక చచ్చుటయు ఎట్టిన్యాయము! మనచట్టము లేమిచట్టములు! మనసంఘ మేమిసంఘము! ఇట్టి ఘోర అన్యాయము మనసంఘముననే జరుగును కాని ఇంకెక్కడను జరుగదు___"

ఇంతలో ఎవ్వరో మెల్లగా తలుపుదట్టిరి. లక్ష్మి చప్పుడుచేయకుండా తలుపుతీయగా తపాలా వాడొక ఉత్తర మామె చేతికిచ్చెను. అది కమలపేరట, ఇంటియజమానునకు బాడుగబాకీకై జ్ఞప్తిచేయుచు పంపినఉత్తరము. కమల ఇంటిబాడుగ ముప్పైరూపాయలు బాకీయుండెను. ఆమె పైకమంతయు ఎన్నడో సెలవై పోయెను. ఇప్పు డామె చేతిగాజులను ఒక్కొక్కటిగా అమ్మి జీవించుచుండెను. కమల తనవద్దకురాకుండా, పెండ్లిపేరంటములు లేక తనకప్రతిష్ఠ తెచ్చుచున్న దనియు, అటువంటి సోదరి తనకు లేనట్టె తానెంచుచున్నట్టును వ్రాసెను. ఆతర్వాత వారి కొండొరుల క్షేమసమాచారములే తెలియలేదు. కమల ఆయుత్తరమును చదివి ఒక నిట్టూర్పువదలి కన్నులవెంబడినీరుకార్చెను. "లక్ష్మీ, నన్నిట్లైనను ఋణవిముక్తురాలినిగా జేయుము. మాతండ్రి వెండిగడియారము నాపెట్టెలోనున్నది. దాని నమ్మియైన అప్పుదీర్పుము" అనెను.

లక్ష్మి "సోదరీ, నీ వీవిషయమై చింతపడవద్దు, నాగాజులనమ్మియైన నీఅప్పుదీర్చెదను. ఇట్టి ఘోరకృత్యములు జరుగుచున్నను వాటిని రూపుమాపుటకై ప్రయత్నము చేయక, తమసౌఖ్యముతో తృప్తిచెందుచున్న భారతపురుషుల ననవలెను. తనయులతోబాటు, మనముగూడా పుట్టలేదా? కొడుకు సమస్తసొత్తుల కధిపతియగుచుండ కూతుండ్రు తిండికిలేక దారిద్ర్యపీడితులగుచున్నారు! ఎప్పు డీఅన్యాయచట్టమను పిశాచము మన దేశము వదలును? శారదాబిల్లు దెప్పించిన మహానుభావునిబోలు హారవిలాస శారద లింక మన దేశమున లేరా? భారతభూమి గొడ్డుపోయినదా? ఇంకను ఈవిధమున ఎందరు మరణింపవలెనో! ఎప్పుడీ ఘోరచట్టము మన దేశమును వదలునో,-" కమలకు మరల దగ్గు వచ్చెను. లక్ష్మి కమలపడు శ్రమను చూడలేక డాక్టరును పిలుచుకొనివచ్చెదనని చెప్పి వైద్యునింటికి బోయెను. ఆమె వైద్యుని పిలుచుకొని వచ్చుసరికి కమల చైతన్యవిహీనయై నిద్రించుదానివలె బరుండియుండెను.

ఆమె తన తండ్రిని గలుసుకొనబోయెను.

---



# రాధాకృష్ణ విలాసము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

సీ॥ ఒకవింతహొయలుగా నొగికిరీటమునందు శిఖిపింఛమలరించు చెలువుకాడు
నగుమొగంబునసీరునామంబు డంబుగా నతివేడ్కదిద్దిన యందగాడు
కంఠసీమనుమౌక్తికపుహారములనుంచి చూడ సొంపులుగుల్కు సొగసుగాడు
సరిగంచుశాలు ముచ్చటలుమీరగ వలెవాటుగానలరించు నీటుగాడు
కలికిజూపుల గోపకామినీజనముల వలపులమ్ముంచెడి వన్నెకాడు॥
గీ॥ సరససుకుమారమూర్తి నాసామి చిన్న। బాలకృష్ణుడు నాపాలిభాగ్యరాశి
మానినీజన మన్మథమన్మథుండు। వలపుజాబందెనదిగో నావల్లభుండు॥

గీ॥ దూతిచేసంపునాలేఖ బ్రీతినంది
సారెసారెకుతెపలోన జదివిజదివి
మరలజూచుచునాయందు మనసునిలిపి
కన్నులరమోడ్చి వివశతనున్న విభుని
కెరుకలేకుండ వెన్కగానేగియపుడ
కన్నులనుమూసి యావేడ్కగాంతుననుచు
అల్లనల్లననేర్పుగా నడుగులిడుచు
వెడదపెన్నెరిముడిజారి వ్రేలుచుండ
వలిపెచెంగావి సరిగెదువ్వలువజార
పొంచితరుమూలమున నేనరించినిలచి
వచ్చునగవాపికొని బ్రియునొద్దకరిగి
లెమ్ముల్లనుబోనికేలు కెందమ్ముల్లల్ల
నల్లనమనోహరుని నయనాబ్జములకు
నిరుగడలజేర్చి బలుమీలనేలజాలు
కనుగొలంకులమోహంబు గడలుకొనెడు
నదటుజూపుల బ్రియుచేత నమరు వలపు
కమ్మపై నిల్పి జాణతనమ్ముతోడ
విభునిమూపున కుచగిరుల్ వేడ్కనిల్పి
తభుకునెమ్మేనపులకలు మొలకలెత్త
హస్తకంకణములు ఘల్లనంగ విభుని
కన్ను లరమూసె రాధికా కమలనేత్ర
అలతినవ్వునహరిబల్కె కలికితోడ
వలపుజాబంపి నా ప్రేమబలమునరయ
దలచి గికురింతువట వె రాధావధూటి॥

చ॥ మరుగువడంగనేల వినుమా మనమానసవృత్తు లొక్కటన్
వరలుచెరుంగలేవె తెరవా పెరవాడనెనేను నీదుజా
బరసినయంతలోన మగువా పగవాడయిమారు డేమొ న
న్నురిమురినేచసాగ చెలియా మలయానిలుగూడిప్రోడయై॥

ఉ॥ నీదగుముద్దుమోము గననీ విననీ శుకవాణి నీనుడుల్
వాదుగవెన్కనిల్వదగవా బిగువా భవదీయలేఖకే
మోదమునొందగంటి వినుమో నవమోహిని నీదునెమ్మొగం
బీదెసజూపి మోదమిడవే లడవేటికి రాధికామణీ॥

సీ॥ అనినరాధావధూటి ప్రేమానుభూతి మొలకసగవునబ్రియుజూచి పలికెనిటుల
అంతకంతకునాయందు నమరుచుండు నమలచారునీదుప్రేమయే యఖిలజగతి
కెపుడు శ్రీరామరక్షయై మెసగుగాత!!




రాజమహేంద్రవరం
8-8-1933.

చి॥ చెల్లెలు శ్యామలాంబకు కుఅక్క సీతాలక్ష్మి అనేక ఆశీర్వచనములు తె॥

నేనును మీబావగారును ఇచ్చట మొన్న సోమవారమునాడు సుఖముగా ప్రవేశించినాము. మీ బావగారు నన్నత్యనురాగముతో చూచుచున్నారు. నామనసులో మాట మనసులో నుండగనే కనిపెట్టి నాకు కావలసిన విలాస పదార్థములను కొనితెచ్చి యిచ్చుచున్నారు. అత్తగారు నన్నత్యభిమానముతో జూచుచు వచ్చిపోవువారలకు నన్ను సగర్వముగ జూపుచున్నారు. మామగారును అభిమానముతో వర్తించుచు సాధ్యమైనంతవరకు నాపుట్టినిల్లు విడచివచ్చితి నను తలపు చిత్తమునకు తోచనట్లు చేయుచున్నారు. మఱియు మఱదండ్రును చిన్ని మఱదులును రెండుదినములలోనే నాతో నెక్కుడ లేనిచనువును చేసుకొని ఒక్కనిముష మెడబాయక తమ చిన్నారిపొన్నారి యాటల వైపు నాచిత్తము నాకర్షింపజేయుచున్నారు.

కాని, శ్యామలా, పదిమందిలో సలికిడిగా నున్నప్పుడుతప్ప, ఇంచుకంత ఒంటరిగా నుండగానే నాకు కోడేరులోని మన పెద్దయిల్లు, దేముడఱుగు చుట్టును వంటింటి దగ్గరను సదా మడితో తిరుగుచుండు మన అమ్మ, వ్యవహార సమయమున అప్రసంగములుచేయుచు తక్కిన యెల్లవేళలయందును పెదవులను మెల్లగ కదుపుచు మనసులో నే మంత్రములనో వల్లించుకొనుచుండు నాన్నగారు, మల్లెంటులు బీరపాదులు మొదలగువానికి నీరు పోయుచునో గొప్పుపట్టుచునో, పురుగులేరుచునో భక్తిపాటలు పాడుకొనుచుండు అవ్వగారు, నాతో సదా గవ్వలుగచ్చకాయలాడుచునో పాఠము పద్యము చదువుచునో యుండునీవు, చంక నెప్పుడును విడకుండెడి తమ్ముడు, వేసంగి సెలవులకు చెన్నపట్టణము నుండివచ్చి ప్రపంచపు వింతలనెల్ల వివరించుచుండు అన్నయ్య, ఇరుగు సుబ్బులక్ష్మి, పొరుగు కామేశ్వరి మొదలగు దృశ్యములే కళ్లకుగట్టినట్లు ప్రత్యక్షమగుచుండును. ఆహా! పుట్టిల్లువిడచి తొలిసారి అత్తింటికివచ్చినపుడు కొన్నినాళ్లవఱకు ఎలప్రాయపుటింతుల కెంత తత్తరముగనుండును! ఏదో యెఱుగని మహాలోకములో పడ్డట్లుండును. తనవారిని తనవారుగాకాక మఱువవలసినవారినిగాను, వింత

వారిని సొంతవారినిగాను భావించుటను నేర్చుకొనుచున్నట్లుండును.

అయినను, చెల్లీ, ఇదినాయొక్కతె నొసటనే వ్రాయబడియున్నదా ? ఆడపుట్టువు పుట్టినవారికెల్ల నిదిసహజముగదా ! ఆమె యెప్పుడైనను పుట్టిల్లును, అక్కచెల్లెండ్రన్నదమ్ములు తలిదండ్రులు మొదలగు వారిని విడచి పరతావును తనతావుగ భావించుటను నేర్చుకొనవలసినదేకదా. కలకాలము పుట్టింటనుండుట ఆడుబొట్టెలకు తగవా ? ముందో వెనుకో యేదోయొకసందున ఆపె కీయవస్థ తటస్థించవలసినదేగదా ! నిజమున కెన్నాళ్లున్నను పుట్టిల్లు వనితలకు పెరయిల్లును పతియిల్లే స్వంతగృహమునుగదా! చెల్లీ, మిమ్మందర నెడబాసియున్నను, నే నింతకును నా పాలి భాగ్యసౌభాగ్యముల కిఱవుకాగల నా స్వంతగృహమున కాపురము క్రొత్తగా మొదలుపెట్టుచున్నా నన్న సంతోషము నా మదిని వికసింపజేయుచున్నది సుమా.

నే నిచ్చటకురాగానే పసుపు పూసికొని కుంకుమబొట్లు పెట్టుకొని, తెల్లచీరవలె వెల్ల వేసుకొని, మామిడితోరణములు మెడను చుట్టుకొని, మంగళవాద్యములు ఘోరు కలగ, దరహసిత వదనారవిందలగు తోడి ముత్తైదువలందఱితోఁబాటు మా గృహలక్ష్మికూడ తలుపులు విరివిగా తెరచుకొని భూసురాశీర్వాదములతోఁగూడ నాకు స్వాగత మొసంగినది. చిత్రపటములు అద్దములు మొదలగు వానితోఁగూడిన గదులును సంగణములును మేము నీవారమని నాతో పరిచయముచేసుకొనుచున్నట్లగుపించినవి. మల్లియరట్లు గులాబిమొక్కలు గన్నేరుకన్నెలు పొగడపొలతులు బంతిపడుచులు చామంతి చామలు విరినవ్వులువిరజల్లుచు నన్ను వేడుకగాపలుకరించినవి. మలయమారుతము, మందమగునెండలు, మధురమగువెన్నెలలు, నాజీవనముయొక్క నూతనాధ్యాయమున తాము చేకూర్చగలయంత శాంతిసౌందర్య సౌఖ్యములను నాకిపుడ చేకూర్చుచున్నవి.

ఇన్నిటికిని తలకట్టుగా మీబావగారు నన్ను తమ యారవప్రాణముగా తిలకించుచు అనురాగమును వెల్లివిరియించుచున్నారు. చెల్లీ, ఆత్మబంధువులనువిడచి తాత్కాలికముగ నన్యప్రదేశమువలె నగుపించు అత్తవారింటికి పుత్తడిబొమ్మలు వచ్చు క్రొత్తదినములలో వారి చిత్తములలో నానందచంద్రికలు వెలయించగల జాబిల్లి, భర్త వేఱెవ్వరు? మీబావ కేవలము విద్యావంతులే కాక ఉత్తమాశయపూరితులును. వారితో పరిచయ మెంతయెక్కువయైన వారి గంభీరత నాకంత యెక్కువగ గోచరించుచున్నది. ఇక మా జీవలత లొకటితోనొకటి యెనగిపెనగి ఆనంద కుసుమములను పూయగలవనుట కాటంకము లేదు.

చెల్లీ, అష్టైశ్వర్యములలోను నైశ్వర్యము అనుకూలదాంపత్యమని నమ్ముము. అన్యోన్యానురాగశూన్యదాంపత్యముకంటె లోకమున దుఃఖముగాని అంధకారముకాని వేఱొండులేదు. అనుకూల దాంపత్యము పూర్వజన్మపుణ్యాలబ్ధము కాని ప్రయత్న

మాత్ర సాధ్యముకాదు. అట్టి సౌఖ్యముఁగల నెలతలేమి పురుషులేమి ధన్యులు. అట్లు లేనివారు పడుయిడుములను మనము ప్రత్యక్షముగను చూచుచున్నాము. మీ బావగారప్పు డప్పుడు వింతవింత పాశ్చాత్యపత్రికలను తెచ్చి చదివి వినిపించుచుందురు. పాశ్చాత్యదేశములలో ఉత్తమకుటుంబములని పేరు పొందుచున్నవారిలోకూడ జరుగుచున్నన్ని వివాహవిచ్ఛేదములు మన దేశములో విద్యాహీనులగు అనాగరక జాతులలోకూడ జరుగవన్న మన భారతదేశ వివాహసంప్రదాయములును, స్త్రీపురుష తత్వములును నెంత యోర్పు నేర్పు పవిత్రత గలవియో గోచరముకాక మానదా!

మన భారతదేశమునకు భారతీయ సంప్రదాయములే వన్నెబెట్టును. కొందరు మూర్ఖులు స్వార్థపరులై వాటికి కళంకము గూర్చియో వ్యతిరేకులై ప్రవర్తించియో మెలగినంతమాత్రమున వాటి ఘనతకు కొఱంత వాటిల్లదు. మీ బావగారితో కొంతసేపు ప్రసంగించినంత మాత్రమున నెట్టి వితండవాదులును స్వచ్ఛమగు జాతీయతాభిమానులు కాకమానరు. అట్టియెడల నవకాశము కలిగినప్పుడెల్ల నతనితో ఇష్టాగోష్ఠి లభించుచుండు నాకు ఈ మందిర మనిందిత స్వర్గతుల్యమైయుండుటలో నాశ్చర్యమేమి? మాయింటికి గృహలక్ష్మి, భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక మొదలగు నెన్నో తెలుగుపత్రికలు, ఆంగ్లపత్రికలు వచ్చుచుండును. ఎన్నియో సుందరగ్రంథము లున్నవి. పిన్నలకు పెద్దలకుఁగూడ వాటిలోని యంశములు పఠించుటయు చర్చించుటయు నిత్యకృత్యమైనది. మాకందఱకు నింటిపనులు చేసికొనుట, పఠించుట, పాడుకొనుటతప్ప వేరు పని కనిపించదు. మగవారలు కచేరీలకుపోగానే యిరుగుపొరుగు పొలతులు కూడ వచ్చి మా ప్రసంగములలో పాల్గొనుచుందురు.

ఇట్టి సంతోషకరపరిస్థితులలో నే నానందముగనున్నానని మీ రెఱిగినచో మీరు నన్నుగూర్చి యెట్టి బెంగయు పెట్టుకొనరు. నన్ను అంపకము పెట్టుచున్ననాడు అమ్మ కంటనీరు పెట్టుకొనుచు నెంతోదూరము బండివెనుక వచ్చినది. ఆమెను చింతిల్లవలదని చెప్పుము. వెంకటావుధాన్లుగారి కోడలుకు పురుడువచ్చినదీ యేమి పిల్ల పుట్టినదీ వ్రాయవలెను. బాబుగారి సీతమ్మ నడిగినానని చెప్పవలెను. మరియు నితరవింతలు వ్రాయవలెను. మీ జవాబు చూచుకొని యిచ్చుటి తక్కినవి శేషములు వ్రాయుచున్నాను.

ఇట్లు
మీ ప్రియసోదరి,
సీతాలక్ష్మి.

[గృహలక్ష్మి పాఠకులు ముఖ్యముగా పాఠకురాండ్రు ఈ సోదరీమణులయొక్కయు వీరికుటుంబముల యొక్కయు చరిత్రమును వీరి ఆశయములను భావములను, వీరు ముమ్ముందు ప్రకటించు నాలుగైదు లేఖలవరకు శ్రద్ధగ పఠించి తెలిసికొనుచుండవలెనని-హెచ్చరించుచున్నాము. వీరి పరిచయము గృహలక్ష్మిద్వారా తగినంతవరకు కలిగినతరువాత తమతమ కుదిరినమైన రీతిని తాముగూడ పాల్గొని తమ అభిప్రాయములను విశదీకరించుచు లేఖలు వ్రాయుటకు వీలుకలుగును. (గృ॥ సం॥)]

# ఆరోగ్యబోధిని

## గర్భవతులలో కలుగు వ్యాధులు—వాటి శాంతికి ఉపాయములు.

డాక్టరు దువ్వు. శేషగిరి రావుగారు (శ్రీ సోదరసమితి)

గర్భవతులలో తఱచుగా అనేకవిధము లగు రోగము లుత్పన్నములగుచున్నవి. అందులకు కారణము లనేకములుగాయున్నవి. శరీరమందలి యవయవములలో కలిగిన మార్పులవలన సంభవించెడు రోగములే గాక వారు సేవించెడి అస్వాభావికాహారములవలన ఆచరించెడు అస్వాభావిక కార్యములవలనను అనగా అవసరములేనిదే విస్తారముగా నౌషధములు సేవించుట, అనవసరముగా రాత్రులందు ఎక్కువసేపు నిద్ర మేల్కొనుట, తఱచు అజీర్ణమునుకలుగ జేయు పదార్థములను సేవించి, మలబద్ధము, విరేచనములు మొదలగు రోగములను తెచ్చిపెట్టుకొనుట మొదలగునవి. ఇచ్చట నొకవిషయమును గర్భవతులు ముఖ్యముగా గమనింపవలయును. గర్భమును దాల్చిన పిదప అయిదవమాసము ప్రవేశించినతోడనే గర్భములోని శిశువు కదలుటకు ప్రారంభించును. దీనినే (Quickening) అందురు. అయిదవమాసము ప్రవేశించిన నాటనుండి గర్భవతి తన భర్తతో కలియుట పూర్తిగా మానవలయును. పురుషుల బుద్ధి మాంద్యము చేతనేమి స్త్రీల యజ్ఞానము చేతనేమి పై విషయమును గమనించక గర్భవతి, తన భర్తతో తొమ్మిదిమాసములు నిండువరకు కూడ కలియుచుండును. అది మహాదోషమే గాక దానివలన గర్భస్రావము మొదలగు రోగములు కలిగి ఆమె పెక్కు కష్టములకు పాలగును. కావున యీవిషయమును గర్భవతులు ముఖ్యముగా గమనించి జాగ్రత్తగా మెలగుచుండవలయును. అయా రోగములును తచ్ఛాంతికరోపాయములును యీ దిగువ నుదహరించుచున్నాను. వైద్యసహాయము లేని స్థలములందు కాని, లేక వైద్యుడు వచ్చి పలహాగాని మందుగాని యిచ్చులోపలగాని దిగువ తెలిపినప్రకారమాచరించినచో రోగశాంతి కలుగును.

1. మనోవ్యాకులత—భయము.

భయము, కోపము, సంతోషము, విచారము మొదలగు మానసికోద్రేకములు తరచు కలుగుచుండును. అట్టివానిని వేటిని గర్భవతి దరికి రానీయకూడదు. కానిచో కొన్ని సమయములందు ప్రమాదము సంభవింపవచ్చును. అట్టి మానసికోద్రేకములు కలిగియుండుటవలన శరీరమునకు దడయు (వణకు) అవయవముల నిస్సత్తువయు కలు

గుటయేగాక జీవితమునం దయిష్టతయు కలుగచేసి మరణవాంఛకూడ కలుగజేయును. అజ్ఞానులగు సహచరులను (అనగా తరచు మనసుకు విచారమును కలుగచేయు మాటలను చెప్పువారు) కూడ చేరనీయరాదు. ఎందులకన నట్టివారు, గర్భవతులు ప్రసవించునపుడతి కష్టముల ననుభవింతురని గోరంతలు కొండంతలుగాచేసి చెప్పుచుందురు. అవి యన్నియు నసందర్భములేయైనను గర్భవతులు వాటిని యదార్థములని తలంచి భయభ్రాంతలై అనవసరముగ మనోవ్యాకులత పెట్టుకొని పలువిధములగు కష్టములను లోనగుచున్నారు.

పై మనోవ్యాకులత భయము కలిగినచో తచ్ఛాంతికి ఉపాయములేమనగా— తఱచు పరిశుభ్రమగు గాలి సేవించుచుండుట, శరీరమున కాయాసము కలుగకుండునట్లుగ వినోదకరములగు స్థలముల కరుగుచుండుట, సంతోషమును కలుగచేయు గ్రంథములు చదువుటకాని, సహచరులతో కాలక్షేపము చేయుటగాని, ఉపయుక్తములును, శరీరమునకుతగు పరిశ్రమనిచ్చు కార్యములయందు నిమగ్నులై యుండుట మొదలగునవి.

2. మూర్ఛ—అపస్మారపు ఈడ్పులు.

పై రోగములు గర్భిణులలో తరచు కలుగుచుండును. అందున విశేషము బలహీనులకును, మృదుల శరీరలకును మరియు నెక్కువగా సంభవించుచుండును. పై రోగములు ప్రత్యేకముగా కలిగినపు డంత హానికరములుకావు గాని హృదయరోగముతో కలిసి వచ్చినపుడు ప్రాణాపాయకరములు.

పై రోగములు గర్భముదాల్చిన మొదటి రోజులలో వచ్చిన సులభముగా నివారణ యగును కాని నెలలు నిండినవెనుక సంభవించినచో ప్రసవానంతరము చాలకాలము వరకవి తగ్గవు. ప్రసవకాలమందవి వచ్చినచో చాల చిక్కులుపెట్టును.

పై రోగములకు గొంతుకలో గురగురలాడుట, నాలుక కరచుకొనుట మొదలగు లక్షణములుండవు కాని, ఎక్కువబడలిక, నోరు తెఱచుటకును, ఆవులించుటకును అసమర్థతకలిగియుండి కళ్లు మూతలువడి, చుట్టునున్న వస్తువులన్నియు గుండ్రముగా తిరుగుచున్నట్లుండును. ముఖము పాలిపోయి చెవులలో హోరుకలిగి, ఆయాస మెక్కువయై జ్ఞానశూన్యత కలిగియుండును. పై రోగములకు కారణము లెవ్వియనగా, మానసికోద్రేకము, తరచు నిద్రలేమి, అతిసారము, లేక యితరస్రావములు, దుస్తులను బిగించి కట్టుకొనుట, పరిశుభ్రమగు గాలిరాని గదులయందు తరచు కూర్చుండుట మొదలగునవి.

శాంతికరోపాయములు:— అపస్మారపు కంపములు వచ్చి రోగి జ్ఞానశూన్యత కలిగియున్నపుడు చల్లనినీళ్లను ముఖముపై చల్లవలయును. సాధారణపుమూర్ఛ వచ్చినపుడు మంచిగాలి విస్తారముగా వచ్చుస్థలమున రోగిని వెల్లకితల పరుండబెట్టి చేతులును తలయు కొంచెము ఎత్తుగానుండునట్లు చేసి అనగా తలదిండ్లు పెట్టి అస్థలమును నిశ్శబ్దముగానుంచవలయును. ఉక్కగానుండు గదులలో పండుకొనుటవలన కాని, ధరించిన దుస్తులు బిగువుగానుంచుటవలన కాని ఒక్కొ-

కపుడు కంపములు రావచ్చును. అటువంటి సమయములందు ఆకారణమును తొలంగించినచో అనగా రోగిని ఆగదినుండి మార్చి బాగుగా గాలివచ్చు మరియొక స్థలమునందు పరుండబెట్టుటవలన కాని, బట్టలను వదులుగా కట్టుటవలన కాని యీబాధ శాంతించును. నొప్పులు ప్రారంభించిన పిదప పై రోగములు కలిగినచో రక్తస్రావములు కలుగును కావున కడుజాగ్రత వహించియుండవలయును.

తలనొప్పి—తలయు కండ్లును తిరుగుట.

గర్భవతులు పై రోగములను కలిగియుండినచో తరచు చాలబాధను కలుగజేయుచుండును. వెలుతురు చూడలేకపోవుట, ధ్వని వినలేకపోవుట, తలయు ముఖమును ఎక్కువ వేడిగానుండుట, తలయు కండ్లును తిరుగుచుండుట, కంగారుతో కూడిన ఆలోచనలు గలిగియుండుట, దృష్టిమాంద్యము, అజీర్ణమును కలిగియుందురు. కొందరికి ముఖము పాలిపోయి మంచువలె చల్లగానుండును. కండ్లు బరువుగానుండుట, తలపై పెద్ద బరువుంచినట్లుండుట, హృదయము ఎక్కువగా కొట్టుకొనుట, వణకుట, జీర్ణశక్తి సరిగా లేకపోవుట, జీర్ణకోశసంబంధమైన రోగములు కలిగియుందురు.

తచ్ఛాంతికరోపాయము లేమనగా:— వేళకు సరిగ నిదురపోవుచు సరియగువేళ కాహారమును సేవించుచు, వేడిగాను, ఉక్కగానుండు గదులలో పరుండకుండ, ఎలక్ట్రిక్ దీపములు మొదలగువానిని తరచు చూచుచుండక, ప్రతిదినము ఉదయముననే కాలకృత్యముల నిర్వర్తించుకొని చలినీళ్ల స్నానమొనర్చి వెంటనే పొడిగుడ్డతో శరీరమును బాగుగా తుడుచుకొనుచుండుట, ప్రతిదినము నిర్మలములగు స్థలములందు పరిశుభ్రమగు గాలిలో తిరుగుచుండుట, సంసారమందు కష్టతరమగు పనులు చేయుట కాని, తస్సంబంధమగు వ్యాకులతగాని కలిగియుండక భోజనాదులను నెమ్మదిగా (అనగా హడావిడిగాగాక బాగుగానమలి) సకాలమున మితముగా తినుచుండుట, మైకము కలిగించు పదార్థములను, టీ, కాఫీ మొదలగువాటిని వర్జించుట మొదలగునవి. పై నియమములను సరిగ గమనించినచో ప్రతిదినము కాలవిరోచనము సరిగయగును. అందువలన మలబద్ధము కలుగనేరదు. పై రోగములు సంభవింపవు.

## పంటిపోటు.

సాధారణముగా గర్భము ధరించినది మొదలు కొందరు స్త్రీలు పంటిపోటుతో బాధపడుచుందురు. అటువంటిపోటు నరముల సంబంధించినదిగాకూడ నుండును. పంటిపోటు గర్భముదాల్చినది మొదలు ప్రసవముగులోపల నెప్పుడైనను రావచ్చును. ఆబాధ చెడిపోయిన ఒక పంటివలనకాని కొన్ని పండ్లవలన కాని కలుగుటయో, లేక పండ్లతో నిమిత్తము లేకయే దవుడపాడుగు నను భాధకలిగియుండుటయో అయియుండును. ఒక్కొకపుడు రోగి భరించలేనంత బాధకలిగి రోగిని జ్ఞానశూన్యరాలినిగాకూడ చేయును. అటువంటి సమయములందు పండ్లనుతీసివేయించుకొనుటకు కొందరు ప్రయత్నింతురుకాని జ్ఞానవంతులగు వైద్యులైనచో

పండ్లుతీయు నిరాకరింతురు. ఎందువల్లననగా గర్భస్రావముకలుగు అలవాటుగల స్త్రీ వైద్యునితో పన్నుతీయుటవలన కలిగిన బాధవలన గర్భస్రావము కలుగవచ్చును. అట్టి పంటి పోటులకు హోమియోపతి వైద్యవిధానమునందు వెంటనే బాధనుతగ్గించుట కనేకములగు మందులుకలవు.

తచ్ఛాంతికరోపాయములేమన తఱచు చలి, తేమగల ప్రదేశములలో నివసింపకుండుట, ఆరోగ్యము సరిగానుంచుకొనుట, ముఖ్యముగా జీర్ణశక్తిని బాగుగాకాపాడుకొనుట, ప్రతిదినము స్నానమొనర్చుచు ఆరోగ్యమును సరిగానుంచుకొనుట మొదలగునవి. గుండెదడ.

నీరసముగానుండువారిలోను, నరముల నిస్సత్తువకలిగియుండువారిలోను, ఈరోగము కలుగుచుండును. కొందరికి గర్భముదాల్చిన వెంటనేయున్ను, మరికొందరికి గర్భములో శిశువుకదలుట మొదలుపెట్టిన నాటనుండియు కొందరికి నెలలునిండినవెనుకయున్ను కలుగుచుండును. ఇందులకు కారణములెవ్వియనగా గర్భముదాల్చినవెంటనే కలుగునరముల నిస్సత్తువ యొకటి, కడపటిమాసములలో రక్తపిత్తములనగా ఎక్కువరక్తమును కలిగియుండుటయొకటియును కారణములు. గర్భమందలి శిశుసంచలనము, అజీర్ణము, మితిమీరి టీ, కాఫీలనుసేవించుట, మానసికోద్రేకములుకూడ కారణములై యున్నవి. తచ్ఛాంతికరోపాయము లెవ్వియనగా:—జీర్ణకోశమును బాగుగా కాపాడుకొనుట, మానసికోద్రేకము, వేడిగానుండు గదులలోనివసించుట, గాలి రాపిలు లేకుండ ద్వారములను బంధించుగదులలో నివసించుట మొదలగునవి పూర్తిగా మానుట మొదలగునవి.

## ఆరోగ్యసూత్రములు—కండ్ల విషయము

1. ప్రసవించిన వెంటనే బిడ్డలకండ్లను టంకణక్షారపు నీళ్లలో (Boric lotion) శుద్ధమైన దూదిని తడిపి మెల్లగ కండ్లను కడుగవలయును. ఆ నీళ్లలోనే చేతులనుకూడ కడుగవలయును. లేకున్న కంటిజబ్బులు వచ్చును.

2. శిశువులను యెండవెలుతురు, దీపము వెలుతురు చూచునట్లు పరుండబెట్టకూడదు. వెలుతురువల్ల బిడ్డల కండ్లకు బాధకలిగి మూసుకొందురు. తల్లిపాలతో శిశువులకండ్లను కడుగుచుండిన శ్రేష్ఠము.

3. కండ్లలో నలుసులుపడిన కండ్లను రుద్దకూడదు. నలుసు పడినవెంటనే కండ్లను రెండు నిమిషములు మూసుకొనియుండిన కంటిలో నీరూరి, పడిన నలుసును రెప్పప్రక్కకు వచ్చునట్లుచేయును. సులభముగ కన్ను తెరచి రెప్పను సన్నకడ్డీలో ముందుకు నలుసును బైటికిలాగి తీయవచ్చును.

4. కంటినలుసు తీసినవెంటనే చల్లనినీళ్లలో కండ్లను కడుగవలయును.

5. సున్నము, కారము, పులుసు వగైరాలు కండ్లలో పడినప్పుడు పలుమారు శుద్ధజలముతోగడిగి, వెంటనే కొద్దిగ వెన్ననుగాని టెంకాయచమురునుగాని రెండు మూడు బొట్లను కండ్లలో వేయవలయును. లోహపుతునకలు కండ్లలో పడినవెంటనే వైద్యునిసహాయము కోరుము.

6. నిదురలేచినవెంటనే కండ్లనునులను చేతితో రుద్దకూడదు. గోరువెచ్చని నీళ్లతో రెండు మూడు పర్యాయములు కడుగవలయును. రాత్రి పరుండునప్పుడు కండ్లను చల్లనీటిలో కడిగిన మంచి నిదుర పట్టును. ప్రకాశమైన వెలుతురును చూడకుండుటకు ప్రయత్నించవలయును.

7. కండ్లు ఎఱుపుగనుండినను బరువుగనుండినను వెంటనే వైద్యునివద్దకు పోవలయును.

# పాకకళ

—వాకుడుకాయ కూర—

వాకుడుకాయలు యల్లావుంటవో కొందరు పట్టణవాసు లెఱుగరు. ఎంచేతనంటే—అవి బజారులో అమ్మబడకపోవుటచేత! ఎందుకు అమ్మరంటే—వాటి వుపయోగం తెలియకపోవుటచేత! సాధారణంగా యేటివొడ్డునను బయళ్లలోను, ఆచెట్లు కనుపిస్తవి. కాని పండులేకుండ ముండ్లువుండుటచేత కాయలుకోయుట కష్టమగును. పట్టుకారుతో కోసిన సులభంగావుండును. ఆకాయలు గోలుగుండంత పరిమాణంలో ముండ్లవంకాయల ఆకారం కలిగివుండును. ఆకాయలు తెచ్చి సుంద్రాతితో పగులకొట్టి, పైముండ్లను, లోపలి విత్తనములను తీసివేసి, నీళ్లలో బాగాకడిగి గాలించాలి. విత్తనము లేమాత్రమును మిగిలియున్న నోరు జిలగావుంటుంది. ఆ తొక్కలను వుప్పు, పసుపు వేసి బాగావుడికించాలి. బాణలిలో మినపపప్పు, ఆవాలతో చేతిలో తిరుగబోతచేసి యీ తొక్కలను అందులోవేసి కవరువిరిగేలాగు చక్కరయును చక్కని గోటిపులునును కారమునువేసి యితర కూరలవలెనే కొంతసేపు సెగపైవుంచాలి, రుచిగావుండును. ఈ కూరలో అద్భుతమగు సుగుణమున్నది. దీనిని ఒకపక్షము దినము లుపయోగించిన మేహాదగ్గులు, (పొడిదగ్గు) మాయమైపోవును. నిక్కాక శరీరముల వారికి మిక్కిలి తగియుండును. పైత్యకారక శరీరమును సమశీతోష్ణమునసుంచును.

—అలచందకాయ కూర—

చిక్కుడుకాయలువలె అలచందకాయలకు ప్రక్క ఈనెలు తీసి తుంపులు చేయవలెను. ఉప్పు, పసుపు వేసిన నీళ్లలో వుడకనిచ్చి, తిరుగబోతలో వేయవలెను. లేతకాయలైన వుడుకపెట్టకుండగనే తిరుగబోతలో వేయవచ్చును. కారం, నూవుపిండి, బెల్లం, గోటిపులును వేసి చేసిన కూర, యించుమించుగా గోరుచిక్కుడుకాయల కూరవలెనేవుండును. సామాన్యముగా భేదమును కనిపెట్టజాలరు. పెండ్లిండ్లలో వియ్యాలవారికి కూర గోరుచిక్కుడుకాయ క్రింద చెలామణి చేయవచ్చును. తిన్నతరువాత గేలిచేయవచ్చును. మోటుపరసముగాదు. బీదవారల భోజనపాదరుసగుటచే వియ్యాలవారు వింత పరసముక్రింద లెక్కించెదరు.

—సబ్నీసు కమలాబాయమ్మ

—కొబ్బరికోరు కోవాబిళ్లలు—

ఒక కొబ్బరికాయను తెచ్చి సరిగా మధ్యకు పగులునట్లు కొట్టవలయును. అట్లు కొట్టినచెక్కలను కోరముతో కోరవలయును. ఒక ప్రొయ్యిమీద బూరెలమూకుడునుంచి యీ కోరునందులోవైచి దోరగా వేయించవలెను. అప్పుడది కమ్మని సువాసనగానుండును. అప్పుడు (కాయ చిన్న పెద్దలను బట్టి) బెల్లముపాకముపట్టి ఆపాకములో కోరును వేయవలయును. ఒక పళ్లెములో నెయ్యిపూసి పాకములో వేసిన కోరునందులో వేయవలయును. అప్పుడది పళ్లెమంతయు ప్రాకును కొంతసేపటికి కడిగట్టిగ అచ్చువలె తయారగును. దానిని చాకుతో బిళ్లలవలెకోసి ఆబిళ్లలను తినవచ్చు చాలరుచిగానుండును.

—అకెళ్ల రత్నావతీదేవి

—మామిడికాయ నీళ్లు:—

మంచి రెండు మామిడికాయలు, కుమ్ములో పెట్టి బాగ ఉడికినాక తీసేది. అవి పైబూడిద గుడ్డతో బాగ తుడిచి ఒక కళాయిపాత్రలో మూడు అరపళ్లు నీళ్లుపోసి ఈకాయలు అందులోవేసి బాగపిసికి ఆ నీళ్లంతయు మరొకపాత్రలో వడకట్టి, అది కళాయిపాత్ర, అందులో ఒకపలం చక్కెరవేసి ఆ సలిలంబుల ద్రావిన వేసవి కనుకూలం. ఎండబెట్ట తీసివేయును. మా అనుభవం.

—కంకిపాటి రుక్మిణమ్మగారు

—బియ్యపు మురుకు—

ఒక గిన్నెతో రెండు గిన్నెలు బియ్యమును 1 గిన్నె మినపపప్పును కొలిచి నానబెట్టవలెను. 12 గంటలకాలము నానినపిదప వడియాబోసి రాళ్లు లేకుండ గాలించి మెత్తగా రుబ్బవలెను. రుబ్బునపుడు నీళ్లు చల్లకుండ గట్టిగ రుబ్బవలెను. మెత్తగ రుబ్బినపిదప తగినంత ఉప్పు కొంచెము జీలకర్ర వేసి రుబ్బి ఒక పాత్రలోనికి తీసికొనవలెను. పొయ్యిపైన బాణలిలో నేతినిపోసి అది కాగినవెనుక రుబ్బినపిండి మురుకులు చేయు గొట్టములో వేసి మురుకులుపిండి దోరగ వేగిన తరువాత తీసి భుజించవలెను. వీనిని డబ్బాలో వేసి గట్టిగామూసివుంచిన నాల్గైదు దినములవరకును బాగుగనుండును.

—పచ్చి అరిసెలు—

బియ్యముపిండికొట్టి పిండి తడిగానుండగనే రెండు గిన్నెల పిండి కొలచి ఒకపాత్రలోపోసి అదే గిన్నెతో ఒకగిన్నె జీడిపప్పు 1½ గిన్నె చక్కెర కొలచి ఆపాత్రయందేపోసి పాలు కొద్దిగా చల్లి కలిపి నెయ్యిపోయుచూ మెత్తగా నూరవలెను. బాణలిలో నేయిపోసి అది కాగినవెనుక నూరినపిండి చిన్న చిన్న వుండలుగాతీసి ఒక అరటియాకు ముక్కకు నేతినిరాచి అందుపైన ఈ వుండపెట్టి అరిసెవలెతట్టి నేతిలోవేసి వేయించి తీయవలెను. వీనిని మామూలు అరిసెలవలె నెయ్యి వచ్చునట్లు వత్తకూడదు.

—తాయి రత్నమాల

—పులిహోర (రావణాభాత్)—

గంధ్రబియ్యమును బిరుసుగ అన్నమువండి ఆ అన్నమును ఒక ఆకులో ఆరపోసి అందులో పసుపు, ఉప్పు, నూనె తగుమాత్రముగపోసి కలిపి (కుంచెడు బియ్యము అన్నమునకు సేరు నూనెపోసి కలుపవలెను) ఒకచోట నుంచవలెను. ఒక గిన్నెలో కొంచెము నూనెపోసి పొయ్యిమీదపెట్టి ఆనూనె కళపెళ కాగుచున్నపుడు దానిలో మినపపప్పులు, మెరపకాయ ముక్కలు, ఆవాలు, అల్లంముక్కలు, కరివేపాకు, పచ్చిమెరపకాయముక్కలు, ఇంగువ, నానపోసిన సెనగపప్పులు వీటిని తగుమాత్రముగవైచి కమ్మగ వేయించి ఇదివరలో తయారుచేసి సిద్ధముగనుంచుకొనిన అన్నములోవేసి కలిపి దానిలో తగుమాత్రము వేయించినమెంతులపప్పు పిండిని నిమ్మకాయలేక దబ్బకాయలరసమునువైచి కలిపి భుజించిన మిక్కిలి రుచిగనుండును. మంచి జీర్ణశక్తిని కలుగజేయును. నిమ్మకాయలు, దబ్బకాయలు దొరకనిచో చింతపండు పులుసు వేయవచ్చును. కొందరు చింతపండు పులుసును ఉడికించివేయుదురు. కొందరు పచ్చి పులుసునే వేయుదురు. ఉడికించిన చింతపండు పులుసు వేసిన పులిహోర 5, 6 రోజులు నిలవగనుండును. పచ్చిపులుసు వేసినచో 2, 3 రోజులే నిలవ ఉండును. ఇట్లు తయారయిన పులిహోర మొదటి రోజుకంటె మరునాడు మిక్కిలి రుచికలిగియుండును. ఇది రుచిగనున్నదని చాలా తినినచో శరీరమునకు వేడిచేయును.

—పిసపర్తి అన్నపూర్ణమ్మగారు




తండ్రి:—అబ్బాయీ, నువ్వు పెద్దవాడవయ్యాక ఎవరిని పెళ్ళిచేసుకుంటావురా?

కొడుకు:—నాయనమ్మని చేసుకుంటా నాన్నా.

తండ్రి:—ఛీ గాడిదా, తప్పు, అల్లాంటిమాట అన కూడదు.

కొడుకు:—నాన్నా, మరి నువ్వు మాఅమ్మని చేసుకున్నావు కదూ. నేను మీఅమ్మని చేసుకుంటాను.

* * *

మేష్టరు:—ఒకటోవాడూ, నీవిందాక రెండోవాణ్ణి కుర్చీతో కొట్టావట ఎందుకూ?

ఒకటోవాడు:—బల్ల ఎత్తలేకండీ.

* * *

మేష్టరు:—సుందరం, ఈ లెక్కకి అన్సరు అలా తక్కువ వచ్చిందేం?

సుందరం:—నిన్న పొద్దున్న మా అమ్మ చేతి కిచ్చానండీ.

మేష్టరు:—అయితే రేపు అడిగి పట్రా.

* * *

"రావూ, మీతమ్ముడేం చదువుతున్నాడు?"

"ఇంజనీరింగుకి బి.ఇ. చదువుతున్నాడు."

"ఎక్కడ?"

"రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీలో."

* * *

"ఒరేయి రామూ, రామాయణం ఎవరు వ్రాశారురా?"

"ఉత్తర వ్రాసిందిరా."

"నీ మొహం అంతా అబద్ధం."

"నామాట అబద్ధంఅయితే శాస్త్రులుగారింట్లో చూడు, ఉత్తరరామాయణం అని వ్రాసివుందో లేదో."

* * *

ఒకడు:—నీవు యీతలో ప్రవీణుడివేమో, యెంత సేపువరకూ యీదగలవు?

మరొకడు:—మునగకుండా యున్నంతసేపు.

* * *

టిక్కెట్టు కలెక్టరు:—యీ కుర్రవాడికి 15 యేండ్లు దగ్గరదగ్గర యున్నాయిగదా, టిక్కెట్టు యెందుకు కొనలేదు?

ప్యాసింజరు:—మాట్లాడడం వచ్చేఅంతవరకు అవసరం లేదేమో!

టిక్కెట్టు కలెక్టరు:—పాపం, అయితే యీ పాలు త్రాగే కూచిఅబ్బాయికి యింకా మాటలు రావేం?

ప్యాసింజరు:—అసలు రావండి—మూగాడు.

* * *

గురువు:—ఉత్సాహము కలిగించని విషయాలగురించి వసపోసినట్లు వాగుతూయుండేటటువంటివాడ్ని చూచి అందరూ యేమని పిలుస్తారు?

శిష్యుడు:—గురువుగారని.

* * *

ఒకడు:—ఏమండీ! మీరు ప్రతి లెక్చరులోను "ఫూల్, ఫూల్" అని జాస్తీగా ప్రయోగిస్తారటే!

ప్రొఫెసరు:—ఏ ఫూల్ చెప్పాడు యీ ఫూలిష్ కబురు మీకు?

* * *

ఒకడు—ఆ ఆడమనిషి అలా కొట్టుకుపోతూవుంటే చూస్తూ వూరుకుంటావేమయ్యా?

ఇంకొకడు—మరో ఆడదాన్ని ముట్టుకుంటే మా ఆవిడ వొప్పుకోదయ్యా. నీవు బ్రహ్మచారివైతే పైకి యీడ్చుకురా.

* * *

# బాలవిజ్ఞానశాఖ

## దాగుడుమూతలపాట

సోమయాజుల వెంకటరమణగారు

దాగుడుమూతా దండాకోర్
పిల్లీవచ్చే పల్లేరుగాయ్
ఎక్కడదొంగ లక్కడనే
గంగారమ్మ గప్‌చిప్.

## బువ్వముపాట

చిట్టిచిట్టిమిరియాలు
చెట్లకిందపోసి
పుట్టామన్నూ తెచ్చి
బొమ్మారిల్లుకట్టి
బొమ్మారింట్లోపిల్లాతల్లికి నెయ్యి లేదు
నాతలకూ నూనెలేదు.
అల్లావారింటికి చల్లకుపోతే,
అల్లవారికుక్క భౌమన్నాది,
నాకాళ్ళగజ్జెలు ఘల్లుమన్నాయి.

---

## మొలక

అబ్బూరి వాణీకుమారరావుగారు

ఓచిరుతమొలకా
నాచిన్ని మొలకా
భూమిపై కీవచ్చి
నామనవి వినా

కొంతసేపైనయూ
వింతప్రపంచమూ
గర్వముతోడనూ
కాంచగవచ్చునూ.

చిన్ని మొలక
సిగ్గుతోను
వింతలోకము
చూడలేచింది!

---

## యశోదవైభవము

వున్నవ లక్ష్మీనారాయణగారు

(1) గొల్లపిల్లలఅల్లరో
ద్దురా। పోకిళ్ళుపొన్నా
నలుగురినోట్లో నానవద్దురా॥

(2) గుప్పిటనిండా పప్పులు
పోసెదా। ఒప్పులకుప్పా
తియ్యాని। తాలాంబెట్టెదా॥

(3) చుంచుదువ్విపింఛం
బెట్టెదా। ముద్దులమూటా
పట్టుకుచ్చుల దట్టిగట్టెదా॥

(4) బుజ్జగజ్జెలుబొజ్జకు
జుట్టెదా। అందాలచుక్కా-
బిళ్ళంగోడుచేత బెట్టెదా॥

(5) బబ్బుబోసిఁజబ్బదోడి
గెద। మురిపేలమువ్వా,
బువ్వబెట్టిఁ తువ్వబట్టెద॥

(6) తొట్టిగట్టిఁబబ్బోబెట్టెద
బంగారుకొండ। చిచ్చి
గొట్టి జోలబాడెద॥

# కథలు

## "అదృష్టం"

శ్రీమతి వీరమాచనేని రంగనాయకమ్మగారు

అనగనగా నొకయూళ్లో నొక మంగలి యుండేవాడు. వాడు చాల సోమరిపోతు. అక్కడక్కడ తిరుగుచూ డాబులు కొట్టేవాడు. వాడు దమ్మిడీసంపాదనలేకుండా తిని తిరుగుచుండెను. పాపం వానికి చాలమంది పిల్లలుకూడా కలరు. వానిభార్యకు వీని యందు చాలకోపం. ఒకరోజున వాని యింటిలో అన్నములేక పిల్లలు ఏడ్చుచుండిరి. వా డూరంతాతిరిగి వట్టి చేతులతో నింటికి తయారయ్యెను. వాని భార్య కోపంతో 'నాదగ్గర నున్నడబ్బంతా అయిపోయినది. ఈపిల్లలను, నిన్ను ఏలా పోషించను? ఎక్కడకైనా వెళ్లి డబ్బు సంపాదించుకొనిర'మ్మని చెప్పెను. వాని మనస్సునకీ మాటలు నాటుకొనెను. వాడు తన మంగలిపొది తీసుకొని ప్రయాణమయ్యెను. వాడు పోగా పోగా ఒక చిట్టడవి చేరుకొనెను. అక్కడ ప్రొద్దుగ్రుంకెను. ఒక చెట్టుక్రింద తన కంబళి పరచుకొని వాడు పడుకొనెను. సగము రాత్రి జరిగినతర్వాత ఆ చెట్టు గట్టిగా కదలెను. వెంటనే యొకభూతము చెట్టుదిగి వాని ముందుకువచ్చెను. వాడు దానినిచూచి భయముతో వణకసాగెను. కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని తన పెట్టెలోని అద్దము తీసి దాని యెదుటపెట్టి 'నీవు మంచిసమయమున నాదగ్గరకు వచ్చితివి. నా యజమానునకు రెండు భూతములతో పనిగలదు. ఒక దానిని పట్టుకొని యీ పెట్టెలో బంధించితిని. నిన్నుకూడ బంధించెద'నని చెప్పెను. ఆ భూతము తన ప్రతిబింబము అద్దములోచూచి భయముతో 'నీకు వెయ్యిమొహారీలుగల సంచి యిచ్చెదను. నన్ను వదలి పొమ్మ'ని చెప్పెను. వాడు తనను చంపకుండా తిరిగి మొహారీలు యిచ్చునని మనసులో సంతోషించుచూ పైకిడాబుగా 'త్వరగా తెమ్ము నిన్ను వదలివేసెద'ననెను. ఆభూతము వెంటనే చెట్టుకొమ్మకు కట్టబడిన మొహారీలసంచి తెచ్చియిచ్చెను. వాడు తన అదృష్టమునకు సంతసించుచు ఇంటికిపోయెను. కథకంచికి, మనమింటికి.



## కటుకుల మాన్యము

కె. యస్. ప్రకాశరావు గారు

ఒకదేశమును తెలివిమాలిన రాజు పరిపాలించుచుండెను. అతని రాజధానిలో సాంబయ్య యను బ్రాహ్మణుడుండెను. అతనికి జీవనోపాయములేక రాజుగారి నాశ్రయించెను. రాజు వానిపై దయతలచి "బ్రాహ్మణుడా! ఈయూరిలో చనిపోయెడు అన్నికులములవారికిని శవములుమోసుకొనిపోవుటకై వెదుళ్లతో నీవు కటుకులుకట్టి యిచ్చుచుండుము. ఎవరి యింటనైన మరణము సంభవించిన యెడల గృహయజమానులు నీ కాసంగతి తెలియ చేసినయెడల వెంటనే యొకకటుకు తయారుచేసి వారికి పంపించవలెను. ఇందుకు నీకు రెండు ఎకరముల భూమి యిచ్చెదము" అని సెలవియ్యగానే బ్రాహ్మణుడు మిక్కిలి సంతోషించి, మాన్యము స్వాధీనముచేసికొని గ్రామములో చని

పోయినవారందరికిని కటుకులు కట్టి యిచ్చుచుండెను. ఇట్లుండగా సాంబయ్య, బంధువులను చూచుటకై గ్రామాంతరము వెళ్లెను. వెళ్లిన తరువాత వెంటనే వచ్చుటకు వీలులేక పోయెను. పదిదినములాలస్యమయ్యెను. ఆరోజులలోనే గ్రామస్థులలో నొకడు మృతినొందెను. ఆ యింటియజమానుడు వారింటికి వర్తమానముచేసెను. భర్త, గ్రామాంతరము వెళ్లెనని భార్య తిరిగి వర్తమానమంపెను. ఆమాట విని మృతినొందినవాని కుమారుడు రాజుగారితో, సాంబయ్య సరిగా పనిచేయుటలేదని, ఫిర్యాదు చేసెను. బ్రాహ్మణుడు ఊరినుంచి వచ్చినతర్వాత జరిగినసంగతంతయు భార్య, అతనితో చెప్పెను. ఆ సంగతివిని యాతడెంతో భయపడుచుండగా రాజుగారు వానిని తన యెదుటకురమ్మని యాజ్ఞాపించిరి. అతడు భయముతో గడగడ వణకుచు రాజుగారిసన్నిధి కరిగి నిలుచుండెను. రాజు వానిని జూచి కోపముతో మండిపడి యిట్లనిరి: "సోమరిపోతా! ఊరిలోవారికి కావలసివచ్చినపుడు పని చేయక పొరుగూరికిపోయినయెడల కటుకులు కట్టుటకు నీతాత యెవ్వడైనవున్నాడా? కమ్మగా మాన్యమనుభవించుటకు నీవును, కటుకులు గట్టుటకు మరియొకడునా? నీకింత పొగరెక్కినదా? నీపొగరణచెదను." ఆపలుకులు వినగానే అతడు మిక్కిలి భయపడి రాజుగారి పాదములమీదపడి ఏడ్చుచు నిట్లనియె.

"ఏలినవారు రక్షింపవలెను. మీ దయవల్ల నేనూ నాబిడ్డలూ ఇంతన్నముతిని బ్రదుకుచున్నాము. తమరు మాన్యము తీసివేసిన నాకు దిక్కులేదు. ఇకమీదట నే నిట్టి తప్పుచేయను. చేసినయెడల నన్ను ఉప్పుపాతర వేయించండి. ఇప్పటికి నన్ను క్షమించవలయును" ఇట్లు బహువిధముల ప్రార్థించగా రాజుగారికి మరల అనుగ్రహము కలిగెను. సాంబయ్య యింటికివెళ్లి తాను పొరుగూరు వెళ్లవలసివచ్చినను తనవల్ల గ్రామస్థుల కిబ్బందిలేకుండుటకై ఎన్నో ఉపాయము లాలోచించెను. చిట్టచివర కొక గొప్ప యుపాయము తోచెను. దానిప్రకారమతడు వెయ్యి పిడుక్లుకొని నాల్గువందల కటుకు లొక్కసారియే, రాత్రీ పగలూ కష్టపడి కొన్ని పొట్టివి, కొన్ని పొడుగుపాటివి, కొన్ని వెడల్పువి, కొన్ని సన్నపువిగా తయారుచేసెను. వాటినన్నిటిని బండ్లమీద వేయించుకొని యింటింటికివెళ్లి బండ్లాపుచేసి యొక చిన్నకటుకుతీసి వారి యరుగుమీద పెట్టించి యింటివారితో ఇట్లని చెప్ప మొదలుపెట్టెను. "అయ్యా, నా కప్పుడప్పుడు గ్రామాంతరము వెళ్లవలసిన పని యుండును. అప్పుడు మీయింటిలో నెవరైన చనిపోవచ్చును. పోయినపుడు కటుకులులేక మీరిబ్బంది పడవచ్చును. అందుచేత ఒక పెద్దకటుకు ఒక చిన్నకటుకు మీయింట్లో నుంచుకోండి. పెద్దవాడు పోయినప్పుడు పెద్ద దుపయోగించుకోవచ్చును. చిన్నవాడు పోయినపుడు చిన్న దుపయోగించుకోవచ్చును''అని. ఆమాటలువిని ఇంటియజమానులు, స్త్రీలు, "ఛీ! ఛీ! దురాత్ముడా! పాపాత్ముడా! ఎంతమాటన్నావు. నీ కిదేమి పొయ్యేకాలమురా!!" యని దూషింప మొదలుపెట్టిరి. కొందరు చంపకాయలు కొట్టిరి. కొందరు పిడిగుద్దులు రుచిచూపించిరి. సాంబయ్య భయపడి కటుకులబండి వదలిపెట్టి పిక్కబలమే శరణ్యమని లేడిలాగ పరుగెత్తిపోయెను. అప్పటికీ ఇప్పటికీ తిరిగి యిల్లు చేరలేదు. కథకంచికి మన మింటికి.



## ముసలామె యుక్తి

శ్రీమతి సి. కమలాబాయిగారు

ఒకయూళ్ళో ఒక భార్యాభర్తలుండేవాళ్లు. ప్రతిరోజూ వాళ్లిద్దరూ దెబ్బలాడుకునేవాళ్లు. ఒకదినం సుబ్బమ్మభర్త, యెక్కడికో వెళ్లి అప్పుడే యింటికొచ్చాడు. రావడంతోనే భార్యనుజూచి "యేమేయ్, యేం చేస్తూన్నావు దున్నపోతులాగ? కాళ్లకన్నా నీళ్లు ముంచిపెట్టినావుకావు" అన్నాడు. "మీరుచేసేరాజకార్యాలేం మించిపోయింది! నేనేం మీయింటికి దాసీదాన్ననుకున్నారా? నే నల్లాగే దున్నపోతునైతే దున్నపోతును పెళ్ళిచేసుకున్నవారు మీరేమవుతారు?" అంది. నిలువ్వానిదానం లేకుండ కళ్లు మొఱ్ఱ

పారిసవిసుబ్బమ్మభర్తకి. కోపంతో నాలుగు పెట్టాకు వేడివేడిదోశలు సుబ్బమ్మవీపుమీాద. పిమ్మట సుబ్బమ్మ "ఓ అమ్మా—ఓతల్లీ!! రాండీ వేగిరం రాండి!! యేపాపంలో పోతాడో కొట్టి చంపేస్తూన్నా"డని కేకలువేయ మొదలు పెట్టింది. రోజూయిలాగే యేదో ఒక దెబ్బలాట జరుగుతూంటే పొరుగింట్లోనున్న ఒక ముసలా విడ చూసి చాలాచింతించింది. అందుకొక యుక్తి పన్నింది. ఒకరోజు ముసలామె, సుబ్బమ్మను పిలిచి, "అమ్మా! నీవు నీభర్తతో పడేకష్టాలచూసి నామనసుకు చాలావిచా రంగావుంది. ఇందుకు దయ్యమో, భూతమో కారణమయి ఉంటుంది. అందుకు నేనొకమందు మంత్రించియిస్తాను. ఒకమండలం సేవిస్తావా?" అంది. మహాసంతోషముతో సరే అంది సుబ్బమ్మ. "రేపు ప్రాతఃకాలం నీభర్త లేవ టానికిముందే లేచి యిచ్చటికిరా. మందు తయారుచేసి పెడతాను" అన్నది ముసలామె.

మరుచటిదినం ప్రాతఃకాలమే లేచి సుబ్బమ్మ ముసలావిడయింటి కెళ్లింది. ఒకసీసా నీళ్ళతో నింపి సుబ్బమ్మచేతికిచ్చి ముసలామె యిట్లుచెప్పింది. "అమ్మా! యిందులోని మందు నీభర్త లేవటానికిమునుపే లేచి నోట్లో పోసుకో; పిమ్మట నీభర్తయెప్పుడు బయటికి వెళ్లుతాడో అప్పుడు ఉమ్మేసి నీ భోజన వ్యవహారాలు ముగించుకో; మరల నీభర్త తలచూపేసరికి నోట్లో మందు ఉండాలి. జాగ్రత్త మరచిపోకు" అంది ముసలామె. పిమ్మట మందుతీసికొని యింటికివచ్చింది సుబ్బమ్మ. మరుచటిదినం వేకువనే లేచి కాల కృత్యములన్నియు ముగించుకొని భర్త లేవ టానికిముందే మందు నోట్లో పోసుకుంది. కొంతసేపటికి కంతాలేచాడు సుబ్బమ్మభర్త. "యేమే! గాడిదా, నీళ్లుపట్టుకురా! మొద్దులా నిల్చొని యేంచేస్తున్నావు అక్కడ" అన్నాడు. సుబ్బమ్మకు ఒళ్లు చుర్రున మండిపోయింది. నోటినిండా మందుండి యెల్లా మాటాడు తుంది? నీళ్లుపట్టుకొచ్చి పెట్టేసింది నిశ్శబ్దంగా.

మరల మధ్యాహ్నమయింది. "యేమే! యింకా విస్తరీ పీటా వేశావుకావు! అక్క డేమి చూస్తున్నావు నీకూతురుకొడుకులకి పెళ్లి" అన్నాడు. మారుత్తరంలేదు. గప్ చిప్!! విస్తరీ పీటా పడిపోయినాయి. సుబ్బమ్మపెనిమిటికి చాలాఆశ్చర్యంకలిగింది. క్రమంగా అన్నిపనులు సకాలానికే జరిగి పోతూవుండేవి. క్రమంగా వారిరువురిలో ఓసిద్ధమైన ప్రేమ వృద్ధివించింది. వారిదెబ్బ లాటలు, ఉన్నచోటు తెలియకుండా, పారి పోయినవి. మండలం గడచింది. ఎప్పుడూ దెబ్బలాటలూ యేడ్పులుగానున్న యింట్లో ఐకమత్యం శాంతం నెలకొన్నవి. మందు సేవించడం మానేసింది సుబ్బమ్మ. పిమ్మట భార్యాభర్తలిరువురూ ముసలామెను బహూ కరించారు.

—:o:—

## తెలివితక్కువ మంగడు

శ్రీమతి పెద్దాడ దమయంతమ్మగారు

అమాయికుడగు నొకపాటకుడు దారితప్పి యొక పట్టణమును చేరెను. ఎన్నడును చూచియుండనివా డగుటచే యాపురమందలి మేడలు, మిద్దెలు, కారులు, గాలిపడగలు మున్నగునవి చూచి యాశ్చర్యము నందెను.

పట్టణమంతయు తిరిగి యాతడు కుదకు పండ్లమ్మ

బజారునకు వచ్చెను. ఆబజారునందు పలువిధములగు పండ్లు నమ్ముచుండిరి. ఒకదుకాణముమీదనున్న పెద్ద పుచ్చకాయల నాతడు చూచి యాశ్చర్యనిమగ్నుడై తనలో నిట్లనుకొనెను. "నేను పలువిధములగు పక్షి గ్రుడ్లను గాంచితిని కాని అవి ఏ పక్షియొక్క గ్రుడ్లైయుండునో తెలియరాదు. బహుశా అవి గుఱ్ఱపు గ్రుడ్లయియుండవోపు" అని ఇట్లు తలంచి యాతడు సందేహనివృత్తికొరకై యాదుకాణదారునితో "ఇవిగుఱ్ఱపుగ్రుడ్లు కావా?"అని యడిగెను.

దుకాణదారుడు, వాని తెలివితక్కువకు సంతసించి "అవును. ఇవి గుఱ్ఱపుగ్రుడ్లే"నని పల్కెను. అంత నాపాటకుడు దాని ఖరీదు రు100లను ఇచ్చి యొక పుచ్చకాయకొని దానిని భద్రముగా నెత్తి పైనుంచుకొని దారిలో ఇట్లు తలపోయసాగెను.

"ఈ గ్రుడ్డునుండి గుఱ్ఱపుపిల్ల బయటకురాగానే దానిమెడలో గంటలు కట్టెదను. పెద్దదైన తరువాత దానినోటికి కళ్లెము తగిలించి, జీనువేసి దానిమీద స్వారిచేస్తాను. చాలా షోకుచేసుకుని అత్తవారింటికి వెళ్తాను" అని.

ఈవిధముగ తలపోయుచు నాత డొక నదిఒడ్డునకు వచ్చెను. మార్గమునకు ప్రక్కగా పుచ్చకాయ నుంచి యాతడు, నదిలో స్నానముచేయుచున్న సమయమందు కుందేలు ఆ పొదనుండి ఈ పొదకు గెంతుచు పరుగెత్తెను. దానినిచూచి గ్రుడ్డునుండి గుఱ్ఱపుపిల్ల వచ్చినదని తలచి వెంటనే యాతడు స్నానము చాలించి నదినుండి బైటకువచ్చి కుందేలువెంట పరుగెత్తసాగెను. కుందేలు డొంకలోనికి పారిపోయెను. గుఱ్ఱపుపిల్ల పారిపోయినదని యతడు కేకలువేయసాగెను. కాని దానిజాడ ఏమియు దొరకలేదు సరికదా పరిగెత్తునప్పుడు పడినందున అతని కాలిమీద పెద్దగాయమయ్యెను. 'రూపాయిలూ పోయినాయి, గ్రుడ్డునుండి గుఱ్ఱపుపిల్లా పోయిం'దని విచారించి, ఏడ్చుచు, గుండెలు బాదుకొనుచు యతడుఇంటికివచ్చి భార్యతో తాను నూరురూపాయలు పెట్టి కొన్న గుఱ్ఱము పారిపోయినదని చెప్పెను. అంతట భార్య, "నూరురూపాయలు మీకు నేను ఇచ్చితిని కావున గుఱ్ఱపుపిల్ల నాదిగాని మీదికాదు. కావున దానిని వెతికితెండు. దాని మీద నేను మా పుట్టింటికి వెళుతాను" అనెను. వెంటనే మన తెలివితక్కువపెద్దమ్మకి కోపంవచ్చి నసురుకర్ర నొకదానిని తీసికొని "నా గుఱ్ఱపుపిల్ల వీపుమీద నువ్వు స్వారిచేసి దానివీపు బ్రద్దలు చేస్తావా? అంతకుముందే నీ వీపు పెట్లగొట్టేస్తా"నని యామెను చావబాదెను. భార్య పెద్దపెట్టున నేడ్వసాగెను. ఆ ఏడుపువిని ఆపేటవారందరు వచ్చిరి. వారికీసంగతి విశదమయ్యెను. "ఎవ్వడో వీనిని మోసగించియుండును, గుఱ్ఱపుగ్రుడ్డేమిటి? వీడిపింగాకుడు! తెలివితక్కువ పెద్దమ్మ! నూరురూపాయిలు నిష్కారణముగా తగలేశా"డని వారందరు అనుకొనిరి. వారిలో నొక డాపాటకుని "ఏదీ నీగుఱ్ఱపు గ్రుడ్డు చూపు"మని యడిగెను. అంత నాతడు నదీతీరమునకుపోయి తా నక్కడ నున్నదాచిన పుచ్చకాయను తీసికొనివచ్చి చూపెను. వారందరా పుచ్చకాయనుకోసి తిని వానిని పరిహసించిరి.

:o:

# చిత్రప్రశ్నలకు సమాధానములు

[గృహలక్ష్మి ఆగస్టుసంచికలో ప్రకటింపఁబడిన చిత్రప్రశ్నలకు కొందరు పాఠకులు సమాధానములంపినారు. ఇంకను పెక్కుమంది శ్రద్ధగాఆలోచించి సమాధానములువ్రాయుటకవకాశమియ్యఁదలచి, సమాధానములనుకాని వాటిని వ్రాసినవారి పేరులనుగాని యీపత్రికలో ప్రకటింపలేదు. ఆప్రశ్నలకు సమాధానములు వ్రాయగోరువారీ నెల 20 వ తేదివరకువ్రాసి పంపుచుండవచ్చును. మరియును కవిత్వజ్ఞానముగల పాఠకులు కుతూహలముమీర పూర్తిచేయుటకీదిగువ నొకసమస్య ప్రకటించుచున్నాము. విద్యార్థకులగువారు తక్కినయూడుపాదములను పూర్తిచేసి పంపుదురుగాక! గృ॥సం॥]

## సమస్య

శ్రీమతి తిరువీధుల అనసూయదేవిగారు

ఉ॥ పూచినపూలు పండ్లగునె + భూస్థలినేగతి రిత్తవోవకన్॥




సవరణ:—

గతమాసపు 'గృహలక్ష్మి' పత్రికలో విబుధవాక్యములలో ప్రకటింపఁబడిన "పల్లెటూరి యుపాధ్యాయినులకు సలహాలు" సీరిపి ఆంజనేయులుగారి ఉపన్యాసములోనివిగా వ్రాసితిమి. అది పొరపాటనియు సాధనపత్రికాసంపాదకులగు వప్పూరి రామాచార్యులుగారి యుపన్యాసమునుండి గ్రహింపబడినదనియు, ఈపొరపాటును మన్నింపవలెననియు పాఠకులను ఉపన్యాసకులను కోరుచున్నాము. (గృ॥స॥)

## హిందూదేశ యువకులు—ఇంగ్లీషుకన్యలు:—

'స్వతంత్ర' పత్రికలో ఇసాక రామయ్యనాయుడుగారిట్లు వ్రాయుచున్నారు.

హిందూదేశమునుండి సుమారు ప్రతిసంవత్సరము 3000 మంది విద్యార్థులు ఉన్నతవిద్య నభ్యసించుటకై ఐరోపాదేశమునకు బోవుచున్నారు. అటులబోయిన విద్యార్థులలో నూటికి 17 మంది అచ్చటనే నిలచిపోవుచున్నారు. ఉన్నత విద్యకై ఈదేశమునుండి వెడలిన విద్యార్థులు ఐరోపాదేశపు వ్యామోహములపాలై అచ్చటనే కన్యల వివాహమాడి మనదేశమునకు రాజాలక నిలచి పోవుచున్నారు లండను నగరమున ప్రథమమర్యాద, బసఖానందురాలిని యామె కోమార్తెను సాయంత్రమున సినీమాలకు నాటకములకు బస చేసినవారు తీసికొనిపోవుట. అటుల బస కామందురాలి కోమార్తెను సినీమాలకు వేడుక వినోదములకు తీసుకపోలేని, అటువంటి విద్యార్థులకు సౌఖ్యము లంతగా జరుగవని నా స్నేహితులు కొందరు నాతో వివరించిరి. చెడుమార్గములు ద్రొక్కుటకు బసకామందురాలి కోమార్తెయే మన విద్యార్థులకు కారణభూతము. ఆమె రెచ్చుటకి వెళ్లినను ఆమె స్నేహితురాండ్రను మనకు పరిచయము చేయుచుండును. నేను లండనునగరమున గమనించినంతవరకు మనవిద్యార్థులకు కన్యలే వివిధ స్నేహితురాండ్రుగ నున్నారు. ఇటుల మనదేశపు విద్యార్థులు వారిని వివాహము చేసికొనుట ఇంగ్లీషుకన్యలయొక్క చర్యలవలననే.

మనదేశమునందుండు కన్యలు పురుషుల ప్రక్కన కూర్చుండుటకుగాని, వారితో ఒంటరిగా మాట్లాడుటకుగాని, ఒంటరిగా షికారొనర్చుటకుగాని, ఇష్టపడరు. అటుల యిష్టపడినను దేశపద్ధతులొప్పుకొనవు. ఇంగ్లీషుకన్యలు పరిచయమైన ఘంటమొదలు మనతో ఒంటరిగ షికారొనర్చుటయు, ఒంటరిగ సినీమాలకు, వింత వినోదములకు, డ్రామాలు మొదలగు వేడుకలకు వచ్చుటయు, మనవెంబడి కూర్చుండుటయు ముద్దులు సల్పుటయు, ఎగతాళి ఎకసెక్కెములు సల్పుటయు గలవు. ఇవన్నియు ఇంగ్లీషుదేశపద్ధతులొప్పుకొనును. కొన్ని కొన్ని విషయములలో పురుషుడు సిగరెట్టును తన నోటబెట్టి కాల్చి దానిని కన్య నోట బెట్టవలయును.

## హిందూదేశపు ఫిల్ముకంపెనీలు:—

హిందూదేశపు ఫిల్ముకంపెనీలవారు చిత్రవిచిత్రములైన నృత్యగీతములతో కూడిన నాటకముల ఫిల్ము

లనే ఫిల్ముమీదఫిల్ముగా తయారుచేయుచున్నారు కాని ప్రయాణములలో గాంచదగు సుందరప్రకృతి దృశ్యములు, సమకాలమున నచ్చటచ్చట జరుగుచుండు యాత్రలు, తీర్థములు, ఉత్సవములు, సభలు మొదలగువాని ఫిల్ములను తయారుచేయుచున్నారు. హిందూదేశమున నట్టి దృశ్యములకు కొఱతగలదా? అట్టి వింతలు తటస్థించుచుండవా? వీనివలన ప్రజలకు కలుగు విద్యావిషయకమైన ప్రయోజనము చాలా యెక్కువ. ఈవిషయమున భారతీయులు పాశ్చాత్యులకంటె వెనుకబడియున్నారని చెప్పవలెను. ఇక కథలు తీసుకున్నను వాటికథాసరళి పేలవముగను బొమ్మలతిసామాన్యముగను నుండును. పాటలు పెద్దవి కాకూడదు. సమకాలిక సంభవముల చిత్రములు మధ్య మధ్య జోడించబడుచుండవలెను. అప్పుడు మాత్రమే వాటివలన జనులకు నిజమైన ప్రయోజనము కలుగును.

(హిందూస్థానీ టైమ్సు)

సర్. యస్. రాధాకృష్ణన్ (ఆంధ్రవిశ్వవిద్యాలయపు వైసుఛాన్సలరుగారు) జినీవానగరములో బ్రాడుకాస్టు ద్వారా యీదిగువ యుపన్యాసమును వినిపించిరి:—

శాస్త్రీయపరిశోధనలు నిర్మాణకులు యంత్రములు వృద్ధియై ప్రపంచమెల్లయు ఒక్కటిగా చేయబడియు, మానవులును జాతులును మాత్రముకలసి ఇంకా ఒకటిగా ప్రవర్తింపకున్నారు. రాజకీయ భేదములు, ఆర్థికతృష్ణలును చేరి మనలను వేర్వేరు జాతులుగా చీల్చివేసినవి. ఈరాజ్యములలో 60 స్వతంత్రవ్యక్తిత్వముగలవి. ప్రపంచముయొక్క యాంత్రికశరీరమును నడిపించుటకు ఒక సార్వజనీన విజ్ఞానమును, ఆత్మను, అంతఃకరణను మనము సృజింపవలెను. సమస్తజాతులలోని విద్యాధికులును కలిసి దీనిని సృజింపవలెను. అయినను శుద్ధవిద్యావంతుల వల్ల నెట్టి ప్రయోజనమును లేదు. అయిరోపాయుద్ధమును జరిపించినవారెల్లరును విద్యాధికులే. విద్యావివేకములతో పాటు నీతిబలమును సదాశయముల కొరకు కష్టముల నుభవించగల సంసిద్ధతయును కావలెను. మన మిక్కడ శాంతినిగూర్చి సల్లాపములు జరుపుచున్నామే కాని సంస్కరణప్రయత్నములను నిరోధించుచున్నాము, ఆయుధవిసర్జనమున కాలస్యము కలిగించుచున్నాము, ఉదారభావముల నుదాసీనతతో త్రోసి పుచ్చుచున్నాము. శాంతిసంస్థాపనముకొరకు సమస్తకష్టములను పడెదముకాని పూన్కి విడిచిపెట్టము. సంప్రదాయములుగల శాంతి వాంఛకములైన చైనాహిందూదేశము లీయుద్యమమున కెంతయో తోడ్పడగలవు. సత్యమునకు, శాంతికి, న్యాయమునకు, మర్యాదకు మనము నిజమైన భృత్యుల మగుదుమేని మనమీసిద్ధాంతమును జ్ఞాపకముంచుకొందుముగాక!

"ప్రపంచములో నొక్క కారాగృహబంధితు డున్నను నే నస్వతంత్రుడనే. ఒక దాస్యజాతియున్నను, నేనుదానివాడనే!"

చీనాఅంగనలదౌర్భాగ్యము:—

చైనాదేశమునందు ప్రస్తుతము వ్యాపించియున్న అశాంతికి ఫలితముగా క్రూరులగు సిపాయిల బారికి చిక్కక లక్షలకొలది స్త్రీలు శిశువులతో బొమ్మరాళ్లవలె యేళ్లలో బడి మరణించుచున్నారు. ఉత్తరరాష్ట్రమునుండి యిప్పటికి 10 లక్షలమందియైనను పారిపోయియుందురు. వీరికి ఈపలాయనము కష్టమైయుండును. వీరిలో పెక్కు స్త్రీలు పూర్వపద్ధతులకు కట్టుపడియుండినవారు కనుక వీరి పాదములు పెరుగకుండ బిగింపులోనుండి చిన్నవైయున్నవి. ఈ చిన్నపాదములు బ్రద్దలగునట్లు వీరు కొండలమీదనుంచి పరుగెత్తుచున్నారు. వీరు నిరాహారులు. వీరుతమ పసిశిశువుల ఆకలిచూడలేక యాంగ్ట్సీ నదిలో విసరివేయుచున్నారు. పిమ్మట వారి వియోగమోర్వలేక చిత్తశాంతి గోల్పోయి తాముకూడ యేటిలోనికుఱికి భీషణ మృత్యుముఖమున దూకుచున్నారు. వీరి నిట్లు పలాయనము చేయనీయకుండ ఆపివేయుదమని సిపాయీలు తలచిరి. కాని వీరొనరించెడి యసంఖ్యాకములగు ఆత్మహత్యలు చూచి 'వీరిగతి యెటులట కానిమ్ము మనయెదుట 'నేల బలవన్మరణమునందవలె' నని విడిచివేయుచున్నారు.

—హిందూ

# గ్రంథపరిచయము

బాలాదిత్య:—

ఇది గుప్తసామ్రాజ్య పునర్నిర్మాణ ప్రయత్నము నాటి చారిత్రాత్మకమగు నవల. దీనిని పఠించినచో ప్రస్తుతము మనము మన జాతీయపునర్నిర్మాణము నకై యవలంబించవలసిన మార్గములెల్లయు గోచరము లగును. హిందూమత పునరుద్ధరణము, పరమత సహిష్ణుత అస్పృశ్యతానివారణము, విక్రమసాహసములు, పరిశుద్ధ నీతిప్రవర్తన మున్నగువానిని మనము కలిగి యుండవలెను. స్త్రీలు జాతీయభావపూరితలై యవసరమైనప్పుడు కార్యరంగమునకు దుముకవలెను. ఈ ధర్మముల ననుసరించినంతవరకు విజయ మెంత చేకూరుచుండునదియు విస్మరించుటవలన నపజయ మెట్లు సిద్ధమగుచుండునదియు, కథవలన విశదము కాగలదు. యవనచక్రవర్తుల లక్షణములును, హిందూ చక్రవర్తుల లక్షణములును తారతమ్యముతో ధర్మముల యందు జాజ్వల్యమానముగ ప్రకాశించినవి. బౌద్ధమతసిద్ధాంతములు బాలాదిత్యుని సామ్రాజ్య వాంఛాపరాఙ్ముఖునిగ జేసినవి. వేగుల నేర్పులు, ద్రోహుల యుద్యోగములు, దేశభక్తుల తెగింపులు అద్భుత రసంబును పురికొల్పుచుండును. శ్రీయుత తరిగొండ సత్యనారాయణగా రీగ్రంథమును రచించిరి. ఇట్టి దీర్ఘచారిత్రకనవల ఇదివర కెవ్వరును ఆంధ్రమున వ్రాయలేదు. చిన్న అచ్చు, 500 పుటల మేరమునను కవీంద్రుని కల్పనాసహాయముతో పురాతన గుప్త చారిత్రక సమయంబులను విహరించినను ఇంకను విహరించవలెననియే యుండును. గ్రంథము సమాప్తమైనందులకు విచారము పొడమును. జాతీయమై సులభమైన శైలి. మనోహరములగు భావములు, చిత్రములగు అభినివేశములు, అద్భుతములగు కృత్యములు, అత్యుత్తమమగు ఆశయములుకలిగి భారతదేశము యొక్క సనాతనప్రతిబింబమువలె ఇది రాజించుచుండును. కాలగర్భంబునుండి గతంబు వెగలాగి యథారూపముకంటె మనోహరముగను ప్రస్ఫుటముగను చిత్రింపగల ప్రజ్ఞ శ్రీ సత్యనారాయణగారికి పూర్వపుణ్యవశంబున చేకూరినదనవలెను. గ్రంథమును పఠించునప్పుడు మన మది కథ యనుమాట మరచి యదార్థప్రపంచమున జరుగుచున్నాదను పరవశతను నూర్పగలిగడి శక్తి అతని శైలికి స్వతస్సిద్ధముగ నున్నది. నవరచయితల కీగ్రంథశయ్య నడవడి పెట్టుచున్నదనుట అతిశయోక్తికాదు. ఆంధ్రులెల్లరు జదువదగినది. విద్యార్థులెల్లరును మననము చేసుకొనదగినది. గ్రామసంఘము, విద్యాశాఖవారును దీనికి తగిన ప్రోత్సాహము నొసగెదరుగాక! వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు వారు దీనిని ప్రకటించి ఆంధ్రభాషకు మహోపకారము గావించినా రనవలెను.

అడవిపువ్వులు:—

క్రౌనుసైజు 94 పుటలు. వెల రు 1-0-0. గ్రంథకర్త శ్రీయుత మిన్నికంటి గురునాథ శర్మగారు. ప్రకాశకులు ఆంధ్రగ్రంథమాల తరపున దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు. బాల, కవి, వానకోయిల, బూరుగు, రత్నము, సంపెగ, గేదంగి మొదలగు 30 విషయములమీద పెక్కు అన్యాపదేశ పద్యములు వ్రాయబడినవి. కల్పనలు నీతులు అమూల్యములు. శైలి లలితము, పటిష్ఠము. సంస్కృతములో తప్ప తెలుగుభాషలో ఒక్క కవి వ్రాసిన ఇన్ని అన్యాపదేశపద్యము లింత సరసమైనవి లేవని యే చెప్పవలెను. విద్యార్థులకు విశుద్ధ సుందర భాషను, విచిత్రమనోహరభావములను ఉత్తమ నైతికవాంఛలను నొసగగల ప్రౌఢకావ్యమగుటచేత విద్యాశాఖాధికారులు దీనిని ఉన్నతతరగతుల విద్యార్థులకు పాఠ్యగ్రంథముగ నిర్ణయించి గ్రంథకర్తకు తగిన గౌరవము గూర్తురుగాక!

విప్రనారాయణ నాటకము:—

క్రౌనుసైజు 140 పుటలు. వెల రు. 0-12-0. గ్రంథకర్త శ్రీయుత రూపనగుడి నారాయణరావుగారు. వైజయంతీవిలాసమను పూర్వపు విప్రనారాయణచరిత్ర ప్రబంధము అవలీలాదాయకమను తలంపుతో దానిలో కొన్ని మార్పులుచేసి గ్రంథకర్త ఈ నాటకమును వ్రాసినారు. అయినను ఇందులోకూడ వేశ్యల టక్కులు, వేశ్యమాతల నొక్కులు, విటుల పొక్కులు మొదలగునవి వివరింపబడియేయున్నవి. వేశ్యలిద్దరును బ్రాహ్మణవితంతు పుత్రికలుగాను, వారిలో నొకతె విప్రనారాయణ యను బ్రాహ్మణ

భక్తునకు పరిణయయోగ్యగను గావింపబడినది. విటకంటకి యీ స్త్రీయెల్లయు వేశ్యావృత్తి నిర్మూలన ప్రచారమునకు వినియోగింపబడును. మొత్తముపైని చేయబడిన మార్పులవలన గ్రంథమున కొకరీతి యందము గూర్చబడినదనియే చెప్పవలెను. బళ్లారి కృష్ణదేవరాయ గ్రంథమాలవారిచే ప్రకటితము.

సమాజఘోష:—

డెమ్మీసైజు 72 పుటలు. వెల రు. 0-8-0లు. గ్రంథకర్త ఆంధ్రవాఙ్మయమహోదధి, అనుమల వెంకటశేషకవిగారు, కవితాసామాన్యము, పంద్యాల. ఇది యొక 'ఆంధ్ర సాంఘిక రూపకము.' సాంఘిక నాటకములయొక్క ముఖ్యోద్దేశ్యము సంఘములోని దురాచారములను బహిరంగపరచి హేళన చేయుటయే. ఇందుకొరకు పాత్రములు కొంచెము ప్రకృతి విరుద్ధముగను వికృతములుగనున్నను నంత పరవాలేనట్లు తోచెడిని. ఇందువలన హాస్యరసమునకు ప్రాధాన్యమువచ్చుననుమాట నిజమే కాని పాత్రౌచితికి భంగము రాకమానదు. విమల తన చెల్లెలు సతారత్నముతో చేయునట్టి హాస్యములు మన సంఘసంప్రదాయములకు విపరీతముగనున్నట్లు తోచెడిని. సంపత్తుని చర్యలు సంభాషణలు రౌడీలకు సరిపోవును కాని ఉత్తమప్రవర్తనాపరుని కుచితములైనట్లు తోచవు. శఠగోపాచారి, తిరుమలాచార్యులవంటి పాత్రములు ఏ సంఘమునవైనను అవరూపములు కావు. గ్రంథము సంఘదురాచార విమర్శనాసక్తిని పాఠకులలో పురికొల్పును గనుక అంతవరకు గ్రంథకర్తగారి ఆశయము సఫలమగుననుట కాటంకము లేదు.

ఆంధ్ర హితోపదేశ చంపువు:—

డెమ్మీసైజు సుమారు 280 పుటలు. మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కీ॥ శే॥ వేదము వెంకటరాయ శాస్త్రిగారిచే రచితమై వారి చిత్రపటముచే శోభితమై యలరారుచున్నది. విషయము జగత్ప్రసిద్ధము. శ్రీవారి రచనాపటుత్వమునుగూర్చి చెప్పవలసిన దంతకన్నను లేదు. దీనిని పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘమువా రంగీకరించి యాయా పరీక్షలవారికి విధించుచుండుచో ఉన్నతతరగతులు- మొదలు ఉత్తమవిద్యాంతమువరకుగల విద్యార్థులెల్లరకు వారి వారి తరగతులకు తగిన ధీ విశేషములతోను విమర్శనా నైపుణ్యములతోను దీనిని పఠించి మంచి భాషాజ్ఞానమును విశేషము పాండిత్యమును గణించుకొనుటకవకాశము చిక్కగలదు.

పాకశాస్త్రము:—

డెమ్మీసైజు 363 దళసరి పుటలుగల గ్రంథము. వెల రు. 1-8-0లు మాత్రము. ఆయురారోగ్యముల కాధారమైనది ఆహారము. అట్టిది యెంత రుచికరమై బలిష్ఠమైన శరీరమంత బలవంతమగును. పాకశాస్త్రమును వ్రాయబూనువారు వైద్యశాస్త్రమునుకూడ బాగా తెలిసినవారైయుండవలెను. వివిధపదార్థముల తత్వమును తెలుసుకొని, ప్రమాణముల ప్రకారము వాటిని మిశ్రమముచేసి, తయారుచేసిన పాకములను భుజించునెడల వేరే మందులు తీసుకొనవలసిన ఆవశ్యకత లేదు. ఏయేసమయములయందు ఏయే శరీరతత్వములవా రేయే పదార్థములను తినవలయునో కూడ మన మెలంగియుండవలెను. ఈ గ్రంథాదిని పద్యములు వాటిగుణములు తెలుపబడినవి, అనుక్రమణిక గలదు. ఆంధ్ర ద్రావిడ కర్ణాటక దేశములయందును మరి యితరప్రాంతములయందునుగూడ ప్రచారమునయున్న 32 రకముల అన్నములు, 26 రకముల చారులు, 46 రకముల కూరలు, ఇవికాక పులుసులు, పిండిమిరియములు, గొజ్జులు, మజ్జిగపులుసులు, కూటులు, బజ్జీలు, పంగిడులు, పచ్చళ్లు, ఊరగాయలు, పరమాన్నములు, అప్పడములు, వడియములు, వడలు, బోండాలు, సుకియలు, జిలేబీలు, పూరీలు, పాకులు, దోసెలు, లడ్డులు, పోళీలు మొదలగునవి సుమారు 850 పాకములు వాటికి కావలసిన పాత్రలు, పొయ్యిలు మొదలగు వివరములతో సుదహరింపబడినవి. ఒక్కొక్క పాకమున కెన్ని పదార్థములు కావలెనో, అవి యేవో, యెంతెంత ప్రమాణములో యెట్లు తయారుచేయుటయో స్పష్టముగ తెలుపబడినది. శ్రీయుత కంది సుబ్బారావుగారు రచించినది. నాగరికమునకును హోటేళ్లు కాఫీహోటేళ్లువారికిది అత్యావశ్యకగ్రంథము. కావలయువారు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు వారిపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఆత్మచరిత్రము:—

క్రౌనుసైజు 618 పుటలు వెల రు 1-0-0 ఆంధ్రగ్రంథమాల 22 వ ప్రచురణము. ఇది శ్రీయుత రాయసం వెంకటశివుడుగారి స్వీయచరిత్రము. గ్రంథాదిని

శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ఆత్మచరిత్రల ప్రయోజనము, గృహవిద్యావిశ్వాసంగములు మానవజీవనములయందు కలుగజేయు పరిణామములు, వెంకటశివుడు గారి చరిత్రమునకు సంబంధించిన 50 సంవత్సరములలో ఆంధ్రభారత దేశములయందు సంభవించిన సంస్కారసంరంభములు ఈచరిత్రమున ప్రతిబింబించుచున్నరీతి మొదలగువానితో గూడిన పరిచయవాక్యములు వ్రాసిరి. వెంకటశివుడుగారు యీ 50 సంవత్సరములలో జరిగినయుద్యమములలో దేనిలోనైనను నడుముగట్టుకొని యుఱికినవీర పురుషులును గారు. వాటికిగొడవయేమియు లేకుండ ఆలుబిడ్డలు సిరిసౌఖ్యములు మొదలగు సాధారణవిభవములయందే లోలుడై నిశ్చింతగా కాలము గడపుకొనిన గతానుగతిక లౌకికులలో నొకరును గారు. అతని చిత్తము పల్లవకోమలము. దేశములో వీచిన ప్రతివాయువును దాని నల్లలనాడించుచున్నది. మంచి ఆశయములు కలవారు. ఆసక్తి ముందుకీడ్చును. కల మూరకయుండదు. సౌమ్యమైనవాక్కు. సజ్జనులసహవాసము. ఇట్టివారి చరిత్రములోని గుట్టుమట్టులు మనకు తెలిసినచో ఆంధ్రదేశముయొక్క సుమారు 50 సంవత్సరముల చిత్రపటమొకటి మనకన్నులముందర వ్రేలాడకమానదు. అందలి ప్రధానపురుషులు, వారు చేసినపనులు, వారి జీవితరహస్యములు, అప్పటిసంస్థల ఉదయపరిణామములు, మొదలగునవి మనకు తేటగ తెలియును. వెంకటశివుడుగారు తమ దినచర్యగ్రంథములు, ఉత్తరప్రత్యుత్తరములు మొదలగువాని నుదహరించుచు దీనిని వ్రాయుటయు, సహజముగ నతను సత్యాసక్తి కలవారగుటయు ఈ చరిత్రయొక్క చారిత్రకప్రాముఖ్యమును వృద్ధిచేయుచున్నది. చారిత్రకప్రాముఖ్యముకన్నను దీనికెక్కువ మనోహరత గలదు. అది యొప్పియున ఆకాలపుటాస్తిక సంఘసంస్కార మహాపురుషులందరిని మనకు ముఖాముఖిని చూపించి వారి ఆంతరంగిక భావనులను పరివర్తనములనుచూపించి మనల నక్కాలమున కొంతసేపు నివసింపచేయును. యథాసందర్భముగ నింకను నెంతో మంది వ్యక్తులను మనము కలియుదుము. వెంకటశివుడుగారికి జ్ఞానముపచ్చిన నాటినుండి నేటివరకుగల కాలము నెల్ల చల్లని భావస్రవంతిలో ఆత్మచరిత్రమను తరణినెక్కి ప్రయాణము చేయుచు సంవత్సరము సంవత్సరమును తిలకించుచు సుఖముగ వర్తమానమును స్వగ్రామమునకు వచ్చుచున్నట్లుండును. శైలిసాధారణము, సహజము, సులభము, చరిత్రకథానుకూలము.

నందనారుచరిత్రము:—

డెమ్మీసైజు 63 పుటలు. వెల రు 0-8-0 లు. గ్రంథకర్త శ్రీయుత ఓరుగంటి కృష్ణకౌండిన్యుడుగారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యుపోద్ఘాతముతో రాజిల్లుచున్నది. ఆంధ్రగ్రంథమాలలో ప్రచురింపఁబడినది. మాలకులంబునబుట్టినను భక్తిప్రభావంబున బ్రాహ్మణోత్తములకన్న కూడ మిన్నయై చిదంబర నటరాజునుయొక్క సాక్షాత్కారము నందిన నందనారుచరిత్ర హరిజనులకెల్ల ఆదర్శమై, సవర్ణులకెల్ల కన్నుతెరచు నంజనమై యలరారగలదు. సంభాషణములలోనివచనము లలితమై, సులభమై, వ్యావహారికమై మనోహరముగను, పద్యములు గంభీరకఠినపాకములోను నున్నవి. ఆంధ్రగ్రంథమాలవారు ఇట్టి కాలానుగుణగ్రంథములను ప్రకటించుచు దేశమున కెనలేని సేవచేయుచున్నారు.

శారద:—

ఇది మదరాసు మధుకరవేణీ ముద్రణాలయమునుండి శ్రీయుత ఎఱ్ఱాప్రగడ సత్యనారాయణగారి సంపాదకత్వమున వెలువడు 'సచిత్ర' మాసపత్రిక. 32 పుటల వ్యాసాదులుగల జూలైమాసపు ప్రథమ సంచిక మాఆఫీసుకువచ్చినది. ఇది భారతి 'మున్నగు పత్రికలననుకరించుటకు' కాని, 'నామమాత్రము లగు చిల్లరపత్రికలను దూషించుటకు' గాని, 'ఆంధ్రవిజ్ఞానాదులను సమూల నాశనము చేయుటకు' గాని, పూనుకొనక విద్వత్కవుల యభివృద్ధికై పాటుపడుచు, వారి ప్రోత్సాహములభించునని ధైర్యపడుచు ఉత్కృష్టాశయములతో ప్రారంభమైనది. శ్రీయుతులు అప్పల వీరవెంకట భోగయ్యశాస్త్రిగారు, కె. వి. కొండలరావుగారు, నందివాడ చిదంబరరావుగారు, సహదేవ సూర్యప్రకాశరావుగారు, కవికొండల వెంకటరావుగారు, పసుమర్తి కృష్ణమూర్తిగారు, భాస్కరహనుమంతరావుగారు మొదలగు పత్రికావిలేఖరులగు విద్వత్కవుల వ్యాసములును పద్యములును పత్రముల నలంకరించుచున్నవి. కవిశిఖామణులెల్లరు నిట్టి యవకాశమును గోల్పోవక పత్రికకు వ్యాసములనంపియు, పాఠకలోకము పఠించియు పత్రికకు తగిన ప్రోత్సాహమునొసగుదురుగాక!

# హరిజనాభ్యుదయము

స్థానికసంస్థలకు గ్రామపంచాయితీలకు చెందిన బావులు చెరువులు వగైరాలలోని నీరు నుపయోగించుటకు హరిజనులకుకూడ సంపూర్ణార్హతకలదనియు, దానిని విరోధించువారికి జరిమానావిధింపఁబడుననియు మదరాసులోకలు బోర్డులశాసనమునకు సవరణ మామోదింపబడినది.

* * *

తిరువాన్కూరు సంస్థానములో హరిజనులకు దేవాలయప్రవేశ మొసగవచ్చునాయను ప్రశ్న విచారింపబడుచున్నది. ఇప్పటికి 448మంది సాక్ష్యములు లభించినవి. వీరిలో 330 మంది ప్రవేశమీయవచ్చుననిరి. 93 రు కూడదనిరి. తక్కినవారు బహుజనాభిప్రాయ మెట్లున్న నట్లు చేయవలెననిరి. 330 లో 100 మంది హరిజనులు.

* * *

బళ్లారిజిల్లాలో హరిజనసేవచేయుచున్న హెచ్. సిద్దప్పగారను నొక హరిజనయువకునకు సుసీలాదేవిగారికిని కొత్తూరుగ్రామపు దీనసేవాశ్రమములో ఆగష్టు 2 వ తేదిని వివాహముజరిగినది. వధూవరులు ఖద్దరువస్త్రములను ధరించిరి. వివాహము వేదవిధిగా సమస్తమంత్రములతో జరిపించబడినది. వివాహానంతరము జరిగిన ఊరేగింపుటుత్సవమునకు సకలవర్ణముల వారునువచ్చిరి. వీరు దేశాభిమానులు. కొత్తూరిలో నొక హరిజనపాఠశాలను, ఒక రాత్రిపాఠశాలను వీరు జరుపుచున్నారు.

* * *

తూర్పుగోదావరిజిల్లా ఆలమూరుగ్రామ పునర్నిర్మాణకేంద్రమువారు 1-4-33 నుండి 30-6-33 వరకు జరిపిన వేసంగి పాఠశాలలో పఠించిన నూరుగురు విద్యార్థులలో 40 మంది హరిజన బాలబాలికలు. వీరెల్లరు సవర్ణులప్రక్కనే తగులుచు కూర్చొని పాఠములు నేర్చుకొనిరి. గ్రామస్థులెల్లరునుగూడ వీరి కృషికి మంచిప్రోత్సాహమొసగిరి.

* * *

హరిజనులలో నున్నతవిద్యను ప్రోత్సహించుటకై దేవిడుగారు పెద్ద మొత్తమునిచ్చియున్నారు. ఇందుకొరకు 177 విద్యార్థి వేతనపుదరఖాస్తులు వచ్చినవి. ఇప్పటికి 41 శాంక్షనుకాబడినవి. వీనిలో 5 మన ఆంధ్రజిల్లాలలోని హరిజనుల విద్యార్థులకు వచ్చినవి. బి. సూర్యనారాయణమూర్తిగారికి, పాము రామమూర్తిగారికి, జి. గన్నిరాజుగారికి నెల 1-కి రు 15 లు చొప్పునను, బి. రాజారామమోహను, బి. వెంకన్నగార్లకు చెరియొక రు 10 లు చొప్పునను శాంక్షను చేయబడినది.

* * *

తిరువాన్కూరు సంస్థానములో హరిజనులు మొదలగు నిమ్నజాతుల నిమిత్తము 6500 ఎకరములభూమి ప్రత్యేకపరుపఁబడినది. ఈభూములను వారు అమ్మకూడదు. తక్కిన సర్వహక్కులను అనుభవించవచ్చునని ల్యాండు రెవిన్యూ కమీషనరుగారు శాసనసభలో చెప్పిరి.

చిదంబరము హాస్టలులు:—

శ్రీయుత టి. ఆర్. వెంకట్రామ శాస్త్రిగారు చిదంబరములోని నందనారు పాఠశాలను దాని వసతిగృహములు రెండింటిని చూచి యిట్లు వ్రాయుచున్నారు.

ఒకహాస్టలులో 60మంది బాలురును మరియొకహాస్టలులో 20 మంది బాలురునున్నారు. వారెల్లరును

శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ఆత్మచరిత్రల ప్రయోజనము, గృహ విద్యావిశ్వాసంగములు మానవజీవనములయందు కలుగ చేయు పరిణామములు, వేంకటశివుడుగారి చరిత్రము నకు సంబంధించిన 50 సంవత్సరములలో ఆంధ్ర భారత దేశములయందు సంభవించిన సంస్కారసంరంభములు ఈచరిత్రమున ప్రతిబింబించుచున్నరీతి మొదలగువానితో గూడిన పరిచయవాక్యమును వ్రాసిరి. వేంకటశివుడుగారు యీ 50 సంవత్సరములలో జరిగినయుద్యమములలో దేనిలోనకిని నడుముగట్టుకొని యుంటికినవీర పురుషులును గారు. వాటికిగొడవయేమియు లేకుండ ఆలుబిడ్డలు సిరిసౌఖ్యములు మొదలగు సాధారణవిభవములయందే లోలురై నిశ్చింతగా కాలము గడపుకొనిన గతానుగతికలోకులలో నొకరును గారు. అతని చిత్తము పల్లవకోమలము. దేశములో వీచిన ప్రతివాయువును దాని నల్లలనాడించుచున్నది. మంచి ఆశయములు కలవారు. ఆసక్తి ముందుకీడ్చును. కల మూరకయుండదు. సౌమ్యమైనవాక్కు. సజ్జనులసహవాసము. ఇట్టివారి చరిత్రములోని గుట్టుమట్టులు మనకు తెలిసినచో ఆంధ్రదేశముయొక్క సుమారు 50 సంవత్సరముల చిత్రపటమొకటి మనకన్నులముందర వ్రేలాడకమానదు. అందలి ప్రధానపురుషులు, వారు చేసినపనులు, వారి జీవితరహస్యములు, అప్పటిసంఘ ఉదయపరిణామములు, మొదలగునవి మనకు తేటగ తెలియును. వేంకటశివుడుగారు తమ దినచర్యగ్రంథములు, ఉత్తరప్రత్యుత్తరములు మొదలగువాని నుదహరించుచు దీనిని వ్రాయుటయు, సహజముగ నతను సత్యాసక్తి కలవారగుటయు ఈ చరిత్రయొక్క చారిత్రకప్రాముఖ్యమును వృద్ధిచేయుచున్నది. చారిత్రకప్రాముఖ్యముకన్నను దీనికెక్కువ మనోహరత గలదు. అది రెండియున ఆకాలపుటాస్తిక సంఘసంస్కార మహాపురుషులందరిని మనకు ముఖాముఖిని చూపించి వారి అంతరంగికభావములను పరివర్తనములనుచూపించి మనల నక్కాలమున కొంతసేపు నివసింపచేయును. యథాసందర్భముగ నింకను నెంతో మంది వ్యక్తులను మనము కలియుదుము. వేంకటశివుడుగారికి జ్ఞానమువచ్చిన నాటినుండి నేటివరకుగల కాలమునెల్ల చల్లని భావస్రవంతిలో ఆత్మచరిత్రమను తరణినెక్కి ప్రయాణముచేయుచు సంవత్సరము సంవత్సరమును తిలకించుచు సుఖముగ వర్తమానమును స్వగ్రామమునకు వచ్చుచున్నట్లుండును. శైలిసాధారణము, సహజము, సులభము, చరిత్రకథానుకూలము.

నందనారుచరిత్రము:—

డెమ్మీసైజు 63 పుటలు. వెల రు 0-8-0 లు. గ్రంథకర్త శ్రీయుత ఓరుగంటి కృష్ణకొండిన్యుడు గారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యుపోద్ఘాతముతో రాజిల్లుచున్నది. ఆంధ్రగ్రంథమాలలో ప్రచురింపబడినది. మాలకులంబునబుట్టినను భక్తిప్రభావంబున బ్రాహ్మణోత్తములకన్న కూడ మిన్నయై చిదంబర నటరాజునుయొక్క సాక్షాత్కారము నందిన నందనారుచరిత్ర హరిజనులకెల్ల ఆదర్శమై, సవర్ణులకెల్ల కన్నుతెరచు నంజనమై యలరారగలదు. సంభాషణములలో నివచనము లలితమై, సులభమై, వ్యావహారికమై మనోహరముగను, పద్యములు గంభీరకవితపాకములోను నున్నవి. ఆంధ్రగ్రంథమాలవారు ఇట్టి కాలానుగుణగ్రంథములను ప్రకటించుచు దేశమున కెనలేని సేవచేయుచున్నారు.

శారద:—

ఇది మదరాసు మధుకరవేణీ ముద్రణాలయమునుండి శ్రీయుత ఎఱ్ఱాప్రగడ సత్యనారాయణగారి సంపాదకత్వమున వెలువడు 'సచిత్ర' మాసపత్రిక. 32 పుటల వ్యాసాదులుగల జూలైమాసపు ప్రథమసంచిక మాయక్షినుకువచ్చినది. ఇది భారతి 'మున్నగు పత్రికలననుకరించుటకు' కాని, 'నామమాత్రము లగు చిల్లరపత్రికలను దూషించుటకు' గాని, 'ఆంధ్రవిజ్ఞానాదులను సమూల నాశనము చేయుటకు' గాని, పురానుకోనక విద్వత్కవుల యభివృద్ధికై పాటుపడుచు, వారి ప్రోత్సాహములభించుననిధైర్యపడుచు ఉత్కృష్టాశయములతో ప్రారంభమైనది. శ్రీయుతులు అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రిగారు, కె. బి. కొండలరావుగారు, నందివాడ చిదంబరరావుగారు, సహదేవ సూర్యప్రకాశరావుగారు, కవికొండల వెంకట్రావుగారు, పనుమర్తి కృష్ణమూర్తిగారు, భాస్కర్ల హనుమంతరావుగారు మొదలగు పత్రికావిలేఖరులగు విద్వత్కవుల వ్యాసములును పద్యములును పత్రముల నలంకరించుచున్నవి. కవిశిఖామణులెల్లరు నిట్టి యవకాశమును గోల్పోవక పత్రికకు వ్యాసములనంపియు, పాఠకలోకము పఠించియు పత్రికకు తగిన ప్రోత్సాహమునొసగుదురుగాక!

# హరిజనాభ్యుదయము

స్థానిక సంస్థలకు గ్రామపంచాయితీలకు చెందిన బావులు చెరువులు వగైరాలలోని నీరు నుపయోగించుటకు హరిజనులకుకూడ సంపూర్ణాధికారతకలదనియు, దానిని విరోధించువారికి జరిమానావిధింపఁబడు ననియు మదరాసులోకలు బోర్డులశాసనమునకు సవరణ మామోదింపబడినది.

* * *

తిరువాన్కూరు సంస్థానములో హరిజనులకు దేవాలయప్రవేశ మొసగవచ్చునాయను ప్రశ్న విచారింపబడుచున్నది. ఇప్పటికి 448మందిసాక్ష్యములు లభించినవి. వీరిలో 33౦ మంది ప్రవేశమీయవచ్చు ననిరి. 93 రు కూడదనిరి. తక్కినవారు బహుజనాభిప్రాయమెట్లున్నదట్లు చేయవలెననిరి. 330 లో 100 మంది హరిజనులు.

* * *

బళ్ళారిజిల్లాలో హరిజనసేవచేయుచున్న హెచ్. సిద్ధప్పగారను నొక హరిజనయువకునకును సుసీలాదేవిగారికిని కొత్తూరుగ్రామపు దీనసేవాశ్రమములో ఆగష్టు 2 వ తేదిని వివాహముజరిగినది. వధూవరులు శుద్ధఖద్దరువస్త్రములను ధరించిరి. వివాహము వేదవిధిగా సమస్తమంత్రములతో జరిపించబడినది. వివాహానంతరము జరిగిన ఊరేగింపుటుత్సవమునకు సకలవర్ణముల వారునువచ్చిరి. వీరు దేశాభిమానులు. కొత్తూరిలో నొక హరిజనపాఠశాలను, ఒకరాత్రిపాఠశాలను వీరు జరుపుచున్నారు.

* * *

తూర్పుగోదావరిజిల్లా అలమూరుగ్రామ పునర్నిర్మాణకేంద్రమువారు 1-4-33 నుండి 30-6-33 వరకు జరిపిన వేసంగి పాఠశాలలో పఠించిన నూరుగురు విద్యార్థులలో 40 మంది హరిజన బాలబాలికలు. వీరెల్లరు సవర్ణులప్రక్కనే కూర్చొని పాఠములు నేర్చుకొనిరి. గ్రామస్థులెల్లరునుగూడ వీరి కృషికి మంచిప్రోత్సాహమొసగిరి.

* * *

హరిజనులలో నున్నతవిద్యను ప్రోత్సహించుటకై దేవిడుగారు పెద్ద మొత్తమునిచ్చియున్నారు. ఇందుకొరకు 177 విద్యార్థివేతనపుదరఖాస్తులు వచ్చినవి. ఇప్పటికి 41 శాంక్షనుకాబడినవి. వీనిలో 5 మన ఆంధ్రజిల్లాలలోని హరిజనుల విద్యార్థులకు వచ్చినవి. బి. సూర్యనారాయణమూర్తిగారికి, పాము రామమూర్తిగారికి, జి. గన్నిరాజుగారికి నెల 1-కి రు 15 లు చొప్పునను, బి. రాజారామమోహను, బి. వెంకన్నగార్లకు చెరియొక రు 10 లు చొప్పునను శాంక్షను చేయబడినది.

* * *

తిరువాన్కూరు సంస్థానములో హరిజనులు మొదలగు నిమ్నజాతుల నిమిత్తము 6500 ఎకరముల భూమి ప్రత్యేకపరుపఁబడినది. ఈభూములను వారు అమ్మకూడదు. తక్కిన సర్వహక్కులను అనుభవించవచ్చునని ల్యాండు రివిన్యూ కమీషనరుగారు శాసనసభలో చెప్పిరి.

చిదంబరము హాస్టలులు:—

శ్రీయుత టి. ఆర్. వెంకట్రామ శాస్త్రిగారు చిదంబరములోని నందనారు పాఠశాలను దాని వసతి గృహములు రెండింటిని చూచి యిట్లు వ్రాయుచున్నారు.

ఒకహాస్టలులో 60మంది బాలురును మరియొకహాస్టలులో 20 మంది బాలురునునున్నారు. వారెల్లరును

మాంసాహార వర్జితులే. ఉదయమే స్నానములు చేసి విభూతి రేఖలను మూడేసి గా స్ఫుటముగా ముఖముల పై దాల్చి చదువుకొందురు. వీరిలో కొందరు సవర్ణుల కంటె ఎక్కువ చామనచాయయు వర్చస్సును గలవారు వీరందరును తేవారములు స్వచ్ఛముగ భక్తిరస మూడి పడునట్లు పాడగలరు. రెండు హాస్టలుల మధ్యను ఒక దేవాలయము కట్టబడుచున్నది. దానికి రు. 4000లు అగును. వారికి భగవద్భక్తి నేర్పబడు చున్నది కాని బలవంతముగ దేవాలయములలో ప్రవేశించవలెనను భావములు బోధింపబడలేదు. చుట్టు ప్రక్కలనుండు సవర్ణులెల్లరును దేవాలయప్రవేశము తలపెట్టనంత సేపు తమకు తోచిన సహాయము హరిజనుల నిమిత్తము చేసెదమని చెప్పుచున్నారు. వీరి దేవాలయమును సవర్ణదేవాలయవలెనే యున్నది. విగ్రహములు, ధ్వజస్తంభము, మంటపము మొదలగు వాని చిత్రపటములను తీసి వార్తాపత్రికలకు మఠములకు పంపవలెనని నేను సలహానిచ్చితిని. ఇది స్వామి సహజానంద గారి శ్రద్ధవలన జరుగుచున్న పని. స్వామివారు శాసనసభ్యులను కలసి మాటలాడి ప్రభుత్వమునుండి తగిన సహాయము నిందుకొరకు బడయుదురుగాక!

* * *

మహాత్ముడు—హరిజన బాలురు:—

మహా:—ఏదీ, కొంచెము మీ ఉపాధ్యాయుని గురించి మాటలాడుకొందాం. అతి సెట్టివారు?

విద్యా:—(అందరును ఏకకంఠముగా) చాలా మంచి వారండి.

మహా:—అతను బాగా పాఠం చెప్పగలరా?

విద్యా:—మంచి బాగ!

మహా:—అతడు మిమ్ములను కొట్టునా?

విద్యా:—ఎన్నడూ కొట్టరండి.

మహా:—సరే. అతనివద్ద సెట్టి లోపములును లేవన్న మాట!

విద్యా:—ఆహా! లేవండి.

మహా:—అదెట్లు సాధ్యము! ఎట్టి లోపములును లేనివారి నెవ్వరినైన మీరెఱిగినచో చెప్పుడు.

విద్యా:—(కొంచెమాలోచించెదరు)

ఒక విద్యార్థి:—ఆc! మీరే.

మహా:—కాదు. నే నట్టివాడనైనచో ప్రభుత్వము వారు నన్ను మాటిమాటికి జైలుకు పంపుదుం దురు?

విద్యా:—(ఏమీ తోచక ఆలోచించుచుందురు)

మహా:—చూడండి. పరమేశ్వరుడుతప్ప లోపములు లేనివా రెవ్వరును లేరు. మీరును అతనివంటివా రగుటకు ప్రయత్నింపుడు. మీలో సెట్టిలోప ములున్నను సత్యమును మాత్రము తప్పకుడు. అట్లాచరించినచో మీ కెట్టి దుఃఖమును చేకూరదు.

(హరిజన పత్రిక)

హరిజనవీథులు, పంచాయితీలు:—

దేశాభివృద్ధికి ప్రధానసమస్యగా పరిగణింప బడుచున్న హరిజనోద్యమమునుగూర్చి పంచాయితీలు చాలపని చేయవలసియున్నది. ఎచ్చటనో స్వల్ప సంఖ్యగల పంచాయితీలుతప్ప తక్కినపంచాయితీలు ఈవిషయమున కదలిక చూపుటలేదు. హరిజనోద్య మములో దేవాలయ ప్రవేశసమస్య ప్రధానముగ నున్నదనియు, పల్లెటూళ్లయందు జనాభిప్రాయ మీ విషయమున నేకగ్రీవముగ లేదనియు, పంచాయతీలు ఆవిషయమున పనిచేయ ప్రారంభించినచో గ్రామమున కక్షలుప్రారంభమై మొదటపంచాయతీలకే మోసము వచ్చుననియు కొందఱనుచున్నారు. ఆమాటలు నిజములని మేమును అంగీకరించుచున్నాము. అస్పృ శ్యతాదోషమును నశింపచేయవలయునని భగవత్సం కల్పమైనట్లు నిశ్చయములగు సూచనలు కన్పట్టు చున్నవి. కాని హరిజనోద్యమము విషయమున నిది తప్ప సిక చేయదగినకార్యములు లేవని చేతులుముడుచు కొనికూర్చుండనక్కరలేదు. వివాదగ్రస్తములగు దేవా లయప్రవేశాదులయందు పనిచేయలేని పంచాయితీలు నిర్వివాదవిషయములలో మిగులశ్రద్ధవహించి పనిచేయ వలసియున్నది. ఈజిల్లాలో (తూర్పు గోదావరి) క్రిస్టియనులు 650000లకు పైగా నున్నారు. మొత్తము

జనసంఖ్యలో ఐదవవంతు అనగా నూటికిరువదిమంది వంతున నిమ్నజాతులున్నట్లు తేలుచున్నది.

హరిజనులయొక్క పల్లెలు ప్రతిగ్రామమునందును సామాన్యముగా చివరభాగమందు అనారోగ్య ప్రదేశములలో నుండును. ఆపల్లెలలో వీధు లుండవు. వారి యిండ్లలోనికి పరిశుభ్రవాయువు వచ్చుటకు తగిన యవకాశములుండవు. ఇండ్లు విశాలముగా లేక, చుట్టు గుడిసెలుగానుండి యనారోగ్యమున కాలవాలమై యుండును. వారి యిండ్లచుట్టును, పెంటపోగులు గడ్డితుక్కు మొదలగు కల్మషపదార్థములు నుప్పలుగానుండును. ఆపల్లెలచుట్టును, వర్షపు నీరు నిలువయుండి, ఎటుపోవుటకును మార్గములేక పోవుటచే యందుండి దుర్వాసనతో గూడిన వాయువు బయలువెడలి యాపల్లెలను నింపుచుండును. ఈ పల్లెలు అనారోగ్యముగ నుండుటచే తఱచుగ కలరా స్ఫోటకము మొదలగు సాంక్రామికవ్యాధు లందు జనించి హరిజనులకేగాక తన్మూలమున గ్రామమునకంతకును గూడ నుపద్రవము కలుగచేయుచుండును. వారు నివసించుపల్లెలను ఆరోగ్యవంతములుగ జేయుట పంచాయతీల విధులలో ముఖ్యమైనది. పంచాయతీలున్న ప్రతిగ్రామమువారును ముందుగ హరిజనులపల్లెలను బాగుచేయుటకై తమశక్తినంతను ఉపయోగింపవలయును. ఈకార్యములో మతమునకెట్టి విరోధమునులేదు. ఈకార్యముల కేపూర్వాచారపరాయణుడును, ఏయగ్రజాతీయుడును, ఆటంకమును కలుగజేయజాలరు.

ఈపల్లెలకు సమీపములో అసల్ మినహాలలో ఎత్తైన ప్రదేశములున్నయెడల, దొరతనమువారికి వ్రాసి వాటిని నివేశనస్థలములుగా మార్పించవలయును. అసలు మినహాలు లేక, ఎవరివైన స్వంతభూములున్న యెడల, పంచాయతీలు వారివద్ద ఖరీదునకు పుచ్చుకొని గాని, వారు ఖరీదునకివ్వనిచో భూసంపాదనపు శాసనముక్రింద బలవంతముగా సంపాదించిగాని, వాటిలో నివేశనస్థలముల నేర్పాటుచేయవలయును. ఆస్థలములను మామూలురీతిగా గాకుండ, మధ్య మధ్య వీధులనేర్పరచి, ఆరోగ్యపద్ధతులమీద ఇండ్లను కట్టుకొనునట్లు యేర్పాటుచేయవలయును. ఈపద్ధతులు చెప్పుటతోడనే ద్రవ్యమెచ్చటనుండివచ్చునను ప్రశ్న బయలుదేరకమానదు. ఉత్సాహముతోడను ఓర్పుతోడను గ్రామములందుండు పెద్దలు పనిచేసినచో ద్రవ్యము సాధ్యముకాకపోదు. పాతపల్లెలలో నుండు వారు కొంద రీక్రొత్తచోటులకు కాపురమునకు వచ్చినచో పాతపల్లెలలో ఆస్థలములు ఖాళీలగును. అప్పుడచ్చటకూడ వీధులను యేర్పాటుచేయవచ్చును. అస్పృశ్యతానివారణమునకు పునాది, వారు కాపురముండు యిండ్లను, బాగుచేయుటయే యని మాయభిప్రాయము. తాత్కాలికావేశముతో ఒకమారు రెండుమారులు దేవాలయప్రవేశము చేయుదురనుకొనుడు. అంతమాత్రముచే వారికభివృద్ధి కలుగబోదు. దేవాలయములలోనికి అగ్రజాతులిప్పుడెంతగ బోవుచున్నదియు నంద ఱెఱింగినదియే.

(లోకబంధుపత్రిక.)

ఆంధ్రరాష్ట్ర హరిజనసేవాసంఘపు నివేదికప్రకారము ఆంధ్రదేశమున యీదిగువమార్పులు మతవిషయమున జరిగినవి.

1 తాడేపల్లిగూడెంలో 80 యేళ్లక్రితము నిర్మింపబడిన శ్రీనరసింహస్వామి దేవాలయములోనికి హరిజనులను రానిచ్చిరి. 2 నెల్లూరుజిల్లా గూడూరులో ప్రాచీనమగు శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామి దేవాలయములోనికి హరిజనులను రానిచ్చిరి. 3 తాడేపల్లిగూడెం సంఘమువారు హరిజనులకొక భజనమందిరమును నిర్మించిరి. 4 హరిజనులకు భగవద్గీతను బోధించుటకు ఒకరు గుంటూరు మండల సంఘమునకు 50 రూపాయలనిచ్చిరి. సంఘమువారు తమ నిధిలోనుండి మరి 50 రూపాయలువేసి యీ 100 రూపాయలతోను 1950 ప్రతులు గీతను ముద్రించి హరిజనులకు ఉచితముగా నిచ్చుచున్నారు.

# పెండ్లి ముచ్చటలు

విధవావివాహములు చేయించుటకు సనాతన పురోహితులెవ్వరు నొప్పుకొనకున్నారు. ఒకరిద్ద రంగీకరించినను తమ కెక్కువగ కట్నము కావలెనని నిక్కుచున్నారు. ఇట్టి ఇక్కట్టులనాపి సంస్కారకుల కెల్లరికి సహాయము చేయుటకు భీమవరం కా॥ వేలూరు రంగనాథంగారను 18 సంవత్సరముల యువకులు, స్మార్తము బాగ తెలిసినవారు సిద్ధముగా నున్నారు. భీమవరం శ్రీ పునర్వివాహ సంఘ కార్యదర్శి భమిడిపాటి సూర్యనారాయణగారి ద్వారా వ్రాసి వారిని వశిష్ఠుగా పిలచినచో వా రాంధ్రదేశమున నెచ్చటికైనపోయి కార్యము చేయించి ఎంత కట్నమిచ్చిన అంతటితోనే తృప్తిపొందెద రని జూలై 27వ తేది ఆంధ్రపత్రికయందు ప్రకటింపబడినది.

* * *

చీరాలనగరమున 27-7-33వ తేది, శ్రీముఖనామ సంవత్సర శ్రావణ శుద్ధపంచమినాటి రాత్రి గ. 12-15లకు సుముహూర్తమున శ్రీయుత మద్దాల పేరిశెట్టిగారి కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతి సత్యవతీదేవిగారికిని, వేటపాలెం కాపురస్థులు కీర్తిశేషులైన కోడూరు గురునాథం శ్రేష్ఠిగారి పుత్రుడు చిరంజీవి బోల్లిశెట్టిగారికిని వివాహమహోత్సవ మత్యంతవైభవముగ జరిగినది. యథాశాస్త్రీయముగ కన్యాదాతలు స్వయముగ కుతూహలముతో ఈ వివాహమును జరిగించిరి. వివాహము వేదమంత్ర విధిప్రకారము జరిగినది. పురోహితుడు తెనాలినుండి వచ్చిన గుడిపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారు. చీరాల గ్రామములో పునర్వివాహము జరుగుట కిదియే మొదటిదిగాన శ్రీ పురుషాదులనేకులు వివాహమును తిలకింపవచ్చిరని వి. వి. శ్రేష్ఠిగారు వ్రాయుచున్నారు.

* * *

మా సేపల్లి రంగనాయకులుగారి కుమారుడు 15 సంవత్సరముల యీడుగల బాలునకును పుల్లూరి రామయ్యగారి కొమార్తె సుబ్బరాజు అనే 9 సంవత్సరముల బాలికకును వివాహము జరిగెను. జిల్లా మేజిస్ట్రీటుగారు వధూవరుల తండ్రులకు చెరియొక రు. 100 లు జరిమానా విధించెను.

* * *

బి. కేశవస్వామిగారి కుమార్తె 9 సంవత్సరముల వయస్సుగల పిల్లను టి. వెంకట్రామయ్యగారి కుమారుడు 17 సంవత్సరముల వయస్సుగల యువకునకిచ్చి వివాహము చేసినందుకు రు. 150లు జరిమానాయును లేదా వారము దినములు ఖైదు రు. 25లు జరిమానాయున్ను పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరుగారు విధించిరి. జరిమానాలో రు 15లు కేసుపెట్టిన కనిగొళ్ల జనార్దనరావు గుప్తగారి కొసంగబడెను.

* * *

విశాఖపట్టణముజిల్లా మేజస్ట్రీటుగారు శారదా ఆక్టుకు విరుద్ధముగ జరిగిన మూడు పెండ్లిండ్లలోని ముద్దాయీల నెల్లరిని విచారణచేసి ఒకొక్కరికి రు. 25లు మొదలు రు. 50లవరకు యథావిధిగ ఆగష్టు 12 తేదీని విధించిరి. ఇదేదినమున పశ్చిమ గోదావరిజిల్లా మేజస్ట్రీటుగారు డి. పుల్లయ్య, వి. వీరయ్య, యమ్. సుబ్బమ్మగార్లకు రు. 50, రు.15, రు. 100లు శారదాఆక్టు 5వ సెక్షనుక్రింద నేర మొనర్చినందుకు జరిమానా విధించిరి. పశ్చిమ గోదావరిజిల్లా వేల్పూరులో శారదాఆక్టుకు విరుద్ధముగ 15 ఏండ్ల బాలునకు 9 ఏండ్ల బాలికకు జరిగిన యొక వివాహములో వరుని తండ్రికి రు. 150లు, తాతకు రు. 50లు, వధువు తల్లికి రు. 100లు, పురోహితునికి రు. 15లు జరిమానాలు విధించబడినవి. ఈ వివాహములో పెళ్లివారందరు నేతవృత్తివలన జీవించు సాలెవాండ్రు.

# వివిధవిషయములు

ఇంగ్లండులోగల 40000 డాక్టరులలో 2000 మందిమాత్రమే స్త్రీలు.

◆ ◆ ◆

బరోడాలో వర్ణభేదబాధానివారణశాసనపు ముసాయిదా ప్రకటింపబడినది. దానిప్రకారము ఇప్పుడున్న తెగలనుమించి క్రొత్తవి యేర్పడకూడదు. వీనినైనను పాటింపక వివాహభోజనాదులు చేసికొను వారిని కులమువారెవరును బహిష్కరింపరాదు, వారికి జరిమానా విధింపరాదు. అట్లు చేసినచో ఆరునెలలు విడిఖైదు, రు 100 లు జరిమానా, లేక రెండును విధింపబడును.

◆ ◆ ◆

లక్నో నగరమున బాలికలకు నిర్బంధముగ ప్రారంభవిద్య నేర్పింపవలెనని పురపాలకసంఘమువారు తీర్మానించిరి.

◆ ◆ ◆

లండనులో జరుగుచున్న జాయింటు సెలెక్టుకమిటీ సభలో సేన్ ముఖర్జీసతి గార్లు, స్త్రీలనియోజకవర్గము పెంపు చేయుటకు వయోజననియోజకవాధికారము సాధ్యము కాకపోయినచో మరియొకమార్గమునైనను ప్రభుత్వమువారరయవలెనని సాక్ష్యముచెప్పిరి. అమృతకౌర్, ముత్తులక్ష్మిరెడ్డి హమీదాలిసతి గార్లు వయోజనవోటాధికారమే యుండవలయుననియు, అది లేనిచో గండవపక్షముగా వేరొకమార్గము నరయవలెననియు సాక్ష్యముచెప్పిరి. వర్ణాశ్రమ స్వరాజ్యసంఘము దేశవినాశకర సంఘమని రెడ్డిసతి గారు సాక్ష్యమిచ్చిరి. తక్కినవారు దానిపేరే తామువినలేదని వక్కాణించిరి.

◆ ◆ ◆

బ్రిటనులోజరిగిన స్త్రీల చదరంగప్రపంచపందెములో ఫతీమా యను నొకభారతయువతి గెలుపొందెను. భారతనారీమణులు బ్రిటిషునారీమణులకు బుద్ధి విషయములో తీసిపోరనుట కిదియొక నిదర్శనము.

◆ ◆ ◆

బ్రిటనులో స్త్రీలకు ఉంగరముల జుట్టుపైన నెక్కువప్రీతి. జుట్టుకీ మెలికలు కలుగు పరికరము లను కొను నిమిత్తము సంవత్సరమునకు 6 కోట్ల పౌనులు వెచ్చమగుచున్నవట.

◆ ◆ ◆

క్లెంప్టన్ సెకండరీ పాఠశాలాంతరగతుల నుత్తమగుణములతో (Highest marks) నుత్తీర్ణయై స్కాలరుషిప్పుతో కేంబ్రిడ్జి గర్టన్ కాలేజిలో గణితశాస్త్రమును చదివి, గణితశాస్త్రములో నుత్తీర్ణురాలై, రేంగ్లర్ అను మహోన్నత శాస్త్రపదమును బడసిన మిస్. ఎల్. బ్రోనాస్కీ అను నామె 21 యేండ్ల బాలిక. ఈమె తన హైస్కూలు తరగతులలోకూడ అనేక స్కాలరుషిప్పుల నందుచుండెను. పరీక్షప్యాసగుటకునై దామెకొక లీలామాత్రముగ గాన్పించుచున్నదనియు, తనకు, సినీమాకు వెళ్లుటనిన్ను, గ్రంథపఠనమనిన్ను, ఈతకొట్టుటనిన్ను, టెన్నిస్, హాకీ, నెట్ బాల్ మొదలగు నాటలనాడుటనిన్ను, కుతూహల మధికముగ కలదనియు జనులతో చెప్పుచుండునట. "ఈ రేంగ్లర్ పరీక్షయెంతయో కష్టముగనుండు ననుకొంటిని, గాని నేను మొదటి తరగతిలో కృతార్థురాలనగుదునని యెంచనైతి"నని యామె కొందఱితో ననెనట. 'ఈపరీక్షకు నేను గ్రంథములను అర్ధరాత్రివరకు ప్రతిదినమును చదివినదానను గాను. నాకు స్కాలరుషిప్పు యింకను లభించునెడల 'Analytical theory of numbers' అను విషయమునుగూర్చి పరిశోధన గావింపఁ గోతూహలినై యున్నా'నని యామె యనెను.

◆ ◆ ◆

—అకుండి వెంకటశాస్త్రి.



యంబ్రహ్మవేదాన్తవిదోవదన్తి। పరంప్రధానం పురుషంతదాన్యే
విశ్వోద్గతేఃకారణమీశ్వరంవా। తస్మైనమోవిఘ్నవినాయకాయ.



చిరంజీవి ఝాన్సీ

# సంపాదకీయములు

## పుష్కరపు ఏర్పాటులు:—

కృష్ణవేణీపుష్కరములు ముగిసినవి. బెజవాడ పట్టణమేమి, కృష్ణానది కిరుకెలంకుల నున్న ప్రదేశములేమి ఇరువది దినములపాటు కలకలారవములతో జనసంకులములై యుండెను. ఏక్షణము చూచినను లక్షయాత్రికులకు తక్కువ యుండెడివారు కారు. దినమునకు 15000 మంది క్రొత్తవారు వచ్చుచు ప్రాతవారు పోవుచుండుటచే రైలుస్టేషను, ఎంతపెద్దదిగా పొడిగించబడినను, కిటకిటలాడుచునే యుండెను. పుణ్యమనుపేరు పెట్టినంతనే మనభారతదేశమున నింతమంది కాదు మరియింతమంది జనమైనను సమావేశమగుటలో ఆశ్చర్యములేదు. ఇట్టివారికివలయు సదుపాయములు కూర్చుట, ఆరోగ్యమును కాపాడుట, అపాయములు రాకుండ వర్తక స్థలములు, ప్రయాణమార్గములు, స్నానఘట్టములు, ఉత్సవప్రదేశములు మొదలగువానియొద్ద నేర్పాటులుచేయుట సామాన్యపుపనికాదు. ఆరోగ్యశాఖవారు, పురపాలకసంఘమువారు, పోలీసువారు, రైల్వేవారు ప్రజానాయకులు సర్వులును కలసి చేయవలసినపనియిది.

ప్రయాణికులకొరకును యాత్రికులకొరకును నీయేదు బెజవాడవద్దచేయబడినన్ని సౌకర్యము లిదివరకెన్నడును నెచ్చటను చేయబడలేదు. పాకలు వేయబడినవి. విద్యుద్దీపములు పెట్టబడినవి; కొళాయిల ద్వారా ఆరోగ్యకరమగు నీరు ఈయబడినది; పాకల ప్రాంతము లెప్పటికప్పుడు పరిశుభ్రము చేయబడుచు వచ్చినవి. చుట్టుపట్ల పట్టణములలో కలరాయున్నను ఒక వ్యాధిగ్రస్తుడీ సమూహములోనికి రాకుండ యాత్రికులలో నొక్కనికి వ్యాధికాని మరణముకాని సోకకుండ చూడబడినది. ఇంత జన సంఘములోను వర్తకపు రవాణాలు జనుల రాకపోకలు ఒక్కనిముషమాలస్యము కాకుండునట్లు సాగుచునే వచ్చినవి. జనుల వినోదములకొరకు రేడియో గ్రామఫోను పాటలు ప్రసంగములు జరుపబడినవి. ప్రజలలో తొడిత్రొక్కిడియును మాటలేక యెల్ల కార్యములు నీటుగను, అనుకూలముగను, శాంతముగను,నిరపాయకరముగను జరుగుట మిగుల ఆహ్లాదకరము. ఈ యవకాశము నూతగగైకొని దేశసేవక ప్రముఖులు ఖద్దరు ప్రదర్శనములను స్వదేశీవస్తు ప్రదర్శన

ములను తెరచినారు. ఆంధ్రదేశ గ్రంథాలయముల రజతోత్సవమును జరిపినారు. ఇట్టి సందర్భములలో నెల్ల విజ్ఞానకరములగు పెక్కు ఉపన్యాసములు మహనీయులచే నొసంగబడినవి.

పేదసాదలకు అన్నదానము చేయబడినది. అయినను ఇది యెక్కడ పట్టిన నక్కడకాక ఒక నిర్ణీతస్థలమున పరిశుభ్రముగ జరుపబడినది. ఈసమయమున శ్రీయుతులు పొట్టి స్వామిగారు, గొల్లపూడి నరసింహారావుగారు, గణపతిశెట్టిగార్లను మేము మిక్కిలి ప్రశంసించుచున్నాము, వీరికి యాత్రికులయందుగల భక్తియు, పేదసాదలయందుగల దయయు నిరుపమానములు. వీరు మిక్కుటముగ భోజనపదార్థములను జతపరచి, వండించి, బ్రాహ్మణులకు, ఆర్యవైశ్యులకు, ఇతరజాతులకు వారివారి ఆచారవ్యవహారముల కనువగురీతి నన్నిదినములు అన్నదానముచేసిరి. దినమునకు కనీస మైదువేల జనమైనను వీరి సత్రమునం దృప్తులగుచుండిరన్న నీ మహనీయులపుణ్య మేమనవచ్చును!

ఈసంవత్సర మతి వర్షములవల్ల ఈ యేర్పాటులకు కొన్ని విఘాతములు కలిగినను యెప్పటికప్పుడు వాటిస్థానే క్రొత్త యేర్పాటులు వెంటనే జరిగినవి. హిందూదేశము పుణ్యభూమి: క్షేత్రమయము. ఎప్పుడో యొకప్పు డనేకస్థలములలో నిట్టి సమూహములు కూడుచునేయుండును. ఇట్టి వానినెల్ల సవ్యముగ జరిపించుటకు వలయు సూత్రములను వివిధశాఖలవారును ప్రజాసేవకులును తెలుసుకొని అనుసరించి అనుభవమునందుట యెంతయు ఆవశ్యకము. అట్టివారి కెల్లరికి బెజవాడలో జరిగిన కృష్ణాపుష్కరపు టేర్పాటు లాదర్శప్రాయములై యుండుననుట కాటంకములేదు.

భారత దేశపు ఉత్తమాంగము:—

కాంగ్రెసుసంస్థ అక్రమాందోళనమునకు దిగినదని చెప్పి ప్రభుత్వమువారు దానినొక వరుసను నిర్మూలించుచున్నారు. ప్రభుత్వమువారు దానినక్రమసంస్థగ నిర్ణయించి తత్సేవకులను హింసించుచున్నారనియు అదిరహస్యకార్యక్రమమునకు దిగుచున్నదనియు చెప్పి గాంధిమహాత్ముడును, అనీగారును దానినసలే కొంతకాలమువరకు నత్తివేసిరి. కాంగ్రెసుచే అక్రమాందోళనమును విసర్జింపజేసి శాసనసభాప్రవేశ మంగీకరింపజేసి రాబోయే సంస్కరణములను మనఃపూర్వకముగ పనిచేయనట్టిప్పుడే యొప్పన్నము వ్రాయించకుండా, తోవ చూపవలసిన సమయమున కాళ్లు కూడ తెగగొట్టి గాంధిమహాత్ముడు దేశము నయోమయములో త్రోసివేసెనని కొందరు, శాసనసభాప్రవేశవాదులు మహాత్ముని దూషించుచున్నారు. ఇట్టి సమయమున సుప్రసిద్ధ బ్రిటిషుసామ్రాజ్యవాదియగు రైటానరబిలు శ్రీనివాసశాస్త్రిగారి (కాంగ్రెసును గూర్చిన) యభిప్రాయమును తిలకించిన దేశాభిమానులెల్లరి హృదయములు నువ్వెత్తుగ నుప్పొంగకమానవు. వై. యమ్. సి. ఏ. పార్లమెంటును తెరచుచు శాస్త్రిగారు 7-8-33 తేది నిట్లుపన్యసించిరి:—

“కాంగ్రెసు దేశమున కెనలేని గౌరవమును బలమును చేకూర్చినది. ప్రపంచ

మున నెల్లెడలను మహాత్ముని నామము మారుమ్రోగుచున్నది. హిందూ దేశపు పశ్చిమభాగమున నూరును పేరును లేని ఒక సంస్థానములో పుట్టిన ఒక సాధారణ కుటుంబమునకు చెందిన వ్యక్తి, తన త్యాగ తపశ్శక్తులవలన జగమంతటి పొగడ్తకు పాత్రుడై, దేశమంతటియొక్క నిష్కళంక సంపూర్ణవిధేయత నందగల్గుటను చూచి మన మెంతయు గర్వించవలసియున్నది. కాంగ్రెసుపార్టీకి మున్నెన్నడును మనము కని విని యెఱుగని సమష్టిశక్తి నేడు కలిగినది. గాంధిమహాత్ముడు, తన సిద్ధాంతసూత్రముల చొప్పున నేడు కారాగారములోనికి పునః ప్రవేశ మొనరించినాడు. అతని స్థానమును గైకొనుటకు అతనివంటి గౌరవాధికారములుగల వ్యక్తి మరియొక డీదేశమున లేడు. అతను బందిఖానా కేగినతోడనే యింతటి కాంగ్రెస్సును నిస్సహాయమైనది. దేశమునకు నేడొక క్రొత్తకార్యక్రమము కావలసియున్నది. అట్టిమార్గమును చూపి దానిలో నడుపఁగలధీరుడు కావలసియున్నాడు.'' అట్టి ధీరుడు మహాత్ముడే తప్ప వేరొక్కడు లేడని శ్రీ శాస్త్రిగారి వాక్యములవల్లనే స్పష్టమగుచున్నది. ఏదేశపు మానవసాముదాయక శరీరమునకైనను శిరస్సుతో తుల్యమగు మహానీయు డొక్కొక్క సమయమున నొక్కొక్క డుండును. అతనిని మినహాయించినచో తక్కిన మానవసముదాయమెల్లయు శిరము లేని మొండెము. 'సర్వత్ర గాత్రస్య శిరః ప్రధాన'మనునట్లు అట్టి యుత్తమాంగమును తృణీకరించుటకంటె దేశమున కవమానము కాని ప్రభుత్వమున కనాగతముకాని వేఱొండులేదు. మహాత్ముని పునఃకారాగారప్రవేశముతో దేశమున కొక మొనగాడును, ప్రభుత్వమున కొక కార్యకారికాగల సచివుడును దవ్వైరనుట కాటంకములేదు. ప్రపంచస్థితి యెన్నడు నొక్కరీతిగ నుండిపోదు. దుఃఖకరములగు నిట్టి సమస్యలెల్లయు పరిష్కారమై అనురాగైకమత్యములతో కూడిన సుప్రభాత మీప్రపంచ మంతటిపై మెఱయు నున్నదని శాస్త్రిగా రాశించుచున్నారు. మనమును నాతని యాశలో పాల్గొని వేచి యుందము.

తారకమంత్రములు !:—

అధునాతనయంత్రనాగరికతకు పూర్వము ఒక దేశము కాకపోయిన వేరొక దేశమైన అష్టైశ్వర్యములతో తులతూగుచుండెడిది. ప్రతిదేశమును నొకప్పుడు కాకున్న వేరొకప్పుడైన భోగభరితమైయుండెడిది. యంత్రాభివృద్ధియైన తరువాత ప్రపంచమెల్ల యొక్కటియై యొక్కపడవనెక్కి ఒక్కతీరు కష్టములను దుఃఖములను అనుభవించుచున్నది. ఇందు మరియొక విశేషమేమనగా ప్రతిజాతియు సర్వప్రపంచశాంతి సౌఖ్య సౌభాగ్యములకొరకై ప్రయత్నించుచున్నట్లు నటించుటయే తప్ప, బలవంతముగ కనిపించు జాతి యెద్దికాని తన ఆయుధబలమును తగ్గించుకొననొల్లదు, విరోధభావములను మార్చుకొన కోరదు, ఉత్పత్తి వర్తక విధానములను దిద్దుకొన నిష్టపడదు. ఉత్తమాశయాడంబరములతో దుర్బలజాతుల

స్వాతంత్ర్య సౌభాగ్యముల తమ జాతీయాభివృద్ధికొఱకెట్లు భుక్తము చేసుకొనుటయా యనియే అవి తంత్రాలోచన చేయుచున్నవి. ఈ మధ్యను ఐరోపాఖండములో ప్రపంచ పునర్నిర్మాణముకొఱకెన్ని మహాసభలు భూరి భేరీరవములతో ఉత్తమాశయములు ప్రకటించుచు ప్రారంభమైనవో అన్నియు ఆర్థిక, ఆయుధవిసర్జన, ఒట్టావా, గుండ్రబల్ల సభలెల్లయు పరిహాసాస్పదముగ తుదముట్టినవి, ముట్టుచున్నవి. ఇట్టి సమయములో అంతర్జాతీయసమితియొక్క విజ్ఞాన సహకార (ఇంట్లలెక్చ్యుయలు కోఅపరేషను) సభ యను నొక కందపిలక మొలచి జూలై రెండవ మూడవ వారములలో సమావేశమై వివిధజాతుల సాంఘిక రాజకీయసంబంధములనుగూర్చి శాస్త్రీయపద్ధతులపై పరిశోధించి తెలుసుకొనవలెనని యొక మహదాశయమును ప్రకటించి పారవేసినది. ఈసమితి సభ్యులలోనెల్ల శ్రీయుత సర్. రాధాకృష్ణను గారు నక్షత్రాయమానముగ ప్రకాశించుచున్నారు. ఈసమితి ప్రపంచ దౌర్భాగ్యనికర నిర్మూలనముకొఱకెట్టి పరిష్కారములను మధించి తేగలదను విషయముకొఱకై మనము దుర్దాహముతో వేచియుండ నక్కఱలేదు కాని రాధాకృష్ణనుగారి యుపదేశపంచామృతములు దేశదేశముల సదాశయుల శ్రవణరంధ్రములలోనికి తొలకి విజ్ఞానప్రపంచమునసెల్ల వెండివెన్నెలలవలె విరాజిల్లుననుట కాటంకములేదు. అందలి యొకతరంగమును బ్రాడుకాస్టుగా చెప్పబడినదానిని మహా పుష్పచయములో ప్రకటించినాము.

ప్రపంచకమనిన కేవలము పాశ్చాత్యమును నవీనమునేకాదనియు, ప్రాచ్యపురాతన సంప్రదాయములతో గూడిన ఒక బ్రహ్మాండ ప్రపంచము చీనా జపాను ఇండియాదేశ సంప్రదాయములలోనున్నదనియు, అందును చీనా జపానుల నాగరికతకు హిందూదేశపు విజ్ఞానమే మాతృకయనియు, అట్టిసభ్యతను మనముహతమార్చి పూడ్చిపెట్టి మరణగీతములనుపాడి సంతసించుచున్నను అది చావక తన్నుకొనుచున్నదనియు, దానినిమనమెంత గేలిచేయుచున్నను దానికిచెందువారమని సగర్వముగ చెప్పుకొనుచుండు మహనీయులెంతమందోగలరనియు, వారెవ్వరును తెలివితేటలలోను ప్రజ్ఞలలోను సదాశయములలోను మనకెందుకును తీసిపోరనియు, ఇట్టియెడ మన యహంభావములను మనము కొంచెము మఱచిపోయి వాటితత్వమును గుర్తించినచో అది ప్రస్తుత విషమసమస్యలనెల్ల పరిష్కారమొనర్చి శాంతి సామరస్యములను ప్రపంచమున స్థిరపరచుననియు, ఆ దేశపు మహాపురుషుల నిరువురిని ఈకమిటీలో సభ్యులుగ చేర్చుకొనవలెననియు, మహాధైర్యముతో సెలవిచ్చిరి. వారిసలహాలును శిరసావహించబడెను.

అతని యుపదేశములసారము ప్రపంచవాసు లెల్లరికి మన్తవ్యము. ఇతర సభలవలె వారిసభ కూడ పరిహాసాస్పదము కాకుండవలెనన్న వారు కేవల మాలోచనలతో తమ కాలమును వెళ్లబుచ్చక విజ్ఞానులెల్లరు కార్యరంగములోనికి దుమికి ప్రపంచములోని నిరంకుశతత్వములతో పోరాడి అందు

వలన సంభవించు కష్టములకెల్ల సంసిద్ధులు కావలెనని హెచ్చరించుచున్నారు. ప్రస్తుత విజ్ఞానవంతులుకూడ ఈ మహదాశయమునకు విధేయులుకాక తమ జాతీయసమస్యల విషయము చర్చకు వచ్చినప్పు డాశయములను గుంటపెట్టి గంటవాయించి సామాన్యులకంటెను కేవలముగ ప్రవర్తించుచున్నందుల కాయన విచారించుచున్నారు. వివిధజాతుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ సంబంధముల పఠించి నిర్ణయించి, బోధించి, ఆచరించి, తత్తదావశ్యకములగు కష్టములనెల్ల భరించుట విజ్ఞానవంతుల ప్రధానకర్తవ్యమనుట కెట్టి యాటంకమునులేదు.

కాని యీ కొలంబన్సు లిట్టి తారకమంత్రములను కనిపెట్టుటకు పూర్వము చాలా కాలమునుండియే విజ్ఞానధనులగు మహాత్ములెందఱో యీపనిని చేయుచు పడరాని యిడుములను పడుచున్నారని వారు గుర్తించిరా? వారియెడల వీరొక సానుభూతి తీర్మానమునైన ప్రకటించిన నెంత బాగుండెడిది! అయినను వీరి నిర్ణయముల ప్రకారము వీరు ప్రపంచము నేమాత్రము ముందుకు తేగలరో కనిపెట్టుకొని చూతము.

పండిత సమ్మానము:—

"శ్రీరావుసాహెబు గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారి డెబ్బదవ జన్మదినోత్సవము 1933 వ సంవత్సరము నవంబరు నెల 19వ తేది ఆదివారమునాడు రాజమహేంద్రవరములో అతివైభవముతో జరపడానికి ఆంధ్రదేశములోని అన్ని జిల్లాలనుంచీ ఎన్నుకొన్న విద్యావంతులూ కవులూ జన్మదినోత్సవనిర్వాహకసంఘముగాఏర్పడి ప్రయత్నము చేస్తున్నా"రని ఏతత్సంఘ ప్రధానకార్యదర్శి తెలికిచర్ల వెంకటరత్నం పంతులుగారు ప్రకటించుచున్నారు. పంతులుగారి విజ్ఞానప్రతిభలనుగూర్చి మేమిప్పుడు ప్రశంసింప దొరకొనుట దివ్వెతో దినకరుని చూపించునట్లుండును. వారు అకలంకాంధ్రభాషా పాండిత్యశోభితులు—నిరుపమాన సాహిత్యసేవాపరాయణులు. నిర్వక్రవచనోపన్యాసప్రవాహధురీణులు. నిరాడంబరజీవనులు. విశాలహృదయులు. ఆధునికాంధ్రధీరశిఖామణులకెల్ల తిలకమువంటివారు. అట్టి మహనీయునికి షష్టిపూర్తిమహోత్సవ మతివైభవముతో చేసి సముచితముగుకీర్తిని గడించవలసిన యవకాశమును చేయిజార్చుకొనినందు కాంధ్రులెల్లఱు నెంతయు చింతించవలసియున్నది. వారిపుణ్యవశమున పంతులుగారు తదనంతరము చాలాకాలము (అనగా వారికి యితికర్తవ్యతా జ్ఞానము జ్ఞాపకముకలుగు) వరకు జీవించి భాషాసేవయు దేశసేవయు చేయుచుండగలభాగ్యము కలిగినది. ఆంధ్రులు తమ పొరపాటునుదిద్దుకొని తమకళంకమును బాపుకొనుటకు తగినయవకాశముచేకూరుచున్నది. పంతులుగారు కవులయినచో వారిగీతము లీపాటి కాంధ్రపాఠకజనుల రసజ్ఞలయందెల్ల తాండవమాడుచుండెడివి. గ్రంథకర్తలైనచో వారిపుస్తకములు ప్రతిపుస్తకశాలయందును విస్తరిల్లియుండెడివి. విలేఖరులైనచో పత్రికారాజములెల్ల వారివ్యాసములతో దొర్లుచుండెడివి. కేవలము నుపన్యాసకులైనచో

దేశము నాలుగుమూలలు వారి కంఠస్వరముతో మారుమ్రోగుచుండెడివి. కాని పంతులుగారు వీరిలో నేయొక్కరనుకారు. వీరి కెల్లరికి సాధకముగు సరస్వతియొక్క స్వరూపమును దర్శించి వీరెల్లరికిచూపించి, వీరెల్లరిని నిజమైనకవులుగ, గ్రంథకర్తలుగ, విలేఖరులుగ వక్తలుగ తయారుచేసిన, చేయుచున్న గురుపీఠాధిపతులు. రాబోవు తరములసాహితీ సేవక కుటుంబముల కెల్ల వారు నిరూపించిన పదములు, నిర్ణయించిన వ్యాకరణసూత్రములు, చూపించిన వాక్యములతీరులు వరవడులై విరాజల్లుచుండును. అట్టిమహనీయుని కృషిఫలితమును మనమెల్లరము వస్తుతః అనుభవించుచున్నను, మన ఆవేశములలో మనముకొట్టుకొనుచున్నకతమున మనరచనల కీ మనోహరసహజస్వరూప మెక్కడినుండి దిగివచ్చుచున్నదో గుర్తించలేకుండుటలో వింతలేదు. భాషాస్వరూపతత్వజిజ్ఞాసువులకు తప్ప అన్యులకు అతిసాధారణమైన యీవిషయము జ్ఞప్తికిరానేరాదు. ఏతద్రంగమునందెంతయు హెచ్చరికతోపనిచేయుచుండు వెంకటరత్నముగా రాంధ్రుల కీ సంగతిని జ్ఞప్తిపరచి మేల్కొల్పినందు కెంతయు అభివందనీయులు. 18, 19 తేదీలలో రావుసాహెబుగారి నాయకత్వముక్రింద అభినవాంధ్రకవిపండితసభా ద్వితీయసమావేశముకూడ జరుగును. అప్పటికి వారిగ్రంథములెల్లయు ప్రకటించి చందాదారులకు పంచిపెట్టబడును. పన్నెండు రూపాయీలువిలువగల వారి గ్రంథములు చందాదారులుగచేరి ముందుసొమ్ముచెల్లించు వారికి 10 రూపాయీలకే ఈయబడును. ఈధనముతోనే గ్రంథము లచ్చుకావలసి యున్నదిగనుక ఆంధ్రులెల్లరును చందాదారులుగచేరి గుంటూరులోనున్న కార్యదర్శి గారి కిప్పటినుండియే చందాలు పంపుచుండవలెనని కోరుచున్నాము.

జాతీయబాలికా పాఠశాల:—

తన ఆయురారోగ్యైశ్వర్యములను దేశమాత కర్పణముచేసి అకాలమృత్యుదేవతయొక్క ఆకలిచిచ్చున కాహుతియై కీర్తిశేషురాలైన శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి గారి సంస్మరణార్థము 1927లో ఏలూరులో స్థాపించబడిన శ్రీ అన్నపూర్ణాదేవి జాతీయ బాలికావిద్యాలయపువార్షికోత్సవము సెప్టెంబరునెల 2వ తేదిని జరుగును. ప్రస్తుత మిందు 100 మంది బాలికలున్నారు. అందు 15 గురు హరిజనబాలికలు. హిందీ, ఇంగ్లీషు, గణితము, సంగీతము, చిత్రలేఖనము, రాట్నము, కుట్టుపని, సమస్తము ఇచ్చుటనేర్పుగల ఆరుగు రుపాధ్యాయులున్నారు. అతికష్టముమీద నడచుచున్న త్యాగసంస్థ. బాలికలకు వసతులుకూడ చేకూర్చుటకు తగినప్రయత్నములు జరుగుచున్నవి. స్త్రీవిద్యాభిమానులును, దేశాభిమానులును ఏతద్వార్షికోత్సవమును విజయప్రదముగ నెరవేర్చి సంస్థకు తగిన ధనసహాయము చేయుదురుగాక !

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.